# పూర్ణాహుతి





‘ఆనంద్’





ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

# అంకితం

ఆదరించిన ఆ ప్తులందరకూ
హృదయపూర్వకంగా—

'ఆనంద్'

## గమనిక

ఈ నవలలోని పేర్లు, సంఘటనలు కేవలం కల్పితాలుకాని, వ్యక్తులను వుద్దేశించి వ్రాసినవి కావు.

— రచయిత.

# పూర్ణాహుతి

కమలం అంటే ఆ వూళ్లో ప్రతిఒక్కరికి గౌరవము, భక్తి ఉన్నాయి. ఆమె మాటను కాదని నడచేవారుకూడ చాల అరుదనే చెప్పాలి. ఆమెలో ఉండే ఆకర్షణ అటువంటిది. మనుష్యుల తత్వాలను మార్చి మనస్సులను ఆకట్టుకుంటుంది. అంతర్గతంగా ఆలోచించి ఆత్మసాక్షిగ సవిమర్శలుచేసే పెద్దలు ఆమెను అసహ్యించుకుంటారు కాని, యింతలో ఆత్మను, విమర్శనలను ప్రక్కలకునెట్టి ఆమెను చూడగనే ఆమె పొందుకై ప్రాకులాడుతారు.

కమలాన్ని గొప్పగ వర్ణించి చెప్పటం అనవసరం.

ఇప్పటివరకూ చూసిన అందగత్తెలలో అందగత్తె. ఆకర్షనీయమైనదీను. సౌమ్యస్వభావి. అందరితోను కలసికట్టుగ తిరుగుతుంది, మాట్లాడుతుంది.

ఆమె రూపురేఖలావణ్యవిశేషాలు ఆమెను చూచిన వారందరికి గంగవెట్టిలెక్కిస్తాయి. అందుకే పంచదారచుట్టూ చీమలు చేరునట్లు యింతో అంతో అందాన్ని ఆస్వాదించాలనే ప్రతి చంచల మనస్కుడు ఆమెతో మాట్లాడాలని, తిరగాలని యింకా...యింకా ఏవేవో చెయ్యాలని ఆతృతపడతాడు.

కాని వారి ఆతృత వేడిగాల్పులను చిమ్మి, హృదయాన్ని కాల్చి చివరికి నుసిఅయిపోతోంది. అందుకు కారణం

ఆమె అందలం ఎక్కికూర్చుంది. ఆమె అంతస్థుకు చేరుకోవా లంటే సామాన్యులకు అసాధ్యమే. కాని ఆమె ప్రాపుకై ఈ సామాన్యులు కూడ అడుగంటి, వున్నవి అంతరించక పీథులు పట్టకపోలేదు. అయినా వారికి ఆనందమే! హాయి!! యిహలోక స్వర్గం !!

చీకటిపోయి వెలుగు - వెలుగునంటి చీకటి - ఒకరుపోతే మరొకరు. నేడుపోయి రేపు.

చిప్పచేతిన పట్టుకొని తిరుగుతూన్న బిక్షాధికారులందరూ ఒకప్పుడు లక్షాధికారులు-తినడానికి లోటులేనివారు. యింతో అంతో ఆస్థిపాస్తులున్నవారు. అనేక సంసారాలు తినటానికి తిండి లేక అలమటించిపోతున్నాయి. ఇటువంటి పరిస్థితులలో కూడ వారు కమలం మెప్పుపొందటానికే తంటాలుపడతారు. అయితే ఆమె అందని పండుకాదు. అందరితోను సౌమ్యంగానే మాట్లాడు తుంది. ఆ సౌమ్యమే మనిషిని కలవరపెడుతుంది. ఇక ఆతృత. ఉండలేడు! నిలబడలేడు!! అనుభవించాలి. తనకు లేకపోయినా పెళ్ళాం పుస్తెనైనా తాకట్టుపెట్టాలి. అదీకాకపోతే ఎవరి నెత్తైయినా పగలకొట్టి తెచ్చి ఆమెకు అంకితం చెయ్యాలి.

ఒకక్షణం-ఏదో మధురానుభూతి ! మరుసటి క్షణం ఆ అనుభూతి ఎండమావి!

ఎన్ని సంసారాలో! ఎంతమంది స్త్రీల వుసురులో!

ప్రతి మగవాడు ఆమెను చూడగనే ఏ విధంగా కాంక్షి స్తాడో, ప్రతి స్త్రీ ఆమెపేరు వినగానే అంతకు రెట్టింపుగ క్షోభి స్తుంది. అసహ్యించుకుంటుంది. దానికి కారణం లేకపోలేదు. అవును, ఏ స్త్రీ తనభర్త ఏరాయి స్త్రీతో కులుకుతూంటే

చూసి ఊరుకోగలదు ? అందులోనూ ఆమె ఒక్కరితోను యిద్దరితోనూనా? అందరితోనూ!

పండు ఎంగిలిదని అందరకూ తెలుసు. అయితేనేమి తినాలని ఆకాంక్ష. జిహ్వా చాపల్యాన్ని ఏ వ్యక్తీ కాని చంపుకో లేదు కదా! ఆ చాపల్యాన్ని చంపుకున్నవాడు కామాన్ని చంపు కుంటాడు. అటువంటివాడు మానవాతీతుడనే చెప్పుకోవాలి.

ఆమెలో ఆ దాహం ఏమిటో ? ఎన్ని సంసారాలు కూలి పోతున్నప్పటికి ఆమెలో చలనంలేదు తోటిస్త్రీలు నరకయాత నలు అనుభవిస్తున్నారని చూస్తూన్నప్పటికి ఏ మార్పూలేదు. కరుడుగట్టిన రక్కసి హృదయం. సంఘాన్ని ఎదిరించింది. సంఘాన్ని కీలుబొమ్మ చేసింది. అవును సంఘమంటె పదిమందో, యిరువై మందో అంతకెక్కువో గల జనసమూహమేగా ! ఆ జనసమూహమే నేడామె చెప్పింది చెయ్యాలి. నడవ మన్నట్లు నడవాలి. వారూ ఆమె ఏంచెపుతుందో అని ఎదురు చూస్తూనే ఉంటారు ఆతృతతో.

సంఘాన్నే కూడగట్టుకున్న ఈ కమలం ఎవరు ? స్త్రీల పాలిటి ఈ రక్కసి ఎవరు? పాపభీతిలేని ఈ బండహృదయిని ఎవరు?

చాల విచిత్రం! ఈమెనుగూర్చి ఈ విధమైన ప్రశ్నలు వేసికున్నవారు ఆ వూరిలో అరుదనే చెప్పాలి. ఒకవేళ వేసు కున్నవారికి సరిఅయిన సమాధానం లభించే సూచనకూడ కన పడదు.

కొందరికి కొంత తెలుసు—

కమలం ఆ వూరువచ్చి పదిసంవత్సరాలు కావస్తు

స్నది. కాని అప్పట్లో ఆమె యింతపేరు గడించలేదు. కాని అదృష్టం కలసివస్తే బండ్లుఓడలు ఓడలుబండ్లు అవుతాయన్నట్లు ఈమె పరిస్థితులుకూడ మారిపోయాయి. అప్పటికి ఏరూపంలో ఉందో వయస్సు పెరిగినా యిప్పుడూ ఆ రూపంలోనే ఉంది. నవయవ్వనం తొణికిసలాడుతూ ముగ్ధమోహనంగా ముసిముసి నవ్వులు నవ్వుతూ, క్రీగంటి చూపులతో కైపెక్కించే అందాల తారను అనుభవించే అదృష్టం కలిగినప్పుడు కాలదన్నుకొనే వయసుగాడు, సొగసుగాడు, శృంగారపురుషుడు ఆ వూళ్ళో లేడనేచెప్పాలి. ఉన్నాడంటే ఆ ఊరివాళ్ళకు వాడొక అంగ విహీనుడన్నమాట! ఆమెను అదృష్టం ఈ విధంగా వరించింది.

సింహాలు అనే సోదరుడుతోను, మంజులఅనే సోదరితోను కట్టుగుడ్డలతో ఊరిలో అడుగుపెట్టింది అయితే సింహాలు మంచి మాటనేర్పరిగాడు. మనసులుమార్చి తలలుతీసి తలలు అతి కిస్తాడు.

సింహాలుకు తగినవాడే 'ఫణిబాబు'. ఫణిబాబు జమీం దారు ధర్మారావు తమ్ముడు. యితడో విచిత్రవ్యక్తి. మానవత్వం అంటే ఏమిటో తెలియని మానవుడు. పాపభీతిలేని స్త్రీలోలుడు. తలచిన స్త్రీని అనుభవించాలి. కాదంటే పగపడతాడు. కలయిక ఉంటేనేకాని పట్టువిడువడు. పట్టుపట్టేడంటే పతనమైపోవాలి. పెండ్లయిన స్త్రీ అయినా, పెండ్లవనిదైనాసరే? ప్రతిస్త్రీ కలలో ప్రత్యక్షమవుతాడు. కాదంటే కాలసర్పంలా కాటువేస్తాడు. అతడికి కావలసిందల్లా తన్ను రంజింపచెయ్యటమే. ధనం రాసులురాసులుగా గుమ్మరిస్తాడు. తలచుకున్నపిట్ట మర్యాదగా చేతికి చిక్కాలి. లేకపోతే విషపుగాలులతో కట్టిపడేస్తాడు.

స్త్రీలకు సింహస్వప్నం. ఎదిరించలేరు. శీలాన్ని అమ్ముకోలేరు. ధర్మరాజువంటి ధర్మారావుకు ఈతడి చేతలను తెలియచేయలేక పోతున్నారు. అందుకు సాహసించినా ఈ యమధర్మరాజు వాటిని విఫలంచేస్తున్నాడు. అంతేకాదు అటువంటివారు యిక జీవితం మీద ఆశ ఒదులుకోవాలి. కొందరు అతడి పశుత్వానికిబలై శీలాన్ని పోగొట్టుకున్నారు. మరికొందరు అతడి రాక్షసత్వాన్ని సహించలేక ఆత్మహత్య గావించుకున్నారు.

కాని సింహాలు పరిచయంతో ఫణిబాబు పూర్తిగా మారిపోయాడు. సింహాలు చేతిలో కీలుబొమ్మయి పోయాడు. రోజుకో క్రొత్తమొఖం కావాలనే ఫణిబాబుకు యిప్పుడు కమల తప్ప మరెవ్వరూ అక్కరలేదు. ఇప్పుడు అతనికి కమలమే ప్రపంచం. కమలం లేందే తనులేడు. కమలం లేనిక్షణం ఒక యుగం. ఏమిటో ఈమార్పు అతడెప్పుడు అనుకోనేలేదు. అల్లా అనుకునేందుకూడ తీరికలేదు. కమలం యివ్వనూలేదు. ఎంతో సొమ్ము అడగక్కర్లేదు. ఓ తీసికొస్తాడు. ఆమె చేతుల్లో గ్రుమ్మరిస్తాడు. అదే అతడికి ఆనందం. ఆమె పలుకే ఒక స్వర్గపు మెట్టు ఆమెతోడి అనుభవమే ఏజన్మలోను కానరాని స్వర్గ ధామం. తృప్తి. ఆమె మాటంటే అతడికిగురి. కాదు-గురికాదు. ఆమె మాటంటే అతడికి వేదవాక్కు. ఆమె గీసినగీటు దాట డానికి వీల్లేదు, దాటడు. అది ఆమె ఆజ్ఞకాదు. అతడికి ఆమె మీద ఉండే వాంఛ మోహం! కమలం అతడిని మొదట్లో అల్లాగే ప్రేమించేది. కాని అనుకోకుండా ఆమెలో చాలమార్పు వచ్చేసింది. సింహాలుతో చెప్పింది. మెల్ల మెల్లగా ఊరిలో పలుకుబడి సంపాదించాడు. ఒక్కొక్కరే వస్తూ వుండేవారు,

పోతూ వుండేవారు. ఎంతడబ్బుపడితే అంతడబ్బు నాజూకుగ గుంజుతోంది. రానురాను గిరాకీ పెరిగింది.

ఫణిబాబుకు తెలిసింది. మండిపడ్డాడు.

కమలం లెక్కచెయ్యలేదు—"అవసరముంటే రా లేకపోతే పో. ఊఁ...అంటే కొన్ని వందలమంది వస్తారు. వేలకువేలు గుమ్మరిస్తారు. నువ్వొక్కడివేకాదు నాకు" అంది తీసికట్టుగా.

రుద్రుడై పోయాడు. తోకతొక్కిన త్రాచులా బుసలు కొడతూ లేచాడు. కాని అంతలోనే చల్లారిపోయాడు. ఆలోచింకుచున్నాడు— "తను ఆమె కేమైనా పుస్తికట్టాడా ? ఎవరు డబ్బు ఎక్కువ చూపెడితే అటువైపుకు మ్రొగ్గుతుంది. ఆమె మాటల్లో నిజం లేకపోలేదు." ఇక అక్కడ ఉండలేక పోయాడు. అయినా తను ఏమైనా తక్కువ యిస్తున్నాడా ? ఎంత అడిగితే అంతా ముట్టచెపుతున్నాడు. వెళ్ళిపోయాడు.

కొన్నిరోజులు ఆమెనుండి తప్పుకున్నాడు అల్లా ఎన్నో రోజులు ఉండలేకపోయాడు. నిగ్రహశక్తి కోల్పోయాడు. ఆఖరకు ఆమెవద్దకే చేరుకున్నాడు. పూర్వపు గౌరవం, ఆధిక్యత యిపుడు కమలమూ యివ్వటంలేదు సింహాలు ఇవ్వటంలేదు. నలుగురి మాదిరిగనే ఫణిబాబు వస్తున్నాడు పోతున్నాడు. ఉన్నంతకాలం ఉండాలన్నంతసేపు అక్కడ వుంటాడు. కమలం తనపనేదో తను చూసుకుంటోంది. అయితే ఫణిబాబు యివేం పట్టించుకోటంలేదు. అతడికి ఆమె కళ్ళఎదుట కనపడటమే ఒక తృప్తిగా వుంది. ఊళ్ళోవున్న కన్నెపిల్లలందరూ యితడి ఆగడాలు తప్పాయని సంతోషించారు. ఆ కోవకు చెందిన పడుచులందరూ కమలాన్ని అభినందించకుండా ఉండలేకపోయారు. ఇక

పోతే పెళ్ళయిన స్త్రీలందరూ తమ భర్తలు కమలాన్ని కలవరిస్తున్నారని ఏడ్చారు. విధి వక్రించింది !

కుప్పలుకుప్పలుగ సంపాదిస్తూన్న డబ్బుసంతా కమలం కూడపెట్టటంలేదు. లక్షాధికారులు భిక్షాధికారు లౌతూంటే ఆ డబ్బుతో చేయిచాచిన వానికల్లా కాదనకుండ కడుపుకు పడేస్తోంది. ఆ వూళ్ళో అల్లా ఎంతోమంది బ్రతుకుతున్నారు. బిచ్చగాళ్ళకు ఆమె అంటే కాశీఅన్నపూర్ణే. ఆ వూళ్ళోనేకాదు ఆమెను గురించి ఆ చుట్టుప్రక్కల మధ్యతరగతి ప్రజలందరకూ తెలుసు. ఆమె సహాయం పొందనివారు అరుదనే చెప్పాలి. ఒకరు బ్రతకాలన్నా, ఒక పుణ్యకార్యం జరగాలన్నా, ఆ వూరికి ఒక అందాన్ని తీసుకురావాలన్నా ఆమెదే మొదటి అడుగు. సంపాదించేది సంపాదిస్తూనే ఉంటుంది, మరోచేతితో ఖర్చుపెడుతూనే వుంటుంది. బీదలపాలిటి పెన్నిధి! ఈ విధంగా కూడ ఆమె గొప్ప గౌరవం సంపాదించింది. ఎంతోమందికి చదువులు చెప్పించి ఉన్నతమార్గాలను త్రొక్కించింది. దీనప్రజల శ్రేయస్సే తన శ్రేయస్సు అంటుంది.

ఒకవైపు భీతావహమైన పాపకార్యాలుచేసి అనేక జీవుల ఉసురులు పోసుకుంటూ, మరొకప్రక్క ఉన్నతాదర్శాలలో ప్రజలకు మార్గదర్శకురాలు అవుతోంది.

ఇది మరీ విచిత్రం! నిప్పు ముట్టుకుంటే కాలుతుందని నిప్పుపై చేయి వెయ్యనీయదు. కాని తనుచేస్తూన్న పనో ? నిప్పును స్వయంగా చేతిలోనికి తీసికుంటోంది. విచిత్రవ్యక్తి. అర్థంగాని అనుభవంలో కనిపించని అయోమయ మన స్తత్వం.

చసిన పాపాలు నశిస్తాయా పుణ్యకార్యాలు చేస్తే ?

ఏమిటో ఆ తత్వం ?

రాత్రి ఎనిమిదిగంటలైంది. ఫణిబాబు చల్లటిగాలిలో ఉల్లిపొరలావున్న లాల్చీ వేసికొని వుషారుగా కిళ్లీని ఖుషీగా నములుతూ కమలం యింటికి వచ్చాడు.

వీధి అరుగుమీద సింహాలు చుట్టకాల్చుకుంటూ ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఫణిబాబు వచ్చినట్లయినా గమనించ లేదు సింహాలు. సుడులు తిరుగుతూన్న ఆ చుట్టపొగలో అతడి ఆలోచనలు గిరగిర తిరుగుతూ చిక్కుకుపోయాయి. ఇక లాభం లేదని బుజంమీద చెయ్యివేసి గుంజుతూ "ఏం సింహాలు ఒంట రిగా కూర్చొని దీర్ఘాలోచనల్లో పడిపోయావు" అన్న ఫణిబాబు మాటలకు ఉలిక్కిపడి ఈ లోకంలోకి దిగజారుతూ "రండి... బాబూరండి" అని కొంతసేపు ఆగిపోయి 'చాల సేపయిందను కుంటాను మీరొచ్చి.. లోపలకు వెళ్ళలేదా?' అని సందేహాన్ని వెలిబుచ్చాడు.

'లేదోయ్ ! కమలం యింట్లోనే వుందా ? ఎవరైనా వచ్చారా?' అన్న ఫణిబాబు ప్రశ్నలకు సింహాలు గట్టిగా ఒక దమ్ములాగి పొగను తాపీగా వదుల్తూ చటుక్కున ఉమ్మి 'ఆ...ఎవరొస్తారు? ఎవరూ రాలేదు. మంజులమ్మతో కబుర్లు చెపుతోంది' అని కాస్సేపాగి 'నాలుగుడబ్బులు చేతికి దొరుకుతే చాలు నెత్తికెక్కుతాయి కళ్లు. అవున్లే నడిమంత్రపుసిరీ, ఆ సింగారం...ఆ శృంగారం...ఈ కులుకు...ఆ అందం ఉన్నంత సేపే. ఏమంటారు ఫణిబాబు?' అని అతడి ముఖంలోకి చూసి "అయినా నాకవన్నీ ఎందుకు! ముమ్ముందు మీకే తెలుస్తుంది... ఆ ఎవరూలేరు లోపలకు వెళ్ళండి" అన్నాడు, మళ్లీ తన ఆలో

చనల్లో పడిపోతూ సింహాలు.

ఫణిబాబుకు ఈ సంభాషణ ఏదీ అర్థంకానట్టుంది. ఏమీ మాట్లాడకుండ నవ్వుకుంటూ లోపలకు నడిచాడు. కమలం తన గదిలో ఉండేమోనని తిన్నగా డాబా ఎక్కాడు. ఆ డాబామీద ఒకేఒక గది ఏకాకిలా వుంది. ఆ గదిచుట్టూ పూలకుండీలలో చిన్నతోటలా ఉంటుంది.

తిన్నగా గదితలుపులు వద్దకువెళ్ళి కొడుతూ 'కమలం... కమలం' అన్నాడు. పలకలేదు. మరెవరితోనైనా ఉందేమో అనుకున్నాడు. ఈ ఆలోచన రాగానే మనస్సు చివుక్కుమంది ఉక్రోషం ఉబికింది. అంతే! ఒక్కమారుగా తలుపుతన్ని గట్టిగా త్రోశాడు. అమాంతం తలుపులు గోడకు గుద్దుకొని మరలా మూసుకొన్నాయి దఫీమని చప్పుడుచేస్తూ. ఈసారి నెమ్మదిగా తలుపులు తెరచి సన్నని వెలుగుతూన్న దీపాన్ని పెద్దది చేసేడు.

కమలంలేని ఆగది అతడికి బోసిగ కనిపించింది.

గబగబా క్రిందకుదిగి ఒక్కొక్క గదే యిల్లంతా వెతికేడు. ఎక్కడా కనిపించలేదు. మంజులతో కబుర్లు చెబుతోందన్నాడు. అసలు మంజూలా కనిపించటంలేదు. కమలా కనిపించటంలేదేమిటా అని తర్కంలో పడ్డాడు. అవును! ఈ మంజులెవరుచెప్మా? అనుకున్నాడు. సమాధానం దొరకలేదు, సింహాలు అరుగుమీదున్నాడేమో అనుకొని అక్కడకువస్తే సింహాలూ లేడు. పెరట్లోకి వెళ్ళేడేమోయని అక్కడకు వెళ్ళేడు. అక్కడ కనిపించలేదు. కమలమూ లేదు. కాని సన్నటిగాలి హాయినిచ్చింది. మేనుకు తగలగనే సన్నజాజిపూల గుబాళింపు

నాసికారంధ్రాన్ని పట్టి మనిషిని కదలనివ్వలేదు. యింతలో ఏవో కబుర్లు వినవచ్చాయి. ఎక్కడా అని చూచాడు.

ఆ ప్రదేశం క్రొత్త. ఎప్పుడూ వస్తున్నా తిన్నగ కమలం దగ్గరకు పోవడమేకాని యిల్లా పెరట్లోకిరాలేదు. దొడ్డంతా పూలమొక్కలతో నిండిపోయింది. ఆ పూలమొక్కల మధ్యనే బొమ్మరిల్లులా ప్రత్యేకంగా ఒక చిన్న పాక అందంగా కనిపించింది. కిటికీ సందులలోనుండి సన్నటి వెలుగు బయటకు వస్తోంది. అక్కడినుండే అతడికి మరలా మాటలు వినిపించాయి. అనుమానం తలెత్తింది. తనకి తెలియని ప్రదేశాలు కొన్ని ఉన్నాయని, అక్కడఎన్నో రహస్యాలు జరుగుతున్నాయని బాధ పడ్డాడు. వెనక్కు పోదామనుకున్నాడు. కాని ఆ వాతావరణం అతడిని శాంతపరచింది. అసల్పాప్రదేశంలో రెండు నిముషాలు వుంటే చాలనిపిస్తుంది. ఆ రాత్రివేళల్లో జన్మతరిస్తుంది. నిరాశా జీవుల్లోకూడా ఆశజనిస్తుంది. అటువంటి వాతావరణంలో అడుగు పెట్టిన భోగలాలసుడైన ఫణిబాబు బాధను, కోపాన్ని అణగ ద్రొక్కుకొని ఏదో తీరని పిపాశతో అక్కడ నిలబడిపోయాడంటే ఆశ్చర్యపడనవసరంలేదు.

ఎప్పుడైతే అతడిలో పిపాసతలయెత్తిందో అప్పుడే అతడి కాళ్ళు భరిణిలాఉన్న ఆ యింటివైపు దారితీసాయి. కాని అతడి ఊహలకు బంధంవేసింది ఆ కంఠస్వరం. మధురాతి మధురమైన ఆ కంఠస్వరంనుండి సప్తస్వరాలు వెలువడుతున్నాయి. కంఠమే అంత మధురంగా ఉంటే ఆ మోహానాంగి రూపం ఎంత అందంగా ఉంటుందో అనుకొని ఊహించుకోపోయి 'ఛా...ఛా చూడందే ఎల్లాగా' అనుకున్నాడు. ఆమె నొకమారుపొందలేక

పోయినా ఆ సౌందర్యరాసిని చూచి అయినా జన్మ తరింపచేసికోవాలనుకున్నాడు.

కోరిక కలిగిందే తడవుగా కిటికీ ప్రక్కకు చేరుకున్నాడు.

"చూడు మంజూ! మనం భారతీయులం, భారత స్త్రీలకు..." అని యేదో చెప్పబోతూ మానేసింది. ముఖ కవళికలు మారిపోతున్నాయి. ఆమె చూపుల్లోను, ముఖములో విచారగ్రస్త భావాలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ఆమె ధోరణి మంజులకేమీ అర్థం కావటంలేదు. ఎప్పుడూ ఎంతో ఉత్సాహంతో తిరుగుతూ నలుగురిని నాలుగుమాటలు అని నవ్వించే అక్క ఈరోజు అమాంతం యిల్లా మ్రాన్పడి పోయిందేమాయని ఆశ్చర్యపడింది మంజుల. రోజూ ఈ సమయంలో వచ్చి 'చదువు ఎల్లా కొనసాగుతోంది. నాట్యం, సంగీతం బాగా నేర్చుకుంటున్నావా? మాష్టారు బాగా చదువు చెవుతున్నారా?' అని పరామర్శించేది.

భగవద్గీత, రామాయణం, మహాభారతం మొదలగు పురాణములను తనచే చదివించి అందులో నిగూఢార్థాలను సున్నితంగా సవిమర్శతో విమర్శించి, విశదీకరించేది. అప్పుడు తనకు చాల ఆశ్చర్యంవేసేది. పతివ్రత కథలు ఎన్నెన్నో చెప్పేది, మనంకూడ అల్లా ఉత్తమమయిన ఆదర్శవంతమైన స్త్రీలుగ తయారవ్వాలని హితబోధ చేసేది.

కాని నాలో నేనే తర్కించుకుంటాను. అక్కను అర్థం చేసుకోనేందుకు. ఆమెకు తెలియని శాస్త్రాలులేవు. ఎటువంటి వారి నే విధంగా గౌరవించాలో అటువంటి సమయంలో ఏ విధంగా మసులుకోవాలో తెలుసు. అక్కపేరు మీదుగా

అనేకమంది అనాథలు బ్రతుకుతున్నారు. నాకా అనేక సౌకర్యాలు కలిగించి విద్యాపారంగతురాలుగ చేస్తోంది. ఎన్నెన్నో నీతులు గరుపుతోంది. ప్రపంచం నలుమూలలా చూడకపోయినా ఆమె ముఖతా ఎన్నో విషయాలు తెలుసుకోగలుగుతున్నా. ఆమె విజ్ఞానఖని. ఇన్నీ తెలుసుండికూడ ఈ సంఘంలో ఆమె నీచంగా ప్రవర్తిస్తోంది. ఒక చీడపురుగు అయిపోయింది. సుగుణాల రాశివంటి ఆమెకు యిదేమచ్చ. ఆ విధంగా ప్రవర్తించటం తప్పని బహుశా ఆమెకూ తెలుసు. నీచాతినీచమైన మార్గం అని తెలుసుండీ అసలు ఆ మార్గం ఎందుకు త్రొక్కిందో అర్థంకాదు. పవిత్రత పవిత్రత అంటుందే. ఆ పవిత్రత తనకు అక్కరలేదా? ఏమో అంతా అగమ్యగోచరం.

ఆ సింహాలు అన్నయ్య ఒకడు. వాడ్ని చూస్తేనే అసహ్యం వేస్తుంది. ఎంత నీచానికైనా పాల్పడతాడు. పాపభీతిలేని మొండిఘటం. కర్కోటకుడు. వాడ్ని సోదరుడనటమే మహాపాపం. కుమ్మరిపురుగులా మనుష్యులను తొల్చేస్తాడు.

నాకు జ్ఞానం వచ్చినప్పటినుండి అక్క అసలు ఆ ఛాయలు నామీద పడనివ్వదు. దీనినిబట్టి ఆమె భావన, తను చేస్తున్నపని నీచమైనదని ఆమెకు తెలుసునని గ్రహించాలి. అందువల్లే నన్నసలు ఆ యింటిగడపే త్రొక్కనివ్వదు. దీనికంతకు వెనుక ఏదో కారణం దాగివుండాలి. శరీరాన్ని అమ్మి డబ్బు సంపాదిస్తోంది. అందువల్ల డబ్బుకై ఈ ప్రాకులాటేమో అనుకుంటే అదీకాదు. ఎందువల్లనంటే ఆమె తనకు వచ్చిన ధనాన్ని గుప్తపరచటం లేదు. లక్షాధికారుల గుప్తధనాన్ని శరీరం ఎరచూపి కొల్లగొట్టి బీదలకు పంచేస్తోంది. ఈ విధంగా అనేకమంది జీవితాలు ఈమె

మూలకంగా నాశనమయ్యాయి. డబ్బున్నంతకాలం కమలం అమృతమనేవారు. వారిడబ్బు అవగనే కమలం విషరూపందాల్చి మలమలా మాడ్చేసేది. అప్పుడనుకునేవారు విధి వక్రించిందని! ఇల్లా ఎందరి జీవితాలు నాశనమయ్యాయో ? ఎంతమంది స్త్రీల ఉసురులు తగులుతున్నాయో ? ఆ వుసురులు పాపపరిహారార్థం కొరకేనా మరొకవైపు ఈ పుణ్యకార్యాలు చెయ్యటం? పాపం అని తెలుసుండికూడ ఈ నీచపుపనులు చేయటందేనికి ? ఏమో ఎంత ఆలోచించినా సరిఅయిన సమాధానమే దొరకదు. ఎప్పుడైనా 'అమ్మ, నాన్న'లను గూర్చి అడుగుతే ఏదో బాధతో కృంగిపోతుంది.

"అవన్నీ నీ కనవసరం. అవసరం వచ్చినప్పుడు నేనే చెపుతా. నావల్ల నీకేమైనా బాధకలిగిందా? నువ్వింకా చిన్న దానివి. నేర్చుకోవలసినవెన్నో ఉన్నాయి. అది సరేకాని నీకిప్పుడు ఏంకావాలి ? మంజూ చెప్పవ్?" అని ఒణుకుతూన్న కంఠంతో లేని కాఠిన్యాన్ని బలవంతంతో గొంతుకలోనికి తెచ్చుకొని, గంభీరాన్ని చిక్కబట్టుకుంటూ ప్రశ్నిస్తుంది.

ఆమె బాధను గ్రహించి ఆమె నా విధంగా అడిగినందుకు నాలో నేనే కృంగిపోతా.

అవును. అక్క నన్నెప్పుడూ బాధపెట్టలేదు. నాకు అసలు మనసులో ఇది కావాలి అనే కోరిక కలగకుండానే ఆమె అన్నీ సమకూరుస్తుంది. నేనంటే యింతప్రేమ ! అక్క లేకపోతే నేనేం చెయ్యగలను? ఈ విధంగా నాట్యం చేస్తున్నానంటే అందులో నా గొప్పతనమేముంది ? ఆ గౌరవం అక్కకే. ఈ జన్మలో ఆమె ఋణం ఏవిధంగా తీర్చుకోవాలో అర్థంకావటంలేదు. కన్న

తల్లిదండ్రుల ప్రేమనే మరిపింపజేసే ఈ సోదరిప్రేమ ఎంత అమోఘమైనది! నేను నిజంగా చాల అదృష్టవంతురాలనే. తల్లిదండ్రుల ప్రేమ ఎల్లా ఉంటుందో తెలిసినా తెలియకపోయినా భగవంతుడు ఇటువంటి అక్కను ప్రసాదించినందుకు ఎంతో కృతజ్ఞురాలను" అని ఆలోచించి ఏదో ఆత్రుత, మృదు-మధురమైన బాధతో 'అక్కా' అని పిలిచింది.

బయటనున్న ఫణిబాబు తన్నుతాను మరచి మంజుల సౌందర్యాన్ని చూపులతోటే ఆస్వాదిస్తున్నాడు. సంతృప్తినీ పొందుతున్నాడు. పూవును తాకితే వాడిపోతుందనుకున్నాడు.

"ఏమమ్మా మంజూ—! పిలచావా" అంటూ ఆలోచనలలోనుండి బయటపడింది కమలం.

"అవును. కాని...ఏదో చెప్పబోయి మానేశావు. ఏదో ఆలోచిస్తున్నట్లున్నావు" అన్న మంజుల మాటలకు "నేను ఈరోజు నీకొక ముఖ్యవిషయం చెబుదామని వచ్చాను. నేను నీకు ఏమిచెప్పినా అర్థంచేసుకొనే యీడు వచ్చింది. మన స్త్రీలకు చాల ముఖ్యవిషయమమ్మా. నువ్వు నే చెప్పింది జాగ్రత్తగా ఆచరణలో పెడతావని అనుకుంటున్నాను. మన తల్లిదండ్రులకు ఆత్మశాంతి లభించాలంటే నువ్వీ విధంగానే చెయ్యాలి. అదీ నీవల్లనే సాధ్యం. నామీద నీకు పూర్తి నమ్మకం ఉంది. నేను చావలేక బ్రతుకుతున్నాను. మనకు జరిగిన అన్యాయాలకు తగిన ప్రతీకారం తీర్చుకునేందుకు బ్రతుకుతున్నాను. నా హృదయంలో అగ్నిభాండాన్ని పెట్టుకొని బ్రతుకుతున్నా. ఈ జీవితానికి యిక ఉపశమనమంటూ ఎప్పుడు ఉంటుందో ఏమో ? నేను ఈ ప్రపంచంలో ఒక మనిషిగా

మాత్రమే బ్రతుకుతున్నా. కాని మనిషికి వుండే గుణాలు నాలో లేవు. ఈ మూకప్రజలు నన్నేవిధంగా గౌరవిస్తున్నా అది నాకేవిధంగానూ గర్వకారణం కాదు. నేనే సంఘానికి చీడ పురుగును. అయినా నాకు కొన్ని ఆశయాలు వున్నాయి. కాని ఈ పాపపంకిల శరీరంతో ఆ ఉత్తమోత్తమమైన ఆశయాలను కొనసాగించలేను. బాహ్యంగా నేనెంత సౌందర్యవతిగ అందరి చేత ఆకర్షింపబడుతానో, అంతర్గతంగా ఒక కురూపిగ సంకు చితిగానుండి నాచే నేను దహింపబడుతూ వుంటాను. నాలో నేను ఎంతగానో కుమిలిపోతాను. ఈ పాడుజీవితాన్ని తల్చు కొని ఒకరితో చెప్పుకుందామంటే ఆప్తులే అరుదైపోయారు. అయితే ఈ విషయాలన్నీ నీకుచెప్పి నిన్నుకూడ ఈ రొంపిలోనికి దించలేను. ఇక అసలు విషయంలోనికి వద్దాం..." అని చెప్ప బోతూంటే భళ్ళున తలుపులు తెరచుకోగా "ఎవరువారు" అంటూ వులిక్కిపడిలేచి నిలబడింది మంజుల.

ఫణిబాబు మాట్లాడకుండవచ్చి కమలం భుజంమీాద చేయివేశాడు. కమలం కోపంతో ఆపాదమస్తకం కంపించి పోయింది. ఒక్కసారిగ అతడి చేతినితోసి అగ్నికణాల్ని గుమ్మ రిస్తూన్నట్లున్న కళ్ళతో అతడ్ని చూసింది, కళ్ళ చూపులతోనే దహించేద్దామన్నట్లు.

ఫణిబాబు మందబుద్ధితో ఆమె చూపుల్ని అర్థం చేసి కుంటూ తేలిగ్గా 'నీ లెఖ్ఖఎంత?' అన్నట్లు వెగటుగా ఒకనవ్వు నవ్వేడు. ఈ అసభ్య ప్రవర్తన కమలాన్ని మరింత రెచ్చ గొట్టింది.

"ఏదో దీర్ఘోపన్యాసం యిస్తూన్నట్లున్నావు. నిన్నింతలా

వైరాగ్యం ఆవరించిందే! నాకు చాల ఆశ్చర్యంగా ఉంది. ఇప్ప టికికూడ ఎంతమందిని సంతోషపెట్టాలంటే అంతమందిని సంతోషపెడతావు. పదునెనిమిదేళ్ళ కన్నెపడుచులా వుంటావు. అటువంటిది నీకా వైరాగ్యం. కోరికలన్నీ ఉడిగిపోయినట్లు నీవు లేనిదే మేముండగలమా ? అయితే అయిందికాని ఆ పిల్లకు నేర్పుతావేమిటి నీ వైరాగ్యం శాస్త్రాలు? ఇంకా పాపం చిన్న పిల్ల. యిప్పుడిప్పుడే ఆమెలో యవ్వనం తలయెత్తి కోరికలను ఉసికొలుపుతోంది. నీవు పాడైతే పాడయ్యావుకాని ఆమెను ఎందుకూ కొరగానిదానినిగ చెయ్యకు. ఎంత మంచిపేరు ఆమెది "మంజుల...మంజుల" మృధుమధురంగా ఉంది. పేరును తల్చు కుంటేనే అమృతం త్రాగినట్లు హాయి అనిపిస్తోంది హృదయానికి. లోకంలోని అందమంతా ఆమె అవయవాల్లోనే సృష్టించాడా సృష్టికర్త. ఆమె చూపులు నా హృదయతంత్రులనుమీటి రాగాలాపన చేస్తున్నాయి. ఇటువంటి అప్సరసను దగ్గరపెట్టుకొని యిన్నాళ్ళుగా మాకు తెలియనివ్వలేదే" అంటూ తన ఆవేద నను వెళ్ళగ్రక్కుకుంటూ ఉపశమనంకోసమై "నీకు ఎంతడబ్బు కావాలంటే అంతా కురిపిస్తాను. ఆమె సౌందర్యమంతా ఈన కాచిన నక్కలపాలు చేసినట్లు చేయకు."

మంజులవైపు చూస్తూ "ఏం మంజులా...! మీ అక్క మాటలు వినకు. చూచావా, నిన్నీ అందమైన ప్రపంచంలోనికి రానీకుండా ఒక అనుభవహీనురాలిగా చేస్తూ ఎల్లా నిర్బం ధిస్తోందో స్వార్థపరురాలు" అని యింకా ఏదో చెప్పబోతూంటే "మంజులా...లోపలకిపో...మూర్ఖుడు ..." అని ఆవేశంలో ఒక్క కేక వేసింది. ఆ కేకకు ఫణిబాబు హడలిపోయాడు. బిత్తర

చూపులతో కమలాన్ని చూస్తూ తేరుకున్నాడు. ఆమె ముఖంలో రౌద్రం తాండవిస్తోంది, వణికిపోతోంది. అందుకు ఆమె చూపులకు పక్కన నవ్వేడు. అది ఆమెకు విషపునవ్వులా గోచరించింది. అనుకోకుండ ఆమెలో ఒక అనుమానం తల యెత్తింది. ఎందుకో భయపడింది. అసలు అతడ్ని తన యింటి వైపే రానివ్వకూడదనుకుంది. కాని అది ఎలాసాధ్యం? అతడు జమిందారు తరువాత జమిందారంతటివాడు. రాజు తల్చుకుంటే దెబ్బలకు కొదవా? అన్నట్లు అతడు అధికారి. అతడి మాటనికాదని బ్రతకటం దుర్భరం? అందులోను అతడు ధన మదోన్మత్తుడు. విచక్షణాజ్ఞానశూన్యుడు, పశువు. పగపట్టేడంటే కాటేసేవరకూ విడుపు ఉండదు. అతడ్ని తుదముట్టించాలంటే మాయోపాయాలవల్లనే సాధ్యం. అతడు విషపుకత్తి అయితే తను తేనెపూసిన కత్తిగ మారాలి. కాని యిది వినాశనానికే దారితీస్తుంది. అల్లాఅని వూరుకుంటే పెట్టుకున్న ఆశయాలన్నీ ఆశలన్నీ అతడి కామాగ్నిజ్వాలలలో భస్మీపటలమైపోతాయి. వీటివలన జీవితాలే కొరగాకుండా పోతాయి. ఇప్పటివరకూపడ్డ శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరే. దీనివలన మంజుల కూడ తప్పుదార్ని పడుతుంది. అది పట్టనక్కరలేదు. ఈ విషపు పురుగులే దాన్ని కాటేసి తప్పుడుమార్గాలు త్రొక్కించక మానవు. అల్లా ఎన్నటికీ జరగటానికి వీల్లేదు. "ఈ గొంతుకలో ప్రాణం ఉండగా పరిస్థితులను దిగజారనివ్వను. ఈ మూర్ఖుణ్ణి, కామాంధుణ్ణి పొట్టనపెట్టుకునైనా చస్తాను" అని ఏదో తెలియని కోపంతో హృదయాన్ని దహించుకుంటూ, మొహంలోకి సౌమ్యను తీసికొనిరా ప్రయత్నిస్తూ "ఏం ఫణిబాబు! యిల్లా

వచ్చావేం ?” అని అడిగింది.

“ఏం రాకూడదా ? నువ్వు యింట్లో కనిపించలేదు. సింహాలు చెల్లితో మాట్లాడుతున్నావని చెప్పేడు. యింతకూ నీకు కోపం తగ్గిందా ? అవునుకాని నీకు యింత అందమైన చెల్లెలు వున్నట్లు ఎప్పుడూ చెప్పలేదేం ?” అని ఎదురుప్రశ్న వేశాడు.

“దాని మొఖం, అది చిన్నది. దాన్ని అప్పుడే ఈ గొడవ ల్లోకి తీసుకురావటం ఎందుకా అని చెప్పలేదు” అంది ఆ గొడవ ల్లోంచి దాటెయ్యాలన్న ఉద్దేశ్యంతో.

“పోనీ మంచిపనిచేశావు కాని, నీకెంత కావాలంటే అంతా యిస్తాను. ఈ రాత్రికి మంజులను నా దానినిగ చెయ్యి. నీకెంత యినా పుణ్యాం వుంటుంది. మంజు అనే రెండు అక్షరాలు నా హృదయంలో గూడుకట్టుకొని కళ్ళల్లోనుండి తొంగిచూస్తు న్నాయి. నిజంగా మంజుల ఎంత అందకత్తె. నా జీవితంలో అటు వంటిరూపసిని చూసియుండలేదు. అందుకనే అనుభవించాలన్న కోరిక పెల్లుబికివస్తోంది. ఏం కమలం? జీవితంలో సంపాదించ లేని డబ్బును ఈ రాత్రి నీకు కురిపిస్తాను. నామాట కాదనకు. మాట్లాడవేం కమలం. నే ఆగలేకుండా వున్నాను. నువ్వు మాట్లాడకపోయినా...” అంటూ లేచినుంచున్నాడు.

“ఫణిబాబూ! నా మాటవిను. అది యింకా చిన్నపిల్ల. నిన్ను పాదాలట్టుకొని బ్రతిమాలుకుంటాను. దాన్ని అల్లా ఒది లెయ్యి. నా బ్రతుకు ఎల్లాగూ నాసనమయిపోయింది. దాన్ని కూడ నాశనం చెయ్యకు” అని బ్రతిమాలుకుంది.

అతడు ఆమె మాటలు వినిపించుకునే స్థితిలో లేడు.

అతడి ఊహాలన్నీ ఒకచోటే కేంద్రీకరింపబడి వున్నాయి. ఏదో ఆకాంక్షతో "ఛీ...ఏంమాటలు?...నాదీ మంజు...ఏది నా మంజు..." అంటూ మంజులవైపు నడకసాగించాడు.

ఆవేశంతో తొక్కతొక్కిన త్రాచులా లేచిపోయింది కమలం. ఉక్రోషంతో ఫణిబాబుకు అడ్డంగావెళ్ళి "ఫెళ్ళున ఒక్క లెంపకాయకొట్టి అతడ్ని త్రోసేసింది. పడిపోయాడు. ఆమెలో అంతబలం ఎక్కణ్ణించి వచ్చిందో ఏమో!

ఫణిబాబులో అవమానం తలఎత్తి ఆవేశంగా మారి పోయింది. శరీరమంతా కంపించిపోతూంటే 'కమలం' అని గట్టిగా అరచాడు కసితీరేట్టు.

"ఛీ...మూర్ఖుడా" సమాధానంగా కమలం ఈసడించు కుంది.

వంటిని అంటిన దుమ్ముదులుపుకుంటూ "కమలం! నోటికి వచ్చినట్లు పేలకు. నేనెవరినో తెలియదు కాబోలు! నేను ఆపే క్షించింది చేతుల్లోనుండి తప్పించుకోలేదు. కోపం వచ్చిందంటె ఈ ఫణిబాబు కాలనాగు అయిపోతాడు. నీవా నన్ను నీచుడని తిట్టడం? నీవు చేసేపని ఏమిటో గ్రహించలేనంత మూర్ఖుణ్ణి అను కుంటున్నావు. తలచుకుంటే నీకీ వూళ్ళోనేకాదు. ఈ ప్రపంచం లోనే స్థానం లేకుండా చేస్తాను. కుక్కలా మా కూడుతింటు న్నావు. కాని దానికివుండే విశ్వాసంలేదు. కుక్కకన్నా కనిష్టపు జన్మఎత్తి నన్నా నీవు మూర్ఖుడవనేది? జాగ్రత్త! ఒళ్లు తెలుసు కుని గతాన్నితలచుకొని మాట్లాడు. మూర్ఖురాలా!" అని ఆవే శంలో అంటూంటే..."సింహాలు...సింహాలు, పీక్కి మెడపట్టు కొని బయటకుగెంటు. వీడి అంతేమిటో నేనూ చూస్తాను"

అంది కమలం.

సింహాలు వచ్చాడు.

"అంత అవసరం ఏంలేదు. చూడు కమలం, నన్ను కాదని నెగ్గినవాళ్ళెవరూ లేరు. అసలింతవరకూ కాదన్నవాళ్ళూ లేరు. నీవు నన్ను మెడపట్టుకొని గెంటించక్కర లేకుండానే పోతాను" అంటూ రుసరుసలాడుతూ బయటకు వెళ్ళిపోయాడు ఆ వెనుకే సింహాలు దారితీశాడు.

ఆరోజు కమలానికి నిద్ర దూరమయింది. తను తప్పు చేశానని బాధపడింది—ఫణిబాబు అన్నంతపనీ చేసితీరుతాడు. అసలే పట్టుదలగలవాడు. దురభిమాని. అనవసరంగా అతడిమీద చెయ్యి చేసుకొన్నాను. అవునుగాని అంతబలం నా కెక్కడ నుండి వచ్చింది? మనిషి పడిపోయాడుకూడాను! నిజంగా అప్పుడా విధంగా ప్రవర్తించకపోతే తలచిన కలలన్నీ చెరిగిపోను. మేడలు కట్టిన ఆశయాలన్నీ ఒక్కమారుగా నామరూపాలు లేకుండా భూగర్భంలోకి క్రుంగిపోయుండేవి. ఎంత శాంతంగా పోవాలన్నా ఫలితం దక్కలేదు. అనుకున్నదొకటి జరిగింది వేరొకటి. ఈ జీవితానికి జయమనే దిక లేదేమో! ముందుగొయ్యి వెనుకనుయ్యి. ఏంచేద్దామన్నా భయమే. అయినా రోటిలో తలదూర్చిన తరువాత రోకలిపోటుకు వెరవటం దేనికి? జరగవలసిందేదో జరుగుతుంది. ఇప్పుడిది ప్రాణసంకటమే—అనుకొంది.

ఆమెలో నైరాశ్యం అలుముకుంది.

"విధి నుదుట ఎల్లారాస్తే అల్లా జరుగుతుంది. నా నుదుట ఈ విధమైన జీవితం గడపమని రాసింది. ఆ వైభోగం, ఆ జీవితం, ఆ కాలం అదంతా ఒక కలమాదిరిగా గోచరిస్తాయి.

తలచుకుంటే గుండెలబరువు, కళ్లు యింకిపోవటం తప్పించి మరేదీ గోచరించదు. కనిన కలలన్నీ దగ్ధమైపోయాయి ఈ తుచ్ఛులవల్ల. నేనెల్లాగూ నాశనమయిపోయాను. పాపం చిన్నది మంజుల. మంజులను రక్షించటానికి నా ప్రాణాలైనా ఫణంగా ఒడ్డుతాను. ఇటువంటి ఫణిబాబులు కొన్ని వందలమంది వచ్చి మీాదపడినా రక్షిస్తాను. అయినా మంజుల మాత్రం అంత అజ్ఞానురాలేమీా కాదు. తనను తన్ను రక్షించుకోవటం దానికీ తెలుసు. అయినా పెద్దదానిగ తనకున్న బాధ్యత నెరవేర్చుకోవాలిగా. అందుకే ఈ ఆరాటం. అయినా ఏది మనచేతుల్లో వుంది? కాని మన మానవప్రయత్నం మనకుంది. ఆపైన జరగవలసిందేదో జరిగి పోతుంది' అని ఆలోచిస్తూ నిద్రాదేవి ఒడిలో ఒరిగింది.

## 2

"నేనే అందగత్తెనని దానికి మహాగర్వం బలిసిపోయింది. దానికి తగినశాస్తి చెయ్యాలి ఫణిబాబు! జమీాందారు తమ్ముడైన మిమ్మల్నే కాదంటే అర్థమేముంది? మీాకూ రూపంవుంది. దానికితగ్గట్టు రసికులు, సరసులు. అన్నిటికీమించి ధనవంతులు, గౌరవమర్యాదలు కలవారు. అటువంటిది మిమ్మల్నే కాదు పొమ్మంటుందా? ఈనాడు ఏవో రెండుకాసులు చేతికిరాగానే కళ్లు నెత్తికిపోతే సరికాదు. వాటిని ఏవిధంగా సంరక్షించు

కోవాలో, దానికి రెండింతలు చేసికోవాలో అనే దూరపుచూపు ఉండాలి.

"ఎంత బరితెగించి పోకపోతే మిమ్మల్ని ఒక గడ్డిపరకలా తోసేస్తుంది. దీన్ని యిల్లా ఊరుకోకూడదు. చిత్రహింసలకు ఎఱ చెయ్యాలి. 'ఛీ!...ఛీ...!' అంటుందా? అది అసలు నాలుకేనా అంట. మిమ్మల్ని ఏమయినా కుక్కనుకుందేమో. కండ కావరంతో ఒళ్ళూపై తెలుసుకోకుండా నాలికను ఎల్లాపడితే అల్లా ఆడిస్తోంది. మూర్ఖురాలు" అంటూ సింహాలు పటపట పళ్ళు కొరుకుతూ "ఏది బాబయ్యా! ఓ చుట్టముక్క యిల్లా పడెయ్యండి...చలిగా వుంది" అని ఫణిబాబు యిచ్చిన చుట్టను అంటించి, గట్టిగా ఒకదమ్ము లాగుతూ "మీరు నిజంగా అసమర్థులే. నేనయితే తక్షణం కత్తితీసి ఆ నాలుకను పరపరాకోసి దానిచేతుల్లోపడేసి చక్కావద్దును అసలు అది నాలుకా అంట? తాటిమట్ట? ఆ మనిషి ఒకపశువు. అంతే. ఏదో పోనీలే ఆడది అని దయాదాక్షిణ్యాలు చూపెడితే యిల్లాగే నెత్తికెక్కుతుంది. అందుకే మిమ్మల్ని ఒక ఆడదానికంటే కనాకష్టంగా జమకట్టి ఆడిస్తుంది ఆ మూర్ఖురాలు. లేకపోతే మీరువుండి, మొదటినుండీ యింతింతడబ్బు గుమ్మరిస్తూన్నా మరొకర్ని మరొకర్ని చూస్తోందంటే దానిలోని అర్థం ఏమిటి? డబ్బు దోచుకోవడమే పనిగా పెట్టుకుంది. అధమం కష్టంలో ఆదుకున్నాననైనా విశ్వాసం లేకుండా నన్ను కుక్కలా చూస్తోంది. ఆనాడు నేనే లేకపోతే ఈనాడు చేతికి చిప్పేమిగుల్ను. అదంతా ఎందుకుకాని మీరు ఈ విధంగా ఓర్పువహించివుండటం నేను సహించలేను. అది అనుకుంటుంది-యిది అంతా తన ప్రజ్ఞేనని, తనకు భయపడి పారి

పోయాడు ఈ ఆబోతుమీసాల ఫణిబాబు అని"...

"ఆగు సింహాలూ !" దద్దరిల్లిపోయింది గది ఫణిబాబు గర్జనకు. సింహాలు అదిరిపడి ఫణిబాబువైపు చూసేడు.

"నీ వుపన్యాసాలతో నన్ను రెచ్చగొట్టకు. యిప్పుడు మనకు ఆవేశం పనికిరాదు. ముందుగా మంజులను వశపర్చుకోవాలి. ఆ తర్వాత ఏంచేసినా చెయ్యవచ్చు. కర్తవ్యాన్ని మరచి మూర్ఖుల్లా సంచరించటం వివేకుల లక్షణంకాదు. నాలో ప్రగాఢమైయున్న వాంఛ నన్ను నిలవనివ్వటంలేదు. హృదయం "మంజూ...మంజూ" అని స్పందిస్తోంది. అయినా నిల్రదొక్కుకోవాలి. నిల్రదొక్కుకుంటున్నా" అన్నాడు ఊపిరిని గట్టిగా తీసుకుంటూ. కొంచెంసేపు ఆగి "అవునుకాని మీ కమలాన్ని అల్లా అంటావేమిటి ?" అని ప్రశ్నించాడు సహనాన్ని కూడగట్టుకుంటూ.

"అదికాదండి ఫణిబాబూ !మావృత్తి అదే ! అదిలేనిదే ఏపూటా గడవదు. అటువంటప్పుడు బడాయీలకు పోతే బ్రతుకు ఎల్లావెడుతుంది. ఈ విధంగానే అక్కతో చెప్పేను. కాని అది వినలేదు సరికదా తారామండలానికి అంటేటట్లు 'సర్' మని నాపైకి కోపంతో లేచిపోయింది. యిటువంటివిచూస్తే నాక సహ్యాం. అప్పటినుండి నేను ఆమెతో పోతానని చెప్పేను. తమ్ముడ్ని అనే ప్రేమకూడా లేకుండా దయాదాక్షిణ్యాలు వదలి రాక్షసిలా నన్ను పొమ్మంది." సింహాలు మొఖం కంద గడ్డలా జేవురించింది.

ఫణిబాబు ఒక కంట యిది కనిపెడుతూనే వున్నాడు, వీడు ఏదో దాస్తున్నాడని. అసలు రహస్యమేమిటో ? వీడ్ని

నమ్మ వచ్చా లేదా అని మనస్సులో తర్కించుకుంటూనే ఉన్నాడు.

"అప్పటినుండి దానిమీద వుండే అసహ్యంకొద్దీ ఒక డొక్క మాడ్చుకొని తిరుగుతున్నా. చెప్పుకుంటే సిగ్గుకూడా! తల ఎత్తుకుందుకు అసహ్యంగా ఉంది. యింకా చెప్పుకోడం కూడానా ? ఏదో మీరు ఆప్తులుకదా? మీవల్లనే మొదటి నుండి బ్రతుకుతున్నామనేది గర్వంతో మీతో చెప్పుకున్నాను కాని మరొకటికాదు. మీకూ యిష్టంలేకపోతే నాబ్రతుకు యింతేకదా అని, ఈరోజుతో ఈవూరు ఋణం తీరిపోయింది కదా అని పోతా మరోవూరు." అంటూ సింహాలు కూర్చున్న చోటునుండి లేచాడు.

ఆలోచనల్లో పడ్డ ఫణిబాబు వీడిమాటలకు బయట పడ్డాడు. సింహాలు బుజాలను పట్టుకొని కూర్చోపెడుతూ 'అదేమిటి సింహాలు, ఒకర్ని ఒకరం ఆదుకోకపోతే యెల్లాగ ? కమలానికి బుద్ధిలేకపోతే అందరూ అంతే అనుకున్నావా? నీ కేం భయంలేదు. నిర్భయంగా నీకావలసిందేదో అడిగి తీసుకొని నిస్సంకోచంగా యిక్కడే ఉండిపో. అభిమానం అంటు పెట్టి త్రోవలు త్రొక్కితే యిప్పుడు ఒకడొక్క మాడుతూంటే అప్పుడు పూర్తిగ రెండుడొక్కలు మాడ్చుకోవలసి వస్తుంది' అంటూ సింహాల్ని యథాస్థానంలో కూర్చోపెట్టాడు.

"మీవంటి దాతలు, ఉదారులు ఈ ప్రపంచంలో గొడ్డు పోలేదండి. మీవంటివారున్నారుకాబట్టే మావంటివాళ్ళుయింకా బ్రతుకుతున్నారు... మీరుండగా నాకేంలోటు?' అంటూంటే—

'అవన్ని యిప్పుడెందుకు సింహాలు' అని, కాసేపు ఆలో

చించి, పీకికి కమలం అంటే ఎల్లాగు అయిష్టతగానే వుంది. యిక పోతే మనపనేదో మనం చేసుకుపోవాలనుకుంటూ "నాకొక సహాయం చెయ్యాలి చేస్తావా !" అన్నాడు.

"అదేమిటి బాబూ! మీకు కాకపోతే మరెవరికి చేస్తాను. మనసిచ్చింతరువాత తిరిగేవాడు కాడు యీ సింహాలు. బాబూ యెంత ఎదవ బ్రతుకు బతికినా మాటనిలకడ కలవాడ్నే..." అని యింకా ఏదో చెప్పబోతూంటే "అహఁ! అదికాదు. నీవల్లనౌతుందా అన్న వుద్దేశ్యంతో అడిగాను. భోజనం చెయ్య లేదనుకుంట. ప్రొద్దుపోయింది చేసిరా..." అంటూ రెండు పది రూపాయిల నోట్లు అతనిమీదకు విసిరాడు.

ఆరాత్రి మస్తుగా మద్యం పట్టించాడు సింహాలు. ప్రక్కనే వున్నాడు ఫణిబాబు.

"ఏంబాబూ! ఖాళీగా కూర్చున్నారేం ? మీ సింగారి మంజులను తీసుకురమ్మంటారేమిటి?" అన్నాడు నిషాలో మూసు కుని పోతూన్న కనురెప్పలను తెరుస్తూ.

నిజమే. తనుకూడ ఒంటరితనాన్ని భరించలేకపోతున్నాడు. అదేకాకుండా ఈ పరిస్థితిలో వాడు వెళ్ళాడంటే బలవంతానైనా తీస్కువస్తాడు అని ఆలోచించి వద్దులే, "నెమ్మదిగా చూద్దాం" అన్నాడు.

యింకొద్దిగా పట్టిస్తూ ఫణిబాబు మాటలకు "అదేమిటి బాబూ! దాన్ని అల్లా దయాదాక్షిణ్యాలతో ఒదిలిపెట్టకూడదు. శరీరాన్నంతా ముక్కలు ముక్కలుగ ఖండించి కాకులకు గ్రద్దలకు తగలెయ్యాలి. ఒకనాడు నావల్ల నిలబడి ఈనాడు కాదు పొమ్మంటుందా ? కాళ్ళుపట్టుకుంటే బ్రతకడాన్కి దారిచూపె

ట్టాను. ఆ మాత్రం విశ్వాసమైనా లేదు. విశ్వాశఘాతకురాలు. కమలం... కమలం... నిన్ను...నిన్ను...!' అంటూ వొళ్ళు తెలియకుండా పడిపోయాడు.

ఈమాటలు అప్పుడే రెండోసారి విన్నాడు ఫణిబాబు. బ్రతకడానికి దారిచూపెట్టమంటే దారిచూపెట్టాడట. ఇందులో రహస్యం ఆలోచిస్తూంటే కమలం సింహాలుకు అక్కకాదని తెలిసిపోతోంది. ఏ సోదరుడూ తనచెల్లెలను వ్యభిచారానికి పూనుకోమనడు అయితే యిందులోని రహస్యం ఎంత ఆలోచించినా అంతుపట్టలేదు. ఈ రహస్యం తెలుసుకోవాలంటే సింహాల్ని మరింత దగ్గరకు తీస్కోవాలి. యిదే సరైనమార్గమని ప్రతిరోజూ వాడు త్రాగ్గలిగినంతా త్రాగుడు పోయిస్తున్నాడు.

ఒకరోజున సింహాలుతో "మంజుల నాట్యం బాగా చేస్తుందనుకుంటా. ఆమెను మా అన్నయ్యవద్దకు తీసుకొని వెడదాం. ఆయనొక గొప్ప కళాభిమాని. కళను పోషిస్తాడు. కూపస్త మండూకంలా ఆ కొంపలో పడుంటే ఎన్నాళ్ళకని పైకివస్తుంది? జనాదరణ పొందగలగనంత కాలం ఆమెకు, ఆమెకళకు ఏవిధమైన విలువ, గౌరవం ఉండవు. ఆ కళను ఆరాధించేవారికి కీర్తి వుండను. ఏమంటావ్" అన్నాడు.

"నిజమేబాబూ ! మా మంజుల నాట్యంచేస్తూన్నప్పుడు ఒక్కొక్క కదలికలో ఒక్కొక్క కొత్తరూపు మెరుపులా గోచరించి మాయమై పోతుంది. ఆమె చాల వృద్ధిలోనికి వస్తుంది. కాని..." అంటూ కాస్సేపుఆగిపోయి "ఆ రాక్షసి దాన్ని అసలు బయటకేరానివ్వదు కదా, ఏది ఏమైనప్పటికి మంజులను మీ అన్నగారివద్దకు తీసుకొని వెళ్ళాలండీ" అన్నాడు.

"దానికేం... తీసుకువెడదాము"

"మాటంటే సరిపోతుందాండీ?"

"అంటే నీ ఉద్దేశ్యం ?"

"బాగా మాట్లాడుతున్నారండీ. ఉద్దేశ్యానికేముంది. చెప్పనే చెప్పానుగా. ఆరాక్షసి వున్నంతకాలం మనమేపనీ చెయ్యలేం. దానికి పట్టుదల ఎక్కువ. తనుపట్టిన కుందేటికి మూడేకాళ్ళంటుంది. అందులోను యిప్పుడు దానికి మనం విరోధులై పోయాం. యింక అసలు మనమాటే వినుపించుకోదు. పోని మంజులతో చెప్పిచూద్దామంటే "పవిత్రత, పవిత్రత" అంటూ ఆ పూరిగుడిశలో ప్రపంచాన్నైనా చూడనియ్యకుండా బంధించింది ఈ పతివ్రత ! అటువంటప్పుడు మనకు ఎట్లా సాధ్యమాతుంది?"

సింహాలు అన్నమాటలకు, అతడి ఆవేశానికి నవ్వుతూ "కమలం నువ్వు అనుకున్నంత మూర్ఖురాలుకాదు. ఆమెలో ఎన్నో ఆశయాలు గూడుకట్టుకొని వున్నాయి. అందుకే ఆమె క్షోభించిపోతూంటుంది – 'పవిత్రత...పవిత్రత' అంటూ, బహుశా ఆమె పూర్వచరిత్ర నీకూ పూర్తిగా తెలిసుండక పోవచ్చు" అంటూ సింహాలు ముఖవైఖరి చూశాడు. "అదేమిటి? అదేమిటి?" అన్నాడు సింహాలు కంగారుపడుతూ—అతడి ఖంగారుకు మరల ఒకచిన్న చిరునవ్వు విసరి "అది అంతేలే. అందుకు ఆమె ఎప్పుడూ మంజులనైనా వృద్ధిలోనికి తీసుకురావాలని తాపత్రయ పడుతుంది. నీకు మంజుల వృద్ధిలోనికి రావటం ఇష్టమేనా?" అన్నాడు సింహాలుముఖంవైపుకు సూటిగాచూస్తూ.

"అదేమిటి బాబూ! వృద్ధిలోనికి ఆ రాక్షసి రానివ్వటం

లేదనేగా యిప్పుడు బాధపడేది" అన్నాడు.

"మంచిది ఏ అక్కా తనచెల్లెలు పాడైపోవాలని అనుకోదు. ఆమె ఏవేవో అభిప్రాయాలతో వుంది. మనఅభిప్రాయాలు ఆమె అభిప్రాయాలకు అతకలేదు. అందుకే ఈ గొడవలూను. నాకు నేను జ్ఞానంలేకుండా ఆవేశంతో రెచ్చిపోయాను నన్ను చూసి కమలంకూడ రెచ్చిపోయింది. ఒకొళ్ళ నొకళ్ళం మూర్ఖుల్లా తిట్టుకున్నాం. నిజంగా ఆలోచిస్తే యింతలో ఏమీ లేదు. పట్టింపులకుపోయి మనసులు పాడుచేసికొనటం తప్పించి ఫలితం కనిపించదు. మనంకూడ మంజులను వృద్ధిలోనికి తీసుకు రావాలనేగా తాపత్రయపడేది. కనుక మంజులను మాఅన్నయ్య వద్దకు తీసుకొనివెడదాము" అన్నాడు.

"ఆ తీసికొని వెళ్ళడమనేది జరగొద్దూ ?"

"ఆఁ! ఎందుకు జరగదూ? ఒకమారు గొడవపడినంత మాత్రాన కమలం మన మాటలు త్రోసిపుచ్చుతుందంటే నే నమ్మను. ఒకవేళ ఆమె ఆ విధంగా త్రోసిపుచ్చినా మనం సహనం వహించాలి. ఆమెకు యిప్పుడు కాకపోతే మరొకప్పుడైనా అర్థమయ్యేట్లు చెప్పాలి. అయినా ఎందుకు ఒప్పుకోదూ ? తన చెల్లెలు ఒకగొప్ప నాట్యకత్తెగా, గాయినిగా ఈ దేశంలో అభివృద్ధి చెందుతూంటే ఆటంకపరుస్తుందా. ఆమెకు కీర్తిప్రతిష్టలు వస్తాయనేగా, ఈ శాస్త్రాలు చెప్పించిందీ నేర్పించిందీను. మా అన్నయ్య విషయం ఆమెకు చాలా బాగా తెలుసు. ఒప్పుకోక పోదు. నా మనస్సు మరీమరీ చెబుతోంది ఒప్పుకుంటుందని. మన ప్రయత్నం మనం చేద్దాం. ఆ తరువాత ఆమె అదృష్టం, భగవంతునిదయా. మానవప్రయత్నం అంటూ ఉండాలి కాని

ఏమంటావ్?" అన్నాడు.

"ఏమో మీరేదో అంటున్నారు. అంతా బాగానే వుందికాని, నాకేం అర్థంకావటంలేదు. ఆమె ఒప్పుకుంటుందని నమ్మకమూ లేదు. వృధాశ్రమనిపిస్తోంది" అన్నాడు సింహాలు.

"అప్పుడే అపశృతి పలికితే ఎల్లాగ సింహాలు. దేనికైనా ఆత్మవిశ్వాసముంటేనే జయించకలుగుతాము. అప్పటివరకూ సహనంతో ఓపికపట్టాలి. ఈ పని అయిందంటే ఆ తరువాత మన తెలివితేటలు ఉపయోగించవచ్చు యిష్టానుసారంగా. కాని యిక్కడే జాగ్రత్తగా మసులుకోవాలి" అన్నాడు ఫణిబాబు.

"సరే దానికేముంది? మీరేవిధంగా చెబితే ఆ విధం గానే చేద్దాం. నా శక్త్యానుసారంగా నే ప్రయత్నిస్తా" అన్న సింహాలు మాటలకు—

"శక్తినిమించి చేయలేంకదా? కాని తగినఓర్పు వహించి ఈ పనిచేస్తే కలిగే మంచిచెడ్డలు మంజులకు బాగా అవ గాహనమయ్యేట్లు చెప్పాలి. ఆమెకు మనమీద ఉండే అపోహాలు తొలగిపోయేట్లు ప్రవర్తించాలి. కాని మగవాళ్ళం బలవంతులం కదాని యిష్టమొచ్చినట్లు ప్రవర్తించకూడదు. వారు అనేక విధాలుగా ఊహించుకుని అనేక రకాలుగా మాట్లాడుతారు. అవేం పట్టించుకోకు. పూర్వపు గొడవలన్నీ మర్చిపో. నీకు కావలసినంత డబ్బిస్తాను. నీకేలోటూ లేదు.

ఇక కమలం మాటంటావా? నే చూసుకుంటా. నీకేం భయంలేదు. ఆమెను ఒప్పించే పూచీ నాది. ఆమె మనస్సు ఎలాంటిదో నాకు బాగా తెలుసు. సరే నే పోతాను" అంటూ

వెళ్ళిపోయాడు.

సింహాలకు అతడి మాటలన్నీ అగమ్యగోచరంగా ఉన్నాయి. అక్కడ కమలంచే అన్ని తిట్లూతిని, ఆడదానిచేత దెబ్బలుకూడ తిని, పౌరుషంతో ఏంచేస్తానో చూడంటూ లేచి వచ్చి యింత పౌరుషహీనుడై పోయాడేమిటా అని ఆలోచనల్లో పడ్డాడు. అంతు చిక్కలేదు.

ఆలోచిస్తే బుర్రకు నొప్పనుకుని, ఎవడు ఎల్లాపోతే ఎవరి క్కావాలి. మనక్కావలసిన డబ్బు మనచేతికి వస్తోంది. తగిన డబ్బు పుచ్చుకోవటం, వాడు చెప్పినట్లు చెయ్యటం అని అనుకుంటూ సింహాలు పట్టినన్ని గ్లాసులు పట్టించి ఒళ్లు తెలియకుండా పడిపోయాడు.

# 3

తల్లిదండ్రుల పటములవద్ద నిలబడి నిర్మలహృదయంతో "మీ ఆశీర్వచన బలంతో మన జమీందారీ బాగానే కొనసాగుతోంది. కాని జమీందారీని పెంపుచెయ్యలేకపోతున్నా. ఇది తమ్ముంనకు ఇష్టంలేదు. నాపేరు మీరు 'ధర్మారావు' అనిపెట్టేరు. నేను దానిని సార్థకంచేసికొందుకు తాపత్రయపడ తున్నా. బహుశా మీ ఉద్దేశ్యంకూడ అదే అయివుండవచ్చు. అష్ట కష్టాలతో రక్తాన్నికూడ ధారపోసి ఆర్జించుకున్న ప్రజలసొమ్మును

బలవంతాన గుంజలేను. అదే అసమర్థత అంటాడు ఫణిబాబు. అసమర్థతైతే కావచ్చు. కాని మనకువచ్చే సొమ్మును మనం వదలకుండా తీసికొంటున్నాము. అదనంగా, అన్యాయంగా మన ప్రజల సొమ్మును రాబట్టడం నా తరంకాదు. ఇక వచ్చిన సొమ్మునుకూడ నేను కూడబెట్టలేకపోతున్నాను. పోదుపుచేసి దానిని నేను మాత్రం ఏంచేయను? అందువలన ఈ ధనమును సత్కార్యములకై ఉపయోగిస్తున్నాను. మనవలన కొన్ని కుటుంబాలు స్థిరపడుతున్నాయి. అందువలన ఆ కీర్తి మనకే దక్కుతుంది. ఈ కీర్తి నాకుమాత్రంకాదు. ఎందువలనంటే నేను నా స్వంతధనమును ఖర్చుపెట్టుటలేదు. యిప్పుడు నేను అనుభవించే సంపద మీదే. అందుకు ఆ కీర్తి మీదే. ఇందులో నే గర్వపడవలసిందేమీలేదు. నా నడవడికలో ఏదయినా తప్పున్నా మీకు పైనుండి నా మనసును సన్మార్గములో నడిపిస్తారని ఆశిసున్నా" అని నమస్కారముచేసి నెమ్మదిగా మధ్య హాలులోకి వస్తూ కుర్చీలో కూర్చొనివున్న సారథిని చూసి "ఎంతసేపయిందోయ్! వచ్చి" అన్నాడు.

"ఎంతసేపయితేనేం? తమరాక ఈరోజు యింత ఆలస్యమయిందేం?" అని తిరుగుప్రశ్న వేశాడు ప్రాణస్నేహితుడయిన సారథి.

సారథి చాలా బీదవాడు. అయినప్పటికి జమీందారు ధర్మారావుకు ప్రాణస్నేహితుడు. సారథి లేనిదే అతడేపనీ చేయలేడు. ధర్మారావు సారథికి సహాయంచేయాలని ఆతృత పడతాడు. తనవద్దనే వుండిపొమ్మంటాడు. కాని సారథి "దానికేముందోయ్! మంచిది చూసుకొని దిగిపోతాను" అని కాలం గడి

వేస్తాడు. అంతగా ధర్మారావు పట్టుపడితే "చూడు ధర్మా! యీ లోకంలో అందరూ ఒకేమాదిరిగ వుండరు' ఎవరి అదృష్టాలు వారివి. విధి ఎల్లా నడిపిస్తే అల్లా నడవాలి. నిన్ను ఒక జమీందారునిగాచేసి ప్రజలమెప్పు పొందమంది. మరినన్నో. . .బీద వానిగా పుట్టించింది. అందరినీ జమీందారుల్ని చేసేస్తే యిక దేవునిమాటే మర్చిపోతాం. అందుకని నూటికో. . .కోటికో నీవంటి జమీందారు వుంటాడు. కనుక నీవేమీ బాధపడకు.

అసలు నేను బీదవాడ్ని ఎల్లా అయ్యాను. నీ వంటివాడు నాకు వుండగా నేను బీదవాడ్ని ఎప్పటికీకాను. కనుక ఆ విధంగా ఎప్పుడూ అనుకోకు" అని దీర్ఘోపన్యాసము ఒకటి గుక్కతిప్పుకో కుండా ఒదుల్తాడు. అప్పుడు ధర్మారావు యిక మాట్లాడలేక ఒకనిట్టూర్పు విడుస్తాడు.

అల్లాగే ఇప్పుడో నిట్టూర్పు విడిచి మరలా ఒక దీర్ఘ శ్వాస తీసుకుంటూ, సారథి అడిగిన ప్రశ్నకు "రాత్రి చాలా ప్రొద్దుపోయిందోయ్ పడుకొనేసరికి. అందుచే ఉదయం ఆలస్యంగా లేచాను.

"ఏమో! ఆలస్యమవడానికి రాత్రి ఏమంత గొప్పకార్యం చేశావేమిటి?" అని సారథి అడుగుతుంటే ధర్మారావు అక్కడి నుండి లేచిపోయాడు. అదిచూచి సారథి తెల్లముఖం వేశాడు ఏమీ అర్థంకాక . అసలు యీరోజున ధర్మారావు ఏదో ఆలోచనలో వున్నాడు. కారణం ఏమయివుంటుందా అని ఊహించటం మొదలుపెట్టాడు. కాని అతనికి ఏమీ తట్ట లేదు. ఇంతలో ధర్మారావు ఏవో కొన్ని కాగితాల కట్టను తీసుకు వచ్చి మరలా తన ఆలోచనలో పడిపోయాడు. అది చూచి

"ఏమిటి ధర్మా, యీరోజు విశేషం! ఏదో ఆలోచనలోపడి కొట్టుకుంటున్నావు. అది మేము వినవచ్చా" అన్నాడు.

సారథికి ధర్మారావును 'ధర్మా' అని చిన్న పేరుతో ముద్దుగా పిలవడం అలవాటు.

ధర్మారావునుండి జవాబేమీ లేదు.

ధర్మారావు తీసుకువచ్చిన కాగితాలను చూస్తూ "చూడు ధర్మా! నాకు తెలియకూడని విషయం నా దగ్గరే ముందో నా కర్థంకావటం లేదు. లేకపోతే నే నేదయినా నీకు కష్టం కలిగించేమాట అన్నానేమో. అల్లాంటి దేదయినా వుంటే అదేమిటో చెప్పు. సర్దుబాటుచేసుకుంటా...అనుమానాలకు..."

ఒక్కమారుగ లేచి సారథి చేతిని పుచ్చుకుంటూ "ఎంత మాటన్నావు సారథి! నిన్ను నేను క్షమించడమా. అదీకాకుండ నీతో చెప్పకూడని విషయాలు నాకేమున్నాయి. ఆ వున్న విషయాలు నీకుకాక మరెవరికి చెపుతాను. చెప్పినా వినేవారెవరు? ఎందుకొచ్చిన జమీందారీ యిది సారథీ! నలుగురితో కలసి తిరుగుతూ హాయిగా మాట్లాడటానికయినా నోచుకోలేదు. ఎవరివద్దకు వెళ్ళి మాట్లాడుదామన్నా ఏదో హోదాయిచ్చి బెట్టుబెట్టుగా మాట్లాడి నన్నో పెద్దపులిని చూచినట్లు చూచి ప్రక్కకు తప్పుకుంటారు. ఇక ఫణిబాబు మాటంటావా? వాడి దారి వాడిది. తమ్ముడన్న మాటేగాని యెప్పుడూ వాడు మనసిచ్చి నాతో మాట్లాడలేదు. ఇక అటువంటప్పుడు యీ జీవిత నౌకను నడపటానికి సారథివి నీవయ్యావు. నీవే నాకు ఆసరా. అటువంటప్పుడు నీకుచెప్పక మరెవ్వరికి చెపుతాను.

"చూడు సారథీ! యీరోజు నా జన్మదినం" అని ఏదో

ఆలోచిస్తూ "అమ్మానాన్న వుంటే యీ ఇల్లు ఎంత కళకళ లాడుతూ వుండేదో కదా! యింత భవనం, నౌకర్లూ వున్నారన్న మాటేగాని ఎవరిమాట వారిదే. ఎవరిధోరణి వారిది. ఇప్పుడు నాకా ఆనందం ఏది? దేనికయినా యీ నుదుటన అనుభవించ డానికి రాసివుండాలి. ఎంతధనం వుంటేమాత్రం ఏంప్రయోజనం? నలుగురూ "వారికేం కావలసినంత ధనం వుంది. ధనం వుంటే యీ లోకంలో దొరకని దేముంది" అంటారు. కాని వారు అనుకున్నది బాహ్యంగాలభించేది.

"అంతర్గతంగా మనశ్శాంతి, ఆత్మసంతృప్తి ఈ ధనం ఎక్కడివ్వగలదు? హాయిగా కూలిపని చేసుకుంటూ భార్యను, నలుగురు బిడ్డలనూ పోషిస్తూ ప్రతిరోజూ ఇన్ని గంజినీళ్లు తృప్తిగా త్రాగేవానికుండే ఆ మనశ్శాంతి ఈ ధనం యెక్కడివ్వగలదు. అది యెన్నటికీ యివ్వలేదు. ఈ సంపదవుంటే అసలు శాంతే ఆమడదూరంలో వుంటుంది. యీ సంపదను ఎల్లా రక్షించుకోవాలి. ఇంకా ఏవిధంగా కూడబెట్టాలి అనే యాతనలను జీవితాంతం అనుభవించటంతోనే సరిపోతుంది. బీదవానికి ఈ బాధలుండవుకదా! అతడు హాయిగా పక్షివలె స్వేచ్ఛాజీవితం అనుభవిస్తాడు. సారధీ! నాకు స్వేచ్ఛాజీవితం దొరికేమార్గం చూపించు. ఇక్కడినుంచి పారిపోవాలనిపిస్తుంది. బంగారు పంజరంలో బంధింపబడిన చిలుకను నేను. నే నిక్కడ వుండలేను. హాయిగా ఏ అడవుల్లోకో పోతాను" అని బాధతో అంటూ కిటికీవద్దకువెళ్ళి ఏదో యింకా ఆలోచిస్తూ నిలబడిపోయాడు.

యిదంతావిన్న సారధి, ధర్మారావు మనశ్శాంతిలేక చాల బాధపడుతున్నాడని గ్రహించాడు. అవును తమ్ముడు

అతని మాట వినడు. యితడు ధర్మరాజు, దయార్ద్రహృదయుడు. అయితే అతను యమధర్మరాజు, కఠినాత్ముడు. యితనికీ అతనికి అసలు పోలికలేలేవు. ధర్మారావు ఆశయాలకు ఫణిబాబు బద్ధ వ్యతిరేకి. ఒకే చెట్టును భిన్నరుచులుగల ఫలములు లభించవు. కాని ఒక తల్లి కడుపున విభిన్న ప్రవృత్తులు గలవారు జన్మిస్తారు.

ధర్మారావును ఈ ఆలోచనలనుండి బయటకు తీసుకు రావాలని "ధర్మా! చిత్రలేఖనా ప్రదర్శనములో మొదటి బహుమతి ఈరోజున యిస్తానని ప్రకటించావు. యింతకూ ఏ చిత్రానికి బహుమతిని యివ్వదలిచావు" అని అడిగాడు అక్కడున్న చిత్రాలు చూస్తూ.

ధర్మారావు కిటికీవద్దనుండి సోఫావద్దకువచ్చికూర్చుంటూ "సారధీ! నిన్నరాత్రి యీ చిత్రాలను చూడ్డంతోనే సరిపోయింది. వీటిలో నీకు ఏచిత్రం నచ్చుతుందో చూడు" అన్నాడు.

బొమ్మలను తిరగేస్తూ "పుర్రెకో బుద్ధి. జిహ్వకో రుచి. నే చెప్పింది నీకు నచ్చవచ్చు నచ్చకపోవచ్చు" అన్నాడు సారధి.

"ఎంతఏమన్నా మనం ఒకరినొకరు అర్థంచేసుకున్న వాళ్ళం. సమానమయిన తెలివితేటలు కలవాళ్ళం. అటువంట ప్పుడు నేను నువ్వనుకొన్నట్లు అనుకోను ... పోనీ అసలు నీకు యింతకూ ఏదినచ్చిందో అదిచెప్పు. నా పుర్రెను నీవు కాదన లేవుగా" అని నవ్వాడు ధర్మారావు. సారధి అన్ని చిత్రాలను తిరగేసి "నేనేం చెప్పలేకుండా వున్నాను ధర్మా. నాకు ఈ చిత్ర లేఖనంలోని మెళుకువలు, రహస్యాలూ తెలియవు. ఏదో

బొమ్మల్ని చూసి ఆనందించమంటే ఆనందిస్తా. నువ్వు అంతగా చెప్పమంటే నాకు నచ్చిన యిన్ని రంగులు గట్టిగా పూసిన బొమ్మనుతీసి యిది బాగుందంటాను. ఏం అల్లా అనమంటావా?' అన్నాడు వస్తూన్న నవ్వును ఆపుచేసుకొంటూ. ధర్మారావు అతని నవ్వుతో శృతికలుపుతూ అంతపనిచెయ్యకు, కొంపమునిగి పోతుంది అన్నాడు.

అతడిలోవుండే కలసికట్టుతనం అక్కడే కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. కొద్దిగా అతడితో సరదాగా మాట్లాడితే ఆప్తుని వలె హృదయమిచ్చి మాట్లాడుతాడు. అతనిలో హోదాకాని, దర్పంకాని వెతికి పట్టుకుందామన్నా కనిపించవు.

"పోనీలే! ముంచిన కొంపను నువ్వు తేలుద్దువుగాని. యింతకూ నీవు ఏచిత్రాన్ని మొదటిదానిగా నిర్ణయించావు." అంటూ సారథి తనుచూసిన చిత్రాన్ని ధర్మారావు ఎదుటకు సెంటాడు.

ధర్మారావు ఒక్కొక్క చిత్రాన్నే పరిశీలనాత్మకంగా చూస్తూ, ఆఖరుకు ఒక నిర్ణయానికొస్తున్నట్లు తలను యిటు నటు ఆడిస్తూ రెండు చిత్రాలను బయటకుతీసి ఆరెండిటెని మరల పరిశిలించటం మొదలుపెట్టాడు.

అది శ్మశానం. అక్కడక్కడ సమాధులు, గోరీలు కన్పి స్తున్నాయి. ప్రక్కనే నిర్మలంగా గోదావరినది ప్రవహిస్తోంది. గట్టు అంచున ఒక శవాన్ని దహనం చేస్తున్నారు. మంటలు పైకి ఎగసెగసి వస్తున్నాయి. రుద్రభూమంతా భయంకరంగావుంది. కాకులు, గ్రద్దలు ఆకాశంలో ఎగురుతున్నాయి. ఏదయినా ఆహారం దొరుకుతుందేమోనన్న ఆశతో పహారాకాస్తున్న

వాటిలా కుక్కలు యిటు అటు తిరుగుతున్నాయి. యింకా సూర్యాస్తమయం అవ్వలేదు. యిప్పుడిప్పుడే ఆకాశంలో ఒక మూలనుండి గాఢవర్ణం నీలాన్నికప్పి శ్మశానానికి ముసుగు వేస్తోంది భయంకరంగా. ఎక్కడచూచినా పుర్రెలు, ఎముకలు. ఒకమూల కాళ్ళకు, మరొకమూల చేతులకు సంబంధించినవి. యింకొకమూల పుర్రెలు—భీతిగొల్పుతున్నాయి.

ఒక పుర్రెను తప్పించుకొని, దానికేసి ఏహ్యంగా చూస్తున్నట్లు, అది అతగాడ్నిచూసి నవ్వుతున్నట్లూ వుంది. దాని ప్రక్కనే మరొకటి జాలిగా అతగాడ్నిచూస్తూ ఏదో చెప్ప బోతూంటే అతడక్కడే నిలబడినట్లున్నది.

యీ చిత్రాన్నిచూస్తూ చాలాసేపు మాట్లాడకుండా వుండిపోయాడు. మరో చిత్రాన్నికూడ కొంతసేపు పరికించి "శ్మశానవాటిక" అని వ్రాసివున్న చిత్రాన్ని సారథి ఎదుట వుంచి "యీ చిత్రంలో చిత్రకారుని భావమెంత గొప్పదో చూడు. హృదయాన్నే కదిలించివేసింది ఆ కుంచె. ఎంతగొప్ప చిత్రకారుడోకదా! అవునుకాని ఈ చిత్రకారుని పేరేమిటో చూడు సారథీ!" అన్న ధర్మారావుతో "మధు" అన్నాడు సారథి.

మధు అన్నపేరు వినగానే 'ఆ...!' అని ఆశ్చర్యంగా సారథివైపు చూడగా "ఏం అంత ఆశ్చర్యబోతున్నావు. ఆమధు నీఎదుట ఎప్పుడూ చిత్రాలు వెయ్యలేదా" అన్నాడు సారథి.

"ఎదురుగా చిత్రాలు వేయడానికి అతడ్ని నేను ఎరిగుం టేనా. అదికాదు. ఆచిత్రానికి ... మధు అన్న పేరుకు అస లెక్కడా పోలికలులేవే అని ఆశ్చర్యపోయాను"

"ఎంత వెర్రివాడవు ధర్మా నీవు!" అని మనస్సులో అనుకుంటూ పైకి "నీ పేరు ధర్మారావని, నీవు ధర్మరాజువు అయిపోయావని అనుకుంటున్నావేమిటి. యిది కలియుగం. పేరుకుతగ్గ గుణాలు మనిషికి వుండవు.

"పతి ప్రాణాలుపోతే తిరిగి బ్రతికించుకున్న 'సావిత్రి' లా యిప్పుడు ఎంతమంది సావిత్రులు తిరిగి తమభర్తల ప్రాణాలు కాపాడుకుంటున్నారు? ఎంతమంది 'అహల్యలు' వ్యభిచరించటం లేదు ఈ లోకంలో. 'సత్యం' అనే పేరు ఎంతమందికి లేదు. పేరుమాత్రం సత్యం. ప్రవర్తనమాత్రం అసత్యం. కనుక ఇందులో చెప్పుకోతగ్గ దేమీలేదు.

"యింతకీ నీకీ 'శ్మశానవాటిక' తప్పించి మరేమీ నచ్చలేదన్నమాట" అన్నాడు సారధి నవ్వుతూ.

"అవును నీకు నవ్వులాటగనే వుంటుంది. అందులో ఈ మధు ఎంత గొప్పభావం వెలిబుచ్చాడో చూశావా ? ఈ చిత్రాన్ని అతనే తీసుకొని వచ్చియిచ్చాడా ?" అన్న ధర్మారావు మాటలకు "అంతహృదయాన్ని కదిలించేభావం అందులో ఏముందో" అన్నాడు సారధి.

"మధు భావమేమిటో నీకు క్లుప్తంగా చెపుతానువిను.

"మనం మానవులం. పుట్టినవాడు ఎప్పటికయినా గిట్టక తప్పదు ఈకాలంలో. అంటే పూర్వకాలంలో చావలేదా అంటావు. కాని, మనపురాణాల్లో కొందరు మరణంలేకుండా చిరంజీవులుగా వుండేట్లు వరాలు పొందినారని చదువుతాము. కాని, యిప్పుడల్లా వరాలు యిచ్చేనాధులు లేరు." అటువంటిది మన మానవుల్లో, మానవులకే బేధభావాలువుంటాయి. అవి——

ఎక్కువ, తక్కువలు, కులమత భేదాలు మొదలయినవి. యివి మానవాళితో చెలగాటాలాడుతాయి, మనం వాటికి లొంగి తల్లొగ్గాల్సినదే! ఇంతకూ మధు భావమేమిటంటే— చూడు. నవ్వుతున్నట్లున్న ఆ పుర్రెను ఆ మనిషిచూసి అసహ్యించు కొంటూ ప్రక్కకు తప్పుకోపోతూంటే, రెండవపుర్రె ఏదో మందలిస్తూన్నట్లుండం. అది ఆమనిషి వినయంగా వినడం. మొదటి బొమ్మలోని అతని ముఖకవళికలకి, రెండవ బొమ్మలో ముఖ భావాలకి వేరు వేరుఅర్థాలు గోచరిస్తున్నట్లున్నాయి. ఇప్పుడు ఆరెండవబొమ్మలోనివాని పూర్వమున్న ఏహ్యత గోచరించటం లేదు. అతనిలో ఏదో ప్రశాంతతకనిపిస్తోంది. దీన్ని బట్టి నాకు తోచిన భావమేమిటంటే 'ఎందుకల్లా అసహ్యంతోనూ, భయం తోనూ ప్రక్కకు తప్పుకుంటావు అజ్ఞానుడా' అని అతడ్నిచూచి నవ్వుతూన్నట్లుంది మొదటి పుర్రె. యిక రెండవపుర్రె 'ఎందు కలా మిడిసిపడిపోతావు. బ్రతికినంతకాలం మానవుడుగా మం చిగా బ్రతుకు. నువ్వుఎంతసంపద గడించినా నీ జీవితంతో ఆఖరు. నువ్వు ఎప్పటికయినా మావలె మట్టిని కలవకతప్పదు. ఒకానొక ప్పుడు మేము కూడా నీవలె మానవునిగా విర్రవీగి గొప్పగా బ్రతకాలని తాపత్రయపడి అనేకమందిని ఏడిపించినవాళ్ళమే. కాని ఆఖరుకు యిల్లా పడివున్నాము. అయితే మంచిగా బ్రతికినవాడుకూడ మాలో కలిశాడు. మంచి, చెడ్డ బేధ భావాలు యిక్కడ లేవు. అయితే ఆ మంచి చెడులు శరీరంలో జీవం వున్నంతకాలం వుంటాయిగా. అది లోకంలో జీవం వున్నంతకాలం వుంటాయి. కనుక మంచికై పాటుపడు. మమ్మల్ని అసహ్యించుకున్నట్లే మీరు మీతోటి మానవుల్ని

కూడ అసహ్యంగా చూస్తారు. అది చాల పొరపాటు. ఆఖరికి నువ్వూ - నీవు అసహ్యించుకుంటున్న మనిషీ యీ మట్టిలో కలవకపోరు. అప్పుడు మీధనం రక్షించదు. అటువంటి కోటీశ్వరులు, రాజులు, కీర్తిపరులు, దుర్మార్గులు మొదలగు అనేక మంది ఈమట్టిలో కలసిపోయారుసుమా-' అని బోధిస్తూంటే అతనిలో భావాలు మారినట్లుగా సృష్టించాడు మధు. నేను గమనించిన భావం యిది. ఇక మధుభావాలు యింతకన్నా గొప్పగా వుండి వుండొచ్చని నాభావన. ఎందుకంటే అతడు ఏభావాలతో యిట్లా చిత్రించాడో, యింతకూ ఆ మధు ఎవ్వరు?' అని సారథిని ప్రశ్నించాడు.

అవును ఆ మధు ఎవ్వరు? తనకేం తెలుసు. మధు ఎవ్వరో ! బజారులో చినిగిపోయిన బట్టలతో, బక్కగా గడ్డం పెరిగిపోయి, చింపిరి క్రాపుతో తిరుగుతున్నడో వ్యక్తి. అతడే నా మధు! అయితే యింత గొప్పచిత్రకారుడు అలానడిరోడ్ల వెంట తిండికి మొహంవాచి కళని అమ్మేస్తున్నాడన్నమాట. అయితే అవ్వచ్చు. ఈ ప్రపంచంలో ఎంతమంది గొప్పవారు బానిసలైపోవుటలేదు దారిద్ర్యానికి. కళను పోషించేనాథుడు కూడ లేడు. రాజాదరణలు పొంది రాజులకంటె గొప్పగాబ్రతికే కళాకారులు ఈకాలంలో మట్టిలోని మాణిక్యాల్లా చెట్టుకొకరు పుట్టకొకరుగ చెదరిపోయారు, వ్యక్తిత్వాలను కోల్పోయి. బహుశా కళాకారునికి దరిద్రదేవతకి దగ్గర చుట్టరికమేమో ! శ్రీ కృష్ణదేవరాయలు ఎంతమంది కళాకారుల్ని పోషించలేదు. అటువంటి మహానుభావులు, కళాపోషకులు యీ లోకంలో వున్నారా? అసలు ఈ ప్రపంచములో కళాకారుడుగ పుట్టటమే

ఒక చేయరానినేరం. అతనివద్ద యింత విలువయిన చిత్రాన్ని రెండు రూపాయలకు కొన్నాను. 'పాపం' అని మధునిగూర్చి ఆలోచిస్తూ 'చూడు ధర్మా! నేనొక పెద్దపొరపాటు చేశాను. యీ చిత్రాన్ని నేనొక బీదవానివద్ద రెండురూపాయలకు కొన్నాను. సరదాకని యీ చిత్రాన్ని ఆతడి పేరుమీదుగా పోటీల్లో పెట్టాను." అన్న సారథిమాటలకు ధర్మారావు నిరాశా పరుడయ్యాడు. యిప్పుడా మధు తనకెక్కడ దొరుకుతాడు అని బాధపడ్తూ 'ఎంతపని చేశావుసారథీ..! ఈ రోజు మరలా బజారు పోయి ఎంతఖర్చయినా సరే అతడెక్కడున్నా వెతికి తక్షణం తీసికొని రావాలి. ఒకవేళ ఈగ్రామంనుంచి వెళ్లిపోతే ప్రక్కగ్రా మాలు కూడ వెతికించు. నువ్వుకూడ స్వయంగా వెతికి తీసుకు రావాలి. మధుని చూసేవరకూ నాకు ఆత్మశాంతి లభించదు. అతడు బీదరికంతో ఎంతబాధపడుతున్నాడో! అతడ్ని చూడలేక, అతడి కళను గౌరవించలేక నేనెంత బాధపడుతున్నాను" అంటూంటే సారథి తెల్లబోతూ ధర్మారావువంక చూస్తు న్నాడు.

'నీకు అర్థం కావటంలేదు నాబాధ, అయితే అయిందిలే తరువాత తెల్లబోయిచూద్దువుగాని; మొదట వెతికితీసికొనిరా' అంటూ లోపలికి వెళ్ళి వందరూపాయలనోటు ఒకటి సారథికి యిచ్చాడు.

సారథికి అది అర్థంకాక 'యీ డబ్బుఎందుకు' అని అడిగితే 'ఆలస్యం చెయ్యక తొందరగా బయలుదేరు. అవసర మయితే ఖర్చుకి వెనుదీయకు. యింకా కావాలంటే యిస్తాను. యిందాకనే చెప్పాను యీరోజు జన్మదినంఅని. అందుకు

కానుకగా నువ్వు మధును నాకు వెదికియివ్వడమే. యింతకంటే నాకు సంతోషకరమైనది యింకొకటిలేదు. తొందరగ బయలు దేరు' అన్నాడు ఆతృతతో ధర్మారావు.

మధు ఎక్కడ దొరుకుతాడా అని ఆలోచిస్తూ బజారులో రోడ్డువెవు నడిచాడు. రెండు మూడుగంటలు బజారంతా వెతికాడు కాని సారధికి మధు జాడలేవి తెలియలేదు. పూర్వం తను మధు ఎక్కడయితేవుండగా "శ్మశానవాటిక" అన్న చిత్రాన్ని కొన్నాడో ఆ ప్రదేశానికి వెళ్ళాడు. కాని అక్కడా అతడు కనిపించకపోయేసరికి సారధి నిరాశచెందాడు. యిక అక్కడున్నవారిని వాకబుచేస్తే తెలుస్తుందేమోఅని ఆ ప్రాంతంలో వచ్చేపోయేవారిని అడగడం ప్రారంభించాడు.

'ఏమండీ! యిక్కడ రెండుమూడు రోజులక్రితం ఒక చిత్రకారుడు బొమ్మలను చిత్రించి అమ్మేడు. మీకు తెలుసా?' అని ఒక పెద్దమనిషిని అడిగాడు.

'ఏమోనండి మాకు తెలియదు. ఇవన్నీ చెప్పటానికి మా కిదేపని అనుకున్నారా?' అని ఆపెద్దమనిషి విసురుగా దూసుకుంటూ వెళ్ళిపోయాడు.

అతడికి మాట్లాడటానికూడా తీరుబడిలేదట. యిక యిటువంటివాడు ఆర్థికంగాకాని, మరొక విధంగాకాని తోటి మానవునికి తోడ్పడుతాడా? యిల్లాంటివారే తమకు ఒకానొకప్పుడు మరొకరి అవసరం వస్తుందని తెలుసుకోరనుకుంటా.

మరలా మరొకరిని అడిగాడు.

"కాగితాలమీద రంగులతో బొమ్మలు వేసినతడేనా?" అని తిరుగు ప్రశ్న సారధిని వేయగానే సారధికి ప్రాణంలేచి

వచ్చింది. 'ఆ...ఆ... అతడే'! అన్నాడు. అతడు తిరిగి 'అతని పేరు మధు' కదూ!' అని అడిగేడు. ఈసారి హుషారుగా 'అవునండీ అతనిపేరు మధు' అన్నాడు సారథి.

'రెండు రోజుల్రకితం ఆ గెడ్డపుమనిషి ఈ ప్రదేశంలోనే అమ్మేడుకదూ అతని చిత్రాలను' అని అన్నాడు ఆవ్యక్తి.

'అవును' అన్నాడు సారథి.

'మీరు చూశారా ఆచిత్రాలను, అతడు ఎంత గొప్పగా చిత్రించాడో ! పాపం అంత చిత్రకారుడూ పేరూ ఊరూ లేకుండా ఎలా తిరుగుతున్నాడో. చూడండి మంచివాళ్ళకు ఈ లోకంలో సరిఅయినస్థానం లేదుకదూ!' అన్నాడు.

సారథి యివన్నీ విన్నాక మధువిషయం యితనికి తప్పక తెలిసుండవచ్చనుకొని 'యిప్పుడు మధు ఎక్కడున్నాడండీ? అని అడిగాడు.

'ఏమోనండి. యిప్పుడెక్కడున్నాడోమాత్రం తెలియదు.' అన్నాడు ఆ వ్యక్తి. 'అయితే యింతకుపూర్వం ఎక్కడుండేవాడండీ?' అని సారథి మరల ప్రశ్నించాడు.

'ఏమోనండీ ! యింతకుపూర్వం ఎక్కడుండేవాడో తెలియదు కాని, రెండురోజుల్రకితం తన చిత్రాలను అక్కడపెట్టి అమ్మేడు. ఆ రోజున ఆయన చిత్రాలనుచూచి మురిసిపోయానంటే నమ్మండి. నేనేమిటి, కళ తెలుసున్న ప్రతివారు మురిసిపోతారు. యిటువంటి కళాకారులు నూటికొక్కరో, కోటికొక్కరోలెండి. పోతే చూచేవారు ఏదో కాయితంముక్కమీద పంచరంగులూ పులిమితీసుకొచ్చాడని' తేలిగ్గా అనేస్తారు.

అంటూ లోకంతీరు మొదలెట్టాడాయనగారు. ఈసారి సారథికి ఆయన ధోరణి చాల చికాకుపర్చింది.

"యింతకూ ఆయన మీకు తెల్సాండి?" అన్నాడు సారథి.

"మనిషినిచూస్తే మరలా గుర్తుపట్టేంతగా తెలుసండి. యింతకూ ఆయన ఎక్కడకుపోయాడో ఏమో? ఆరోజున కొందామంటే డబ్బుదగ్గర లేక మానేశాను." యింకా ఏదో ఆయన డబ్బావాయించుకుంటుంటే సారథికి ఒళ్ళుమండింది. దాంతో ఆయనగారికి, ఆయనగారి చాదస్తపుధోరణికి వెళ్లొస్తానని చెప్పకుండానే లేచి వెళ్ళిపోయాడు.

ఇక ఒకర్ని అడిగి ప్రయోజనం లేదనుకున్నాడు సారథి. అతడి ఊరూపేరూ వునికీ యిక్కడి వారెవరకీ తెలియదు. పోనీ మనిషి ఆకర్షణీయంగా వుంటాడాఅంటే అదీ లేదు. ఒక బికారివాడిలావుంటాడు. అటువంటివ్యక్తినిగూర్చి ఎవర్ని అడిగితేమాత్రం ఎవరు చెపుతారు? అని అనుకొని రాత్రి వరకూ ఊరంట తిరిగి చివరకు చిరాకుగా ధర్మారావును చేరుకున్నాడు.

ధర్మారావు సారథిని బయటకు ఏ వాతావరణంలో పంపాడో యిప్పుడూ అల్లాగేవున్నాడు. కళ్లు మూసుకొని సోఫాలో వెనక్కి జేర్లాబడి ఏదో ఆలోచిస్తున్నాడు. చేతుల్లో మధుగీచిన చిత్రం అల్లాగేవుంది. మిగిలిన చిత్రాలు బల్లమీద అల్లాగే పడి గాలికి రెపరెప కొట్టుకొంటున్నాయి.

సారథి ప్రవేశిస్తూ ధర్మారావును ఏవిథంగా పలకరించాలో తోచక చిన్నగా ఒక దగ్గు దగ్గేడు.

ధర్మారావు ఎవరో వచ్చారనే ఉద్దేశంతో కళ్ళు తెరవగనే సారథి ఎదురుగుండా కనిపిస్తే ఆత్రుతగా ముందుకువంగి, నిరాశతో మరలా వెనక్కు జేర్లపడ్డాడు.

రెండుమూడు నిముషాలు వాళ్ళ యిద్దరిమధ్య నిశ్శబ్దం అలుముకొంది.

'సారథీ ! మధు కనిపించలేదుకదూ' అన్నాడు ధర్మారావు. అతడి మాటల్లో, చూపుల్లో నిస్పృహకన్పిస్తోంది, కంఠం జీరపోయింది.

ఈ ధోరణినుండి తప్పించాలన్న ఉద్దేశ్యంతో 'ధర్మా ! అప్పటినుంచి యిల్లాగే కూర్చుండిపోయావా ? భోజనమేనా చేశావా లేదా ?' అన్నాడు.

'యిక భోజనం కాక మరేంచెయ్యాలి. అనవసరంగా నిన్ను కష్టపెట్టేను. నేను ఈవిధంగా ఎప్పుడూ బాధపడలేదు సారథీ. సరేలే అవన్నీ యిప్పుడెందుకు. నడు, యిద్దరం కలసి ఏకంగా భోజనంచేద్దా'మని లేచాడు. సారథికి యిష్టం లేకపోయినా ధర్మారావు పట్టుదలవల్ల తప్పిందికాదు. భోజనాలు అయిన తరువాత "ఏమిటి ధర్మా! అతన్నిగూర్చి అంతగా బాధపడ్తావు. లోకంలో యితనొక్కడే బీదరికం అనుభవిస్తున్నాడా. ఇటువంటి కళాకారులు నూటికి ఒకరో, యిద్దరో భాగ్యమును అనుభవిస్తున్నారు. మిగతావారి గురించి మీవంటివారు బాధపడతారు. కాని ఎంతమందినని మనం ఆదుకోగలంచెప్పు. అందుకని నామాటవిని యింతటితో యీగొడవ వదిలిపెట్టెయ్యి. అతనికి మనం సహాయంచెయ్యాలని చూచాముగాని, సహాయంచేసే అదృష్టం మనకులేదు. మనవలన ఉపకారంపొందే అదృష్టం అత

నికిలేదు. విధి అతన్ని అట్లా రాపాడించేస్తూంటే మనమేం చెయ్య గలం చెప్పు' అన్నాడు సారథి, ధర్మారావును శాంతపరచాలనే ఉద్దేశ్యంతో.

"నువ్వు చెప్పిందీ కాదనను. మనం ప్రతిఒక్కరిని పోషించ లేంకూడ. కాని మధు నన్ను తన చిత్రంద్వారా పూర్తిగా వశపర్చుకున్నాడు. నా హృదయాన్ని కదిలించిం దా చిత్రం. ఇప్పటికికూడ కళ్లుమూసుకుంటే ఆ పుర్రె నా ఎదుట నిలబడి నాకేదో బోధిస్తున్నట్లుంది. కడుపులో చేయిపెట్టి ఈపాడు ప్రపంచం దేవేస్తున్నట్లుంది. అతడు ఎన్నికష్టాల్లో లేకపోతే ఆ విధంగా వైరాగ్యంతో చిత్రించాడోకదా! అతడు గొప్ప విజ్ఞాని, అనుభవముగలవ్యక్తి. అతడు నాహృదయానికి చాల సన్నిహితుడయిపోయాడు. అయితే మాత్రం ఏంచేస్తాం" అని ధర్మారావు వూరుకుండిపోయాడు.

"రేపు మరలా వస్తాను. ఈ ప్రక్కగ్రామాలలో వాకబు చెయ్యవచ్చు" అని లేచాడు సారథి.

"నువ్వు ఏమీ శ్రమఅనుకోకు సారథీ! నాకు పూర్తి నమ్మకం వుంది. అతడు మనకు దొరుకుతాడని గట్టిప్రయత్నం చెయ్యి. ఇంకా సొమ్ము తెస్తానుండు చాలదేమో" అని లేస్తూంటే "ఈరోజు యిచ్చిన వందరూపాయలూ నావద్దనే వుండి పోయాయి. అవి అయిన తరువాత అంతగా అవసరమయితే యిద్దువుగానిలే. సరే పొద్దుపోయింది. వెళ్ళొస్తాను" అంటూ లేచి వెళ్ళిపోయాడు.

మరునాడు ప్రక్కగ్రామాలన్నీ వెదికించడం మొదలు పెట్టాడు. తను స్వయంగా వెతుకుతున్నాడు. సారథికి చాల

ఆశ్చర్యం వేసింది. మధుని ధర్మారావు చూడనయినాలేదు. కాని చిత్రం చూచినంత మాత్రంచేత మధు అతనికి సన్నిహితుడై పోయాడు. ఆ ప్రబంధువుకన్నా మిన్నయిపోయాడు. లేకపోతే ఎవరో ముక్కూ మొగమూ తెలియని వ్యక్తికొరకు నిద్రహారాలుకూడ మానేస్తానంటాడే! నిజమే. కొందరిని చూడగనే మనం వాళ్ళని ఎంతో దగ్గరివానిలా ఎంచుకొని హృదయమిచ్చి మాట్లాడు తాము. మరికొందరు పిలచి పలుకరించినా అసహ్యించు కుంటాము. ఇదిఏమో పూర్వజన్మ సాన్నిహిత్యం అంటే ఆ సాన్నిహిత్యమే ఇప్పుడుకూడ మనుష్యులను కలుపుతుంది. అయితే మధుకు కూడ ధర్మారావంటే ఆ విధమయిన సన్నిహిత సంబంధం వుండాలిగా? అన్న అనుమానం పొడచూపింది. కాని మధు అన్నవ్యక్తి అంటే ధర్మారావుకు తెలుసుకాని ధర్మారా వనే మంచివ్యక్తి వున్నాడని మధుకి తెలియకపోవచ్చుగా. అని తనలో తను మళ్ళీ సమాధానపడ్డాడు. మధు తప్పక కనిపిస్తాడని ధర్మారావులో నమ్మకం వుందట. మధుమీదవుండే ఆప్యా యతవలన అల్లా అనిపించిందేమో అని మరలా తలచాడు. ఈ విధంగా ఆలోచనలతో సాయంత్రంవరకూ ఆ వూరు వూరంతా వెతికాడు. కాని మధుజాడ ఎక్కడా కనిపించలేదు.

ఇది మరీ విచిత్రమయినది. స్నేహమంటే ఈ విధంగా వుండాలి. నిస్వార్థమయిన స్నేహం. మిత్రుడు బాధపడుతున్నా డనే చింతతో తను శ్రమను లెక్కచేయకుండా మండుటెండలో ఆ మధుకొరకు తిరగటం చాల వింతయినదే. స్నేహం విలువ తెలియనివారికి అది వింతగను పనికిమాలినదిగను గోచరిస్తుంది. కాని ఆ ప్రమిత్రులు ఆ విధంగా గోచరించక తన స్నేహితుని

కష్టసుఖాలు తమవిగనే భావించుకొని బాధపడతారు. సంతోష పడతారు. ఆదుకుంటారుకూడ. ఆదుకున్నామని చెప్పుకోరు. దీన్నే స్వార్థరహితమయిన స్నేహమంటారు.

కాని సారథి స్నేహంలో ఆ విధమయినస్వార్థం ఎక్కడా కనిపించదు. సారథికి మిత్రుడన్న వాడల్లా ధర్మారావు. ధర్మా రావుకు మిత్రుడు సారథి. సాధారణంగా లోకంలో ఒక ధనికు నకు మరొక బీదవానికి స్నేహసంబంధాలు చాల అరుదు. ఒక వేళ ఎక్కడేనా అల్లా ఏర్పడినా అది ఎంతోకాలము నిల్చి వుండదు. ఒకే అంతస్థులో వున్నవారు స్నేహంచేస్తే అది నిలు స్తుంది. కాని ధనికులకు బీదవారికి స్నేహం కలపడం పిల్లికీ ఎలు కకీ స్నేహం కలుపడంవంటిది. సామాన్యులపంథాలో అయితే ఈ స్నేహానికికూడ ఏదో పెద్దసంఘటన వంటిది జరగందే వుండదు. అటువంటి సంఘటనవలననే వారిహృదయాలు విడ తీయ లేనంతగా హత్తుకుపోతాయి.

అదేవిధంగా సారథి ధర్మారావుల స్నేహం విడతీయలే నంత గాఢంగా హత్తుకుపోవడానికి వారి జీవితాల్లో ఒకగొప్ప సంఘటన జరిగింది. అది గుర్తుకువచ్చినపుడుడల్లా ధర్మారావు శరీరం జలదరించి ఒక్కసారిగా సారథిమీద అవ్యాజమైన ప్రేమ అల్లుకుపోతుంది.

# 4

బహుశా అప్పటికి ధర్మారావుకి పదునాలుగేళ్ళుంటాయి. అప్పుడు తోటివానికన్న అతనిలో కొద్ది అతిశయం గోచరించేది. అది తల్లిదండ్రుల పెంపకంవలన రావచ్చును. కాకపోతే ఉపాధ్యాయులు పాఠశాలలో అతడు జమీందారుల బిడ్డడని అందరికన్న గౌరవంతో చూసి వుండవచ్చును. ఆ పాఠశాలలోనే సారధికూడ చదువుతూండేవాడు. తండ్రిని పోగొట్టుకొని తల్లి కాయకష్టంమీద బ్రతుకుతూ చదువుకుంటున్నాడు. బీదవాడగుటవలన అందరూ కొద్దిగా హీనంగా చూసేవారు. ఇతనిలో సాత్వికగుణం వుండుటవలన వారేమన్నా, ఎంత చిన్నచూపు చూసినా మాట్లాడక ఊరుకునేవాడు.

ఒకరోజున పాఠశాలలోని పిల్లలు, ఉపాధ్యాయులు కలిసి ఆ ఊరికి రెండుమైళ్ళ దూరంలోవున్న కొండకు షికారుకి వెళ్ళారు. సరదాగా కబుర్లు చెప్పుకుంటూ ఆ సాయంత్రందాకా తిరిగేరు. ఉపాధ్యాయులు అలసిపోయుండుటవలన ఓ చెట్టుక్రింద విశ్రాంతి తీసికొంటున్నారు.

ఇంతలోకే "బాబోయ్ మాష్టారూ...మాష్టారు..." అన్న కేకలు కంగారుగ వినబడితే తక్షణం ఆ ఉపాధ్యాయులు ఆ కేకవచ్చినవైపు పరిగెత్తారు. పిల్లలు అటుయిటు అర్థం లేకుండా కంగారుగ పరుగెత్తుతు ఒకరు 'మాష్టారూ' అని

మరొకరు 'ధర్మారావూ' అని అరుస్తున్నారు. ఆ ప్రదేశానికి చేరిన ఉపాధ్యాయులు కూడ తెల్లబోయారు, ఏంచేయడానికి తోచక. వారిని భయంపట్టుకుంది. సమయస్ఫూర్తి వారిని విడిచి పెట్టింది. సారథి ఎక్కడికో పరుగెత్తుకు పోతున్నాడు.

లోతయిన ఆ సెలయేటిలో దిగడానికి ప్రతివారికి భయమే. అందులోనూ నీరు చాల వడిగా ప్రవహిస్తోంది. ఉపాధ్యాయులు అక్కడికి చేరేసరికి ధర్మారావు నీటిలోని సుడి గుండంలోపడి గిరగిరా తిరుగుతూ మునుగుతూ, తేలుతూ సెలయేటి మధ్యకు పోయాడు. వారు ఈ దృశ్యాన్నిచూసి ఏం చెయ్యడానికి తోచక చిందులుత్రొక్కటం తప్పించి మరొకటి ఏమీ చేయలేకపోతున్నారు.

ఎత్తుపల్లాలుగావున్న ఆ కొండమీదనుంచి పరుగెత్తుతూ, పడుతూలేస్తూ ఆఖరకు సారథి సెలయేటికి ఆనుకొని నీటిపైకి వంగివున్న ఒక వృక్షండగ్గరకుచేరి దాన్ని ఎక్కేడు. ఉపాధ్యాయులు ఇదేం గమనించే స్థితిలోలేరు. వెఱ్ఱివారయి కొట్టుకు పోతున్న ధర్మారావునుచూస్తూ 'ధర్మారావ్, ధర్మారావ్' అని పిచ్చిగా అరుస్తున్నారు. సారథి గబగబా సెలయేటి మధ్యవరకూ వ్యాపించివున్న ఒక కొమ్మమీదకు ఎగబాకేడు. చివరివరకూ వెళ్ళడంవలన కొమ్మ నీళ్ళలోకివంగింది. ఆ కొమ్మని జాగ్రత్తగా పట్టుకొని నీటిలో కొట్టుకొనివస్తూన్న ధర్మారావుని అతినేర్పరితనంగా పట్టుకొన్నాడు. ధర్మారావు నీళ్ళలో కొట్టుకొనివస్తూంటే అతనితోకూడ గట్టుమీదనుంచి పరుగెడుతూ వస్తూన్న ఉపాధ్యాయులూ,పిల్లలూ ఇది చూశారు. సారథి నెమ్మదిగా ధర్మారావుని కొమ్మమీదకు ఎక్కించి సేదతీర్చుతున్నాడు. తరువాత నెమ్మ

దిగా చెట్టుమీదనుండి క్రిందకుదింపి, అతన్ని వారియింటికిచేర్చి జరిగినదంతా ఉపాధ్యాయులు జమీందారుకి చెప్పి తమ పొర పాటుని క్షమించమని వేడుకొని వెళ్ళిపోయారు. సారధిని జమీం దారు అక్కడే వుండిపొమ్మంటే వుండిపోయాడు. తన ప్రాణాన్ని సహితం లెక్కచేయకుండా వయస్సుకి మించిన జ్ఞానంతో సమయస్ఫూర్తితో తన కొడుకుని రక్షించిన సారధిని చూసి నప్పుడల్లా ధర్మారావు తండ్రిహృదయం ఆనందంతో నిండి పోయి అతడికి కృతజ్ఞత ఏవిధంగా తెలుపవలెనో అర్థంకాక ఉక్కిరిబిక్కిరయిపోయేవాడు. తను ఏవిధంగానూ సారధి ఋణం తీర్చుకోలేనని తలచి సారధిని తన ఒడిలోనికి తీసుకొని ముద్దాడుకున్నాడు. సారధి చీకటిపడిపోయినా యింకా యింటికి రాలేదని వూరిలోని పిల్లల్ని వాకబుచేసి, జమీందారు గారి యింటివద్ద వుండిపోయినట్లు తెలుసుకొని భయపడ్తూవచ్చిన సారధితల్లి ఈ దృశ్యాన్ని చూసి అర్థంకాక నిశ్చేష్టురాలయి వాకిలిముందరే నిలబడిపోయింది. కొంతసేపయినతరువాత జమీందారు ఒడిలోవున్న సారధి యిదేం అర్థంకాక భయంతో బయటకుచూస్తే ఎదుటగా తల్లి కనిపించడంతో ఒక్క పరు గులో ఆయనవద్దనుండి తల్లివద్దకు చేరుకొన్నాడు. యిదిచూసి జమీందారు ఆమెను సమీపించి లోపలకు రమ్మని, గౌరవించి, సారధి తన కొడుకును ఏవిధంగా రక్షించిందీ చెప్పి, "యిటుపై నుండి నాకు ధర్మారావు ఒక్కడేకాదమ్మా నా కొడుకు. సారధీ నా కొడుకే. మీవాడు మాకు చేసిన మేలుకు ఈ కృత జ్ఞత చాల అల్పమయినదే. కాని యింతకంటె సంతోషదాయక మయినది నాకు మరొకటి గోచరించలేదు. నీవూ, మీఅబ్బాయి,

యిటుపైనుండి నా కుటుంబంలోనివారే. యిక మీరు మా యింటివద్దే వుండిపోవాలి." అని కృతజ్ఞతతో అంటూంటే సారథితల్లికి యిదంతా అగమ్యగోచరంగా వుంది.

"ఏం అమ్మా! మాట్లాడవేం. ఏదో సందేహిస్తున్నట్లుగా వున్నావు. నా కొడుకును నేను ఎంతవాణ్ని చేయదల్చుకొన్నానో సారథినీ అంతవాణ్ని చేస్తాను. నా కుమారుడు వృద్ధిలోకి రావడంకంటె మరొకటి నాకేం కావాలి చెప్పు" అని బ్రతిమాలుతూ అడిగాడు.

కొంతతడవు ఆమె ఏదో ఆలోచించి "మీ సహాయానికి, ఔదార్యానికి కృతజ్ఞురాలను. నాకొడుకు భవిష్యత్తు గురించేకదా నేను కలలుకనేది. ఆ కలలు నిజమవుటకే కాయకష్టంచేసి వానిని పెంచి, ఒక దారికి తీసుకువస్తూన్నదీను. అయితే మేము పూర్తిగా మీమీద ఆధారపడిఉండడం అంత మంచిదికాదు. శక్తివంచనలేకుండా నేను చేయవలసినదంతా చేస్తాను. నేను చేయలేనిపరిస్థితుల్లో మీరు దయవుంచి మమ్మల్ని ఆదుకుంటే చాలు. వాణ్ని వృద్ధిలోనికి తీసుకురావటం నా విధి. అందుకు ఎన్ని కష్టాలనయినా ఎదిర్చి నిలవటం నా కర్తవ్యం. భగవంతుడు నాకు ఆపత్సమయంలో ఆదుకునేందుకు మిమ్మల్ని, మీ దయనూ చూపెట్టాడు. మీరు మాకు "ఊతకర్ర" అంతే. పడిపోతూన్న మాకు మీరు ఆధారం. అంతేకాని దొరికిందేసందని మీమీదే పూర్తిభారాన్ని మోపటం మాకు న్యాయంకాదు. హర్షించతగ్గది కాదు. అందుకు మీరేమీ అభ్యంతరం చెప్పరనుకుంటా."

ఆమెచెప్పిన మాటల్లో సత్యం లేకపోలేదు. తను కృత

జ్ఞతగా ఇప్పుడు ఆమెకు సహాయం చేస్తున్నా డంతే. తను ఆమెకు సహాయం చెయ్యకపోయినా ఆమె చెప్పినట్లు తన కొడుకుని అధోగతిపాలు చెయ్యదుగదా! అని ఆమె యిష్టాన్ని కాదనలేక "మీ మాటను నే త్రోసిపుచ్చలేకపోతున్నాను. కాని మిమ్మల్ని ఒకటి అర్థిస్తున్నాను. మీరు ఎప్పుడూకూడ నన్ను మరొకనిగా తలచక మీకు ఏవిధమయిన అవసరం కల్గినా నన్ను అడగడానికి వెనుదీయకండి. యింతకన్నా నేనేమీ చెప్పలేను. కాని మీరు బాధపడుతుంటే నాకుమాత్రం మనశ్శాంతి లభించదు" అని అర్థిస్తూ తన కృతజ్ఞతను బాధతో ఆమెకు తెలుపుకొన్నాడు

కరుణామయిఅయిన ఆయనకు ఆ తల్లి మనస్సులోనే కృతజ్ఞతాపూర్వకంగా నమస్కృతులను అందజేసి శెలవుతీసికొని సారథితో తనయింటికి వెళ్ళిపోయింది. అప్పటినుండే ఆయన బ్రతికున్నంతకాలం ఆ కుటుంబానికి ఎంతో సహాయంచేశాడు. ఆవిధంగా చేస్తేనేగాని ఆయనకు మనశ్శాంతి లభించేదికాదు.

## 5

అప్పటినుండే సారథికీ ధర్మారావుకీ గాఢమయిన స్నేహం పెనవేసుకుపోయింది. తండ్రినిమించిన ఔదార్యం ధర్మారావుకు అలవడింది. తమ్ముడు ఫణిబాబుకంటె సారథి మిన్న ధర్మారావుకు. సారథికి అంతే. వారు ఒకరినొకరు క్షణంకూడ విడిచి

వుండలేనంతగా స్నేహం అలుముకుపోయింది.

అనేకవిధాలుగా ఆలోచించుకుంటూ సారధి ఆ సాయం త్రపు చల్లగాలిలో నెమ్మదిగా నడచివస్తున్నాడు. అప్పటి వరకు అతనుపడ్డ శ్రమఅంతా ఆ చల్లగాలులు మోసుకు పోయాయి.

కొంతదూరం వెళ్ళేసరికి ఒకచోట జనం గుంపుగా మూగివున్నారు. బహుశా అక్కడ మధు తన చిత్రాల్ని పెట్టి అమ్ముతున్నాడేమోనన్న వుద్దేశ్యంతో ఆవైపుకి పరుగెట్టాడు. జనాన్ని తప్పించుకుంటూ లోపలికి వెళ్ళాడు. తను అనుకున్నది నిజమయింది. కాని మధుస్వరూపం యిప్పుడు పూర్తిగా మారి పోయింది! శరీరం బూడిదతో నిండిపోయింది. రక్తాన్ని ధారపోసి అనేక జీవకణాల్ని ఆహుతిచేసి అహోరాత్రాలూ నిద్రాహార ములుమాని చిత్రించిన చిత్రాలు బూడిదలోపడి దొర్లు తున్నాయి. మధు యిప్పుడు అసలు మనలో లేడు.

అతడ్ని చూడగానే సారధికి మతి చలించిపోయినట్లని పించింది. అతడిలో అలజడి బయలుదేరి శరీరం తనకు తెలియ కుండగనే కంపింప నారంభించింది. చేరినవారందరూ మధు అల్లా పడుంటే చూచేవారేకాని ఒక్కరూ దగ్గరకు వెళ్ళినవారు లేరు. సారధి నెమ్మదిగా అతని చేతిని పుచ్చుకొని నాడి చూశాడు. ఫరవాలేదు. బ్రతికేవున్నాడు అనే నిశ్చయానికొచ్చి అక్కడున్నవారితో కొంచెం మంచినీళ్ళు తీసుకురమ్మని చెప్పి ఆనీటిని అతని ముఖంమీాద చల్లి సేదతీరేటట్లు అతని తలను ఒడిలోపెట్టుకొని తువ్వాలుతో విసరడం మొదలుపెట్టాడు.

అప్పటివరకూ వింతగా ఏదో ప్రదర్శనాన్ని చూస్తూ న్నట్లున్న వారందరూ నెమ్మదిగా జారుకున్నారు. సహాయం చేయకపోయినా ఇద్దరుముగ్గురు ఉదారభావంతో ఓదార్పుగా ఏవో రెండుమూడు మాటలని తప్పుకొన్నారు.

ముట్టుకుంటే అంటుకుంటుందని వారిభయం! పాపం కొన్నినిముషాల్లో మధుకి స్పృహవచ్చింది. లేద్దామని ప్రయ త్నించే వాడు కాని తనవల్ల కాకపోయింది. సారధి ముఖంవైపు దీనంగా కృతజ్ఞతతో చూశాడు. సారధి నెమ్మదిగా ఒక బండి మీద మధును పరుండబెట్టి ధర్మారావు ఇంటికి చేర్చాడు.

సారధితో వచ్చిన మధునుచూచి ధర్మారావు చని పోయిన తలిదండ్రులు బ్రతికివచ్చినంతగా సంతసించి సారథిని అమాంతంగా కౌగలించుకున్నాడు.

అతని ఆప్యాయతనుగూర్చి ఆలోచిస్తే వెర్రితనంగానే కన్పిస్తుంది. నెమ్మదిగా మధును తన గదిలోనికి తీసుకొనిపోయి తన పరుపుపయిన పరుండబెట్టాడు. మధు ఇదంతా గమనిస్తు న్నాడే కాని మాట్లాడలేకపోయాడు. అతనిలో పరిజ్ఞానం వుంది గాని నోటితో మాట్లాడేశక్తిలేదు. నీరసం అతనిని లొంగ దీసింది. తినడానికి తిండిలేక నివసించడానికి నీడలేక నిలచినచోట నిలవకుండా తిరుగుతుంటే అతనిగుండె బలహీనమయిపోయింది. ఇవి చాలదన్నట్లు, దరిద్రానికి నేస్తం అంటూ 'మూర్ఛ'రోగం కూడ అతన్ని ఆవరించింది.

తన చేతులారా కొనితెచ్చుకొన్న రోగమే యిది. అయితే అతడి కళాపిపాశ అతడ్ని అల్లా చేసింది. రక్తమాంసా

లను బలికొంటోంది. కాని అతడిలో ఆ బాధే గోచరించదు. కళకోరకు ప్రాణాల్నికూడా లెక్క-చేయటంలేదు. ఇంతచేసినా ఆ కళ తినడానికి తిండికూడ పెట్టడంలేదు. అయినా బాధ పడడు.

ధర్మారావు నెమ్మదిగా మట్టికొట్టుకుపోయిన అతనిబట్ట లను ఊడతీశాడు. అతడు మధుచేతిని చూచి హడలిపోయాడు. ఆ చేతిమీద లోతయిన పెద్దగాయం వుంది. వేగంగా డాక్టర్ని తీసుకురమ్మని సారథిని పంపించాడు.

డాక్టరు వచ్చి మధుని పరీక్షించి చాలబలహీనంగా వున్నాడని, అందుచేతనే అతన్ని మూర్ఛరోగం ఆవహించిందని, రక్తంలేక మనిషి క్షీణించిపోతున్నాడని చెప్పి ఏవేవోమందులు వ్రాసియిచ్చి అప్పటికి బలానికి ఒక ఇంజక్షను చేశాడు.

ధర్మారావు మధుచేతిమీదవున్న గాయాన్ని డాక్టర్‌కి చూపాడు. దాన్ని చూచి ఆయన నిశ్చేష్టుడైపోయాడు. కుమ్మరి పురుగు భూమినిదొలిచి రంధ్రంచేసినట్లు మధుచేతిపైనున్న ఆ గాయం లోతుగావుంది. ఆ గాయం ఏవిధంగా ఏర్పడిందో ఎంతఆలోచించినా ఆయనకి తట్టలేదు. చేతికి కట్టుకట్టి ధర్మా రావుతో "ఇతన్ని ఒకక్షణంకూడ వదలిపెట్టివుండకూడదు" అన్నాడు.

ఇంజక్షనుచేయగానే మధు అలసటచే నిదురపోయాడు. సారథి ధర్మారావుతో వెళ్లివస్తానని చెప్పి వెళ్ళిపోయాడు.

మధు ఇప్పుడు లేచి కూర్చునేస్థితికి వచ్చాడు. అతనికి ఇప్పటివరకూ ధర్మారావునుగూర్చిగాని, సారథినిగూర్చిగాని ఏమియూ తెలియదు. కావలసిన పరిచర్యలు తనకి తెలియకుండ

గనే జరిగిపోతున్నాయి. మీరు ఇంత ఆదరంతో చూస్తున్నా రంటే కారణం ఏమిా అంతుచిక్కటం లేదు. ఇప్పటివరకూ వీరితో అసలు పరిచయమే లేదు. ఇప్పుడూ పరిచయం తక్కువే. సారథికాని, ధర్మారావుకాని ప్రతిరోజు "నీ ఆరోగ్యం బాగుం దనుకుంటాను. అలసటచెందేపనులు ఏమిాచేయకండి. చాలా నీరసంగావున్నారు. మిాగుండె ఆరిపోయింది. అది మిారు గమ నించడంలేదు. మిాకు కావలసిన సౌకర్యాలన్నీ జరుగుతున్నా యనే అనుకుంటాం" అని అడుగుతూంటారు. ఏమిాతోచక చిత్రాలుగీద్దామన్నా గీయనివ్వరు. నేనంటే వారి కంత అభిమాన మెందుకో అర్థంకావటంలేదు. ఇదేమయినా పూర్వజన్మపరి చయమేమోనని ఆలోచిస్తే సందేహం కలుగుతోంది.

ఈ విధంగా ఆలోచించుకుంటూంటే డాక్టరుగారు వచ్చాడు. అది మధు గమనించలేదు. సారథి ప్రవేశిస్తూ డాక్టరుకు నమస్కారముచేసాడు. రెండుమూడునిమిషాలు ఎవరూ మాట్లాడకుండా కూర్చున్నారు. డాక్టరు మధుని పరిశీ లిస్తున్నాడు. అతడు ఆలోచనలోపడ్డాడు. నిగ్రహించి తేరు కుంటాడేమోనన్న వుద్దేశ్యంతో ఒకసారి చిన్నగా దగ్గాడు. కాని మధు ఊహల్లోతిరుగుతున్నాడు. ఇక లాభంలేదని "నిదుర పోతున్నారా? లేక, ఆలోచనల్లో మునిగిపోయారా?" అన్న డాక్టరుమాటకు మధు తెప్పరిల్లి "అబ్బెబ్బే! నిద్దరపోటంలేదు. ఏదో ఆలోచిస్తూ పడుకొన్నాను" అన్నాడు.

"అయితే బాహ్యప్రపంచాన్నే మర్చిపోయే ఆలోచనల్లో పడిపోయారన్నమాట" అన్నాడు డాక్టరు.

మధు నవ్వుతూ "అయితే మిారు వచ్చి చాలాసేపయిం

దన్నమాట. క్షమించాలి. ఏదో పరధ్యానంలో వుండిపోయి మిమ్మల్ని చూడలేదు'' అన్నాడు.

చేతిమీదవున్న గాయాన్ని కడుగుతూ "ఇప్పుడు మీ ఆరోగ్యం బాగుందనుకుంటాను" అన్న డాక్టరుమాటలకు "ఆ... ఆ...మీ అందరిదయవల్ల చాలబాగుంది. మంచి చలాకీగా వున్నాను కదండీ డాక్టరుగారూ!" అన్నాడు నవ్వుతూ మధు.

ధర్మారావు, సారథి లోపలినుండి వస్తూ "ఏమిటోయ్ మధూ! గొప్పగా పొగిడేస్తున్నావు. ఇందులో మా దయేముంది. అవును కాని డాక్టరుగారూ ! గాయం పూర్తిగా మాని పోయిందా'' అన్నాడు ధర్మారావు.

"ఆ...మానిపోయినట్లే'' అన్నాడు డాక్టరు.

'యింతకూ ఆ గాయం ఎల్లా తగిలిందో చెప్పటంలేదు మధు' అన్న సారథి మాటలకు మధు కళవెళపడ్డాడు. అది డాక్టరు, స్నేహితులిద్దరూ గమనించారు. ఆ భావన ముఖంలోకిరాకుండా చాల ప్రయత్నంచేశాడు మధు.

అది గమనిస్తూ 'చూడండి మధుగారూ! మీ ఆరోగ్యం యిప్పుడు నయమయిందనే చెప్పాలి. కాని ఇప్పుడున్న ఆరోగ్యాన్ని మీరు కాపాడుకోవటంలో చాల శ్రద్ధతీసుకోవాలి. మీరు ఉద్రేకపడడం, అలసటచెందేపనులు చేయడం ఏమంత మంచిదికాదు. ఒకవిషయం చెపుతున్నాను వినండి. ప్రొద్దుట ఒక గంట, సాయంత్రం ఒకగంట తప్పించి మీరు పడకమీంచి కదల కూడదు. టైముకి భోజనం, నిద్ర వుండాలి. ఇంతకంటే వేరుగా చెప్పాల్సిందేమీ లేదు.' అనిచెప్పి, ధర్మారావుకు నమస్కారం చేసి వెళ్ళిపోయాడు డాక్టరు.

'డాక్టరు చెప్పింది విన్నావుగా మధూ...!' అన్నాడు సారథి.

రెండుమూడు నిముషాలు ఏదో ఆలోచిస్తూ కూర్చు న్నాడు మధు, అతను మాట్లాడకపోయేసరికి 'ఏమి టాలోచిస్తు న్నావ్? మధూ...!' అన్నాడు ధర్మారావు.

'ఏమీలేదు. మిమ్మల్ని ఒకటి అడగాలనివుంది. దానికి మీరు బహుశా సమ్మతిస్తారనే అనుకొంటున్నాను. మీరు నాకు చేసిన సహాయానికి, సేవకు కృతజ్ఞుడ్ని. కాని ఆ కృతజ్ఞతను మీకు ఏవిధంగా తెలుపవలెనో నాకు అర్థంకావటంలేదు. ఎందు కంటే దారేపొయ్యే నన్ను మీరు ఇంత ఆదరంతో చూశారంటే అది నా అదృష్టమే. మీరొనర్చిన సహాయమునకు ప్రతిఫలంగా ఏమీ ఇవ్వలేకపోతున్నాననే విచారం నా హృదయంలో బ్రతి కున్నంతకాలం అనుక్షణం మెదులుతూనేవుంటుంది. మీ కనేక విధాలుగా శ్రమకలిగించాను. డాక్టరు నాకు ఆరోగ్యం చేకూరిం దని చెప్పనేచెప్పారు. కనుక నేను మీవద్దవుండి ఇంకా శ్రమకలి గించడం భావ్యంకాదు. దానికి నా మనస్సంగీకరించదు. కనుక ఈరోజు వెళ్ళిపోదామని అనుకుంటున్నాను. అందుకు మీరు తప్పక అనుమతిస్తారనే తలుస్తాను' అన్నాడు మధు.

మధు ఈవిధంగా అంటాడని ధర్మారావుకాని, సారథి కాని ఎప్పుడూ అనుకోలేదు. వారు ఆవిధంగా అనుకోవడంలో అసహజం ఏమీలేదు. ఎందువల్లనంటే మధుయెడల వారికుండే ఆప్యాయత అల్లాంటిది. మధుతో వేయిజన్మలకుకూడ విడతీయ లేనటువంటి అనుబంధం ఏర్పడిపోయింది. ఆ సన్నిహితత్వమే వారి నల్లాచేసింది. కనుకనే మధుమాటలకు వారు తెల్లపోయారు.

మధు అలా తలచడంలోకూడా ఏమీా శంకించవలసిన పనిలేదు. ఒక వివేకవంతుడు ఆత్మగౌరవం కలవాడు, సేవచేస్తు హాయిగా పెడుతున్నారుగదా అని పరులఇంట ఎంతకాలం వుండగలడు. అసలు వున్నంతకాలం వారు ఎంతఅవస్థలో బాధపడుతున్నప్పటికి మనస్సులో కించపడుతూనేవుంటాడు. ఆవిధంగానే మధు ఒకక్షణంకూడ అక్కడ వుండుటకు మనస్కరించక వారికి కృతజ్ఞతాపూర్వకంగా తెలుపుకొన్నాడు.

ధర్మారావుకి అతనిమాటల్లోని సత్యం గోచరించకపోలేదు. అతను చెప్పిందికూడ నిజమే. కాని అతనావిధంగా కించపర్చుకోవడం ఏమంత నచ్చలేదు. ఆత్మాభిమానంగల ప్రతిమనిషి సహజంగా అల్లాగే నడుస్తాడు. ఎదుటివారికి తక్కువరకంగ కనిపిస్తున్నామే అని తలుస్తాడు. ఒకరిమీాద ఆధారపడుతున్నామనే బాధపడుతాడు అది గ్రహించిన ధర్మారావు 'మధూ! నువ్వు మమ్మల్ని పరాయివారిగ భావించి నీ మాటలతో కష్టపెడుతున్నావు. నీవు మనస్సులో ఆవిధంగానే భావించుకొన్నావు. పరిచయమైన క్రొత్తలో ఏ వ్యక్తిఅయినా నీలాగే ప్రవర్తిస్తాడు. నాదొక చిన్న మనవి. దానికి నువ్వు అడ్డుచెప్తావని నేనుఅనుకోను' అని కొంతకాలం మాట్లాడకుండా కూర్చుండిపోయాడు.

నిశ్శబ్దం ఆవరించింది.

ముగ్గురిమనస్సులు మూడువిధాలుగా పరుగెడుతున్నాయి. కాని ముగ్గురూ ఒకేగమ్యానికి చేరుకోటానికి ప్రయత్నిస్తున్నారు. అందులో ఏం తప్పులేదు. మధు క్రొత్తవాడయినప్పటికీ ధర్మారావు, సారథీల మనస్తత్వాలను గ్రహించినవాడే. తన ఆశయాలు నెరవేరాలంటే తనకు ఇటువంటివారి ఆదరాభి

మానాలే కావాలని అతడికి తెలుసు. అయితేనేం తనవలన వారికి ఏవిధమయిన ఉపకారం లేనప్పుడు తన భారాన్ని వారికి కలిగించటం ఇష్టంలేక బాధపడుతున్నాడు.

కళారాధకుడయిన ధర్మారావు అభిప్రాయం ఒకదరికి చేరింది. దేశంలో కళను జీవింపచేయవలయునని, తనదేశం ఇంత గొప్పది, తన జాతివారు ఇంత గొప్పవారని ప్రపంచం నలు మూలలా చాటవలెనని అతడి తృష్ణ. అందుకు మధు అంగీక రిస్తాడా అనే అనుమానం అతడిలో తలఎత్తగ — అర్థిస్తే ఒప్పుకోకమానడనే తలంపు ధర్మారావుకి కలిగింది.

ధర్మారావుకాని, మధుకాని ఒకరినొకరు అర్థంచేసుకొనక పోతే కళ దెబ్బతింటుందేమోనని సారథి శంకించాడు. అప్పుడు కళాభిమానిఅయిన ధర్మారావుని, కళాతపస్విఅయిన మధును పూజించేభాగ్యం తనకు దక్కదేలని బాధపడ్డా, వారి ఊహలు తెలిసిఉండడంచేత భగవంతునిమీద నమ్మకం కలవాడగుటచేత సారథిఊహకూడ ఒక అంచుకు చేరింది.

ఆవరించిన నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ "నీకు నావుద్దేశ్యాలు ఆశయాలు తెలియవు. అయితే నీ ఆశయాలు నేను గ్రహిం చాను. నీవు కళాతపస్వివి నీ చిత్రలేఖనం అపూర్వం. ఈ విషయం నీకు చెప్పడం ముఖస్తుతిగానే కనిపిస్తుంది. అయితే నీ అపూర్వ చిత్రలేఖనం భూగర్భంలో నిలచిపోయిన అపూర్వ వజ్రం. దానిని బయటకుతీసి సానపట్టి దానికాంతులను ప్రపంచం నలుమూలలా వెదజల్లాలని నా ప్రయత్నం. అది నా ఒక్కడి పనీకాదు. నాకంత ఓర్పూలేదు. పుట్టకతోనే పువ్వుల్లోపడ్డాను. ఇప్పటివరకూ ఆ పువ్వుల్లోనే వున్నాను. అందుకు మనోధైర్యం

కూడ తగినంత లేదు. అయితే ఆ భారాన్నంతా సారథి వహిస్తాడు అందుకుతగిన ధనాన్ని నే వినియోగిస్తా. అటుపయిన నీ శక్తిసామర్థ్యాలు ప్రదర్శించు. ఇందులో స్వార్థానికి తావు లేదు. కళ కళకొరకేనని చాటిచెప్పాలి. అందుకు నువ్వు ప్రాణం పొయ్యాలి. మనుష్యుల పిపాసమధ్య నలిగిపోతున్న మానవత్వాన్ని, నీతిని వెలుపలకు తియ్యాలి. ఇదే నా చిరకాల వాంఛితం. అందుకు తగినవాడవు నీవేనని నామనస్సు మరీమరీ నిన్ను చూపెడుతోంది. అందువలననే నిన్ను తప్పక అంగీకరించమని అర్థిస్తున్నాను. నీవు వివేకవంతుడవు. ఇంతకంటె నాకు ఎక్కువగా చెప్పనక్కరలేదు' అని ధర్మారావు తన ఉద్దేశ్యాలను ఆశయాలను మధుకి తెలియజేసి కుర్చీలోనుంచి లేస్తూంటే ఏదో తెలియనిబాధ ముఖంలో వ్యక్తమయింది. అతనికి బాధ కలిగించానేఅన్న విచారంతో, తనకిప్పటికి ఒక ఆధారమంటూ కలిగి తన అభ్యున్నతిని మనస్సులో చిత్రించుకుంటూ ఉత్సాహాన్ని, విచారాన్ని మిళితంచేస్తూ 'నన్ను క్షమించాలి. మీకు చాలకష్టం కలిగించాను' అంటూ మధు ధర్మారావుని కౌగలించుకున్నాడు.

ధర్మారావు హృదయం ఉప్పొంగిపోయింది. సంతోషం కట్టలుత్రెంచుకొంది. అతడికి మాటలు పెగలటంలేదు. సారథి వారి కలయికను చూచి ఆనందంతో "మీరు కలకాలం ఈ విధంగానే వుండి కళామతల్లికి అనుంగుబిడ్డలమని ఆమెకు సేవ చేయండి" అని మనస్సులో ఆశీర్వదించాడు.

# 6

చదువుల సరస్వతి, నాట్యవిశారద మంజుల. మంజుల మనోజ్ఞరూపం యువకుల హృదయాలను కదల్చివేస్తోంది. మనస్సునిలకడ తగ్గిపోతోంది. ఆమె ఇంటిచుట్టూ ఈగలవలె ముసురుకుపోతున్నారు. ఆమె దర్శనమే ధన్యత. పట్లుతప్పిపోయే వాంఛలకు ఉపశమనం. ఆమెపలుకే భగవంతునివరం. ఆమె కదలికే కోటికాంతులు వెదజల్లే మెరుపుతీగె. ప్రతీయువకుడు, యువకుడేకాడు అరవయ్యోపడిలోపడ్డ వృద్ధులుకూడ జవసత్వాలుగల యువకులవలె ఆమెకై తపించిపోతున్నారు. కఠోర వాంఛలతో వంశగౌరవాల్ని, శరీరాన్నికూడ మరచిపోతున్నారు. అయితే వీటిభయంగల కొద్దిపెద్దలు ప్రక్కదారులను త్రొక్కుతారు. కాని వారికి ముళ్ళకంచె ఎదురయ్యింది.

ఈమధ్య మంజుల ఉత్సవాలలోను, సభల్లోనూ నాట్య ప్రదర్శనలిచ్చి అనేకమందిచే గౌరవమును పొందింది. కళ ఆమె పరమయిపోయింది. ఆమె కళను ఏవిధంగా శాసిస్తే ఆ విధంగా నడుస్తాయాన్నంతగా ఇప్పుడు ఆమె చూపరులకు గోచరిస్తోంది. అదిపూర్వజన్మ సుకృతమే! అయ్యుండవచ్చు. అది ఆమె అదృష్టం కాని, ఆ విధంగా అనుకోని ప్రతివ్యక్తే సంతృప్తిపొందలేదు. అసూయన్నది ఎదలో ప్రవేశించకపోదు మానవుడయిన తరువాత, వెలుగును వెన్నంటివచ్చు చీకటివలె.

ఒక వ్యభిచారిణి, ఒక చరిత్రహీనురాలయిన స్త్రీని గౌరవించటం ప్రతిఒక్కరికీ తప్పుగనే గోచరిస్తోంది. అయితే ఆమె ఎంతవరకు పతితో, హీనురాలో, లోకానికి అవసరంలేదు. ఆమె అక్క కమలం పతిత, హీనురాలు. ధర్మాధర్మ విచక్షణాజ్ఞానంలేని మూర్ఖురాలు అయినప్పుడు మంజుల మాత్రం అంతేకాదా ? ఆమె రక్తంకాదా ఈమెది. ఒక తల్లికడుపున పుట్టిన కూతుళ్లు కారావీళ్ళు. కనుక మంజులకూడ వ్యభిచారిణే. అవును ముమ్మాటికి వ్యభిచారిణే. ఒక ఘోష. దిశలు పిక్కటిల్లిపోతున్నాయి. అయితేనేమి? ఆమెనుచూస్తే వారికి దాహం. కుక్కలవలె పాదాలను నాకటానికయినా సంసిద్ధం. అదివారికి ఒక గొప్పగౌరవం. దానికొఱకై ఆమెకు సన్మానాలు, గౌరవబిరుదులు లభిస్తున్నాయి.

మంజులలో తృణీకారభావం తలఎత్తింది. అందకత్తెయని ఆమెను అందలం ఎక్కించారు. కాని ఆమెలోనున్న ప్రావీణ్యత ఆమెకు మెరుగుపెట్టింది. కళాకోవిదురాలననే గర్వం ఆమెలో కించెత్తుమాత్రంగానయినా కనిపించదు. ఆమె అప్పుడు సాత్వికురాలు. నమ్రతతో నిర్మలంగా వుంటుంది. అయితే ప్రజలే ఆమె నమ్రతకు అడ్డుతగిలి హృదయంలో అలజడి రేపుతారు. రసజ్ఞత అనుకొని వివేకహీనులవుతారు. పొగుడుతారు. కాళ్ళావేళ్ళాపడి ప్రాకులాడుతారు. అందుకనే ఆమెలో తృణీకారభావం వారిని చూడగనే తలఎత్తుతుంది. అప్పుడే రూపసిననే అహంభావంకూడ కనిపిస్తుంది.

కమలం ఈమధ్య చాల నీరసించిపోయింది. జవసత్వాలను మానవులు పశువుల మాదిరిగ పీల్చేస్తున్నారు. ఆమెలో ఆకర్షణ అంతరించిపోలేదు. చింత హృదయాన్ని రంపపుకోతలా

కోసివేస్తోంది. తనుచేయవలసింది చాలావుంది. ప్రతీకారవాంఛతో తను నాశనమయిపోయింది. ఇక మిగిలిందల్లా ఆశాజ్యోతి మంజుల. ఇప్పుడామె సర్వజ్ఞురాలు. అయితే ఆమె సర్వజ్ఞత లోకంఎదుట, వారి వాంఛలఎదుట చెల్లదు. ఆడది అతిఅందంగా వుండడం ఆమె మనువుకేచేటని లోకం తనపట్ల ఋజువుచేసింది. కనుక ఇపుడు మంజులశీలాన్ని కాపాడవలెనంటె ఒకయింటి దానిని చేయాలి. అది సాధ్యమయిన పనికాదు. కాకపోతే ఆమె శీలాన్ని కాపాడటం గాలిలో దీపం వెలిగించటమే. కర్తవ్యం బోధపడటంలేదు.

ఇదే ఆమెచింత. తల్లిదండ్రుల ఆత్మలో తనే పతితయి పోయిందని శోకిస్తుంటే, ఇక చెల్లెలను సంరక్షించకపోతే మరింత బాధపడతారు. మనకు జన్మయిచ్చినందుకు వారిఋణం తీర్చు కోవాలి. అయితే తనకులభించిన జన్మయిదేనా? ఒక పురుగయి పోయింది. శరీరమంతా కుళ్ళిపోయింది. ఇదీ ఒకజన్మేనా ? ఇటు వంటిజన్మ లభించడంవల్ల నేనా వీరికి కృతజ్ఞత చూపవలసింది ? అవును. వారేంచేస్తారు. తల్లిదండ్రులుగా వారు చేయవలసింది చేశారు. అయితే యీ పాడులోకం స్త్రీగా బ్రతకనివ్వలేదు. ఏమైనప్పటికి మంజుల పతితకాకూడదు. "అమ్మా! అల్లా ఎన్నటికీ జరగదు...అమ్మా జరుగదే...మంజుల..." అంటూ నిద్రలో గట్టిగా అరుస్తోంది కమలం. అదివిని మంజుల "అక్కా- అక్కా..." అని తట్టిలేపి "ఏమే...ఏంజరిగింది ?"

కమలం ఉలిక్కిపడి లేచికూర్చుంది. ఆమె హృదయాన్ని భయం ఆవరించింది. శరీరం ఒణికిపోతోంది. చూపుల్లో బెదురు కన్పిస్తోంది. శరీరమంతా ముచ్చెమటలు పోశాయి. మెలుకువ

వచ్చినా యీ ప్రపంచం ఆమెకు వర్ణనాతీతమయిన దుష్టశక్తి వలె కనిపిస్తోంది. అందుకే ఆమె పరిస్థితి అల్లా దిగజారిపోయింది. అంత జ్ఞానురాలు అజ్ఞానివలె, మూఢురాలువలె హడలిపోయి తన్ను తాను నిల్రదొక్కు-కోలేకపోయింది. ఈ పరిస్థితినుండి తేరుకునేసరికి చాలా వ్యవధిపట్టింది.

"ఏమిటి అక్కా! అల్లా ఒణికిపోతున్నావు. నిద్రలో ఏమో భయంకరంగా కేకలు వేస్తున్నావు. అసలు ఏంజరిగింది?" ఆతృతతో అడిగింది మంజుల.

"ఏంలేదమ్మా! నన్నేదో ఆవహించింది. పూర్వంవున్న గుండెనిబ్బరం ఇప్పుడు సన్నగిలిపోతోంది. ఏది తలపెడదామన్నా నాకే ఎదురవుతోంది. అసలు తలచిన తలపులే పెనుతుఫానులా అల్లకల్లోలం చేస్తున్నాయి హృదయాన్ని. ఈ బాధకు నా జీవితం అంటే చాలవిరక్తిగావుంది. లోకమంటే నాకు భయంగానూ, అసహ్యంగానూవుంది. ఇటువంటి లోకంలో మానవులచేతుల్లో రోజుకోమారు చచ్చిపోవడంకంటే, ప్రాణాలు తీసుకుంటేనే హాయి అనిపిస్తోంది. ఆత్మహత్య మహాపాతకమైనా వారి చిత్రహింసలకు నిలువలేకున్నాను. మంజులా...మంజులా!'' అని ఇంకా ఏదో చెప్పబోతూంటే మంజుల పశిపాపలాగ ఏడుస్తూ "అక్కా! నన్ను ఈ విధంగా అనాధగా చేయటానికేనా పెంచింది? ఏంఅక్కా మాట్లాడవేం" అంటుంటే ఆమెనోటికి తనచేతిని అడ్డుపెడుతూ "తప్పమ్మా మంజూ! నువ్వెప్పుడూ అనాధవుకావు, నాబ్రతుకంతా నీకోసంకేనమ్మా! నిన్ను చూచి నప్పుడల్లా నా కొకవిధమైన భయంకలుగుతోంది. నేను నిన్ను రక్షించగలనా అని అనుమానపడుతున్నాను. అందువలననే

నేనోక్షే యింటిదానిని చేయాలని ఆతృతపడుతున్నాను. అప్పుడు నాబాధ్యత తీరిపోతుంది. నీ భర్త ఆశ్రయంలో నీవున్నప్పుడు నేనేవిధంగాపోయినా చింతించనక్కరలేదు. చూడు మంజూ! లోకం ఎటువంటిదో - రెండుమెతుకులు కనిపిస్తే వందలాది కాకులు గుమిగూడినట్లు, ఒక యవ్వనంలోవున్న అందమైన యువతి కనిపిస్తే ఆ విధంగానే మూగిపోతున్నారు. కాకులకూ వారికి తేడాఏముంది మంజూ. వాంఛలతో, నీతి నిజాయితీలను వదలి పశువులమాదిరిగ సంచరించే ఈ కామాంధకారులముందు మనం నిలువలేవమ్మా. మనం అబలలం. వారు ఎటుతిప్పితే అల్లా తిరగాలి. ఇదే యీ లోకంతీరు. ఈ బారినుండి తప్పుకోవా లనంటే వివాహమే శరణ్యాం. ఇదే వుత్తమం. హిందూస్త్రీకి శీల మెంతముఖ్యమో, ఆ ముఖ్యమైన శీలాన్ని కాపాడుకొనుటకు భర్త అంతముఖ్యం. అప్పుడు స్త్రీకి నాధుడు భర్తేనమ్మా. అప్పుడే విషపునాలుకలు తెగిపోతున్నాయి. నా వాంఛితం అదే మంజూ అదే-" అని ఆవేదనతో కమలం చెప్పుంటే మంజుల నిర్ఘాంతపోయింది.

నిండుకుండవలె తొణకని అక్కయ్య ఈ విధంగా చలించి పోయిందంటే ఆమె హృదయంలో ఈ భారాన్ని ఎంతకాలం నుండో దాచుకొని వుంటుంది. అణగద్రొక్కినంతకాలం వాటిని బయటకు తలఎత్తనివ్వలేదు. హృదయభారం ఇప్పుడధికమయి పోయి భాండం పగిలిపోయింది. అందువల్లనే తనకి తెలియ కుండానే ఆమాటల్ని వెళ్ళగ్రక్కింది. జీవితగమనం ఎంత పతనమై పోయింది అని ఆలోచిస్తూ "అక్కా! నువ్వు నాగురించి ఇంత బేలవయిపోతావని నేనెప్పుడూ అనుకోలేదు. నావివాహ

విషయమై నాలోనేను ఎప్పుడూ తలంచలేదు. అయితే నువ్వు చెప్పినట్టు నేనెప్పుడూ నడుచుకొంటూనే వుంటాను. అటువంటప్పుడు నువ్వింత బాధపట్టం దేనికి. నాకుతోచిన నాకు తగినవరుణ్ణి నీవు నాకు ఎప్పుడు చేసినప్పటికీ అంగీకారమే. ఈ విషయం నేను చెప్పతగినంతటిదికాదు. నీకన్నీ తెలుసు. నీ యిష్టమొచ్చినట్లు చెయ్యి.

"అదీకాకుండా వివాహవిషయంలో ఇప్పుడింతతొందరేమొచ్చింది. వివాహం విద్యానాశనంకదా! అయినప్పుడు నా కళను ఏవిధంగా ప్రదర్శించను? నలుగురికీ ఉపయోగించినప్పుడేకదా నాలోనున్నకళ రాణించేది. వివాహం చేసుకుంటే బూడిదలోపోసిన పన్నీరేకదా!" అంటూంటే, "అదినిజమే మంజూ! నువ్వు చెప్పింది నేను కాదనను. కాని వివాహం చేసుకోకపోతే మనఃశీలాన్ని మసిచేసిపారేస్తారు ఈ పశువాంఛాపరులు. నన్నడిగితే శీలంకంటే మరేదీ స్త్రీకి ముఖ్యమయిందిలేదు. నీ వివాహం చాల క్లిష్టపరిస్థితులతో కూడుకొనివుంది. నీకోసం ఎవరికివారెగబడుతున్నారు. అది నీకూ తెలుసు. అయితే నీవిద్యానాశనంకాకూడదనే ఉద్దేశ్యంతో నేను వెనక్కు తగ్గవలసి వస్తోంది. నా హృదయం నీవొక కళావేత్తవయినపుడు చూచి ఆనందించవలెనని తహతహలాడుతోంది. అటువంటిఆశ నెరవేరవలయునంటే నిన్ను ఒకగొప్ప కళాపోషకునికిగాని, కళారాధకునికిగాని ఇచ్చి వివాహంచేయాలి. అప్పుడు నీకళకు రాణింపు కలుగుతుంది. అయితే అటువంటివారిని వెతకడం చాలకష్టం. కాని ఇదితప్పక జరుగుతుందని నామనస్సు మరీమరీ నొక్కి చెపుతోంది. అప్పటివరకూ నీ వివాహం జరగదు. స్త్రీశీలాన్ని

జాగ్రత్తగా కాపాడుకోవాలి. ఫణిబాబుని ఒకకంట కనిపెడుతూ వుండు. అల్లాగే సింహాలనుకూడ" అనిచెప్పి "చాలారాత్రి గడచింది పోయిపడుకో. మనస్సులో అనేకరకములైన పాడు ఆలోచనలు గిరున తిరుగుతుంటే, నిద్రలోకూడ అవ్వేబయటకు వస్తున్నాయి నాకు తెలియకుండా. పోయిపడుకో" అని మంజులను తొందరచేసింది.

మంజుల తనగదిలోనికి వెళ్ళిపోయింది.

ఆలోచనలు ఎంత అదుపులో పెట్టుకుందామన్నా గూడుకట్టుకుపోయి మనస్సును వికలంచేస్తున్నాయి. నిద్రను కూడా పారద్రోలాయి. ఎంత ప్రయత్నించినా నిద్ర దరి జేరటంలేదు. కళ్ళు మండిపోతున్నాయి. మంజులకు వివాహం చేసేవరకూ ఆమెను తనకు దక్కనిస్తారా? వివాహం చేయాలంటే తనకు తెలిసున్నంతవరకూ ఈ ప్రాంతంలో మంజులతో సమానమయిన కళావేత్త లేడు. ఆమె మనస్సులో ధర్మారావు ఒక మెరుపులా మెరిసాడు. కాని, యింతలోనే అంధకారం ఆవరించింది. ధర్మారావు జమీందారు, కీర్తిమంతుడు. కళాభిమాని. ప్రజలకు బహిప్రాణి. కాని తనో నీచురాలు. వ్యభిచారిణి. కులం గోత్రంలేని స్త్రీ. ఈ ప్రజలపాలిట రాక్షసి. అటువంటి ధర్మరాజుకా, ఈ నీచురాలి చెల్లెలను యివ్వడం అంటూ ప్రజముక్తకంఠంతో ఘోషిస్తుంది. అవును. ప్రజలకు అంతే తెలుసు. ప్రజావాక్యంకంటే వేరే సత్యం ఈ లోకంలో గోచరించదు. చెప్పినా వినిపించుకోదు. "నువ్వా !" అని హేళనచేస్తుంది. అందుకనే ఆమె హృదయం అంధకారంలోపడింది. ఈ ప్రాంతంవదిలి వెళ్ళిపోతే? వెళ్ళిపోతే మంచిదే! ఏ అర్థరాత్రో ఎవ్వరికీ తెలియ

కుండా. అయితే ఎక్కడికి వెళ్ళిపోవాలి? పోతే జీవనోపాధి?—మామూలువృత్తే! అయితే ఇక్కడవున్న పలుకుబడి మరోచోట వుంటుందా? వుండదు. అయినప్పుడు ఈ వృత్తినికట్టిపెట్టి మంజులను వెలుపలికి రప్పించాలి. ఆమెకళను ప్రేక్షకలోకానికి పరిచయం చేయాలి. అక్కడమాత్రం మంజులను తను కాపాడగలదా? ఇక్కడి ప్రపంచమే అక్కడా. ఇక్కడి మనుష్యులే అక్కడా. కాకపోతే రూపాలు మారుతాయి. గుణాలు ఎక్కడికి పోతాయి? అదీకాకుండా పెద్దది తనుండి మంజుని కష్టపెట్టడమా? అది ధర్మానికి విరుద్ధం. తన తల్లితండ్రులు చే అల్లా చేయనిస్తారా. అసలిప్పుడు ఆ పరిస్థితులే రాకూడదు. తను ఇంత నీచస్థితిలోనికి దిగజారవలసిన ఖర్మేవుండదు. విధి ఈ నుదుటన ఇల్లా రాసిందని సంతృప్తిపడా లంతే. ఈ ప్రపంచంలో ఏ మూలకుపోయినా విధి వెన్నంటుతూనేవుంటుంది. దాన్ని తప్పించుకోటం "దుఃఖాలన్నిటినీ ఒక సీసాలో బంధించి ప్రపంచమంతా ఆనందమయం చేయటం"వంటిది. అందువల్ల జరిగేది జరుగక మానదు. అయినా భయమనేది మనిషిని లొంగదీయటానికి ప్రయత్నిస్తుంది. భయమంటే ఆమె హృదయ బలహీనతే కావచ్చు. అందుకే ఆమె మానసికంగా చాల అలసిపోయి ఓ చిన్న కునుకుతీసింది.

* * * *

వెళ్ళిపోయిన ఫణిబాబు సింహాలుకూడ కమలందగ్గరకు వస్తున్నారు. అయితే ఇప్పుడు ఫణిబాబు చాల గౌరవంగా మసలుతున్నాడు. రాత్రిళ్ళురావడం మానివేశాడు. పగలేవచ్చి కమలం క్షేమసచామారాలు తెలుసుకొని "ఏదయినా సహాయం కావాలా" అని అడుగుతూవుంటాడు. తరచుగా మంజులను గూర్చి ప్రసంగించుటలేదు. ఆమె వేదికపై నాట్యంచేసినప్పుడు మాత్రం ఇంటికివచ్చి కమలంద్వారా అభినందనలు తెలియు జేస్తుంటాడు.

మంజులకు ప్రతిరోజూ సాయంత్రం దేవాలయానికివెళ్ళే అలవాటుంది. కమలానికి అలవాటున్నా ఆమె ఈరోజు బడలిక చేత వెళ్ళలేదు. ఆమె శారీరకంగా పతితఅయినప్పటికి మానసికంగా పవిత్రమూర్తి. అందువలననే ఆమె సంస్కారం అంతరంగికమయినప్పటికీ బాహ్యప్రపంచం లొంగదీసి హీనురాలుగా చూస్తోంది. హృదయంలో ఉద్రేకం చెలరేగినపుడు "ఇదేనా సమాజవికాసం ?" అని ఆమె తనలోతాను తర్కించుకొంటుంది. ఎంత తర్కించుకొన్నప్పటికీ ఫలితం శూన్యం. జీవితమే ఒక శూన్యంగా గోచరిస్తోంది. ఎందుకు పుట్టిందో, ఎందుకు బ్రతుకు తోందో, ఇకపయి ఎందుకుబ్రతకాలో అర్థంకావటంలేదు. ఈ విధమయిన ఆలోచనలతో మధనపడుతుంటే ఫణిబాబు ఎదురుగావచ్చి కూర్చున్నాడు.

"కమలం! ఈమధ్యనువ్వు పూర్తిగా మారిపోయావు. ఎప్పుడూ ఏదో తెగూతెంపూలేని ఆలోచనలతో నిండా మునిగిపోయి, కొన్నాళ్ళయ్యేసరికి మమ్మల్నే మరచిపోయే ట్లున్నావు. సంగతేమిటో చెపితే నీకూ హృదయం తేలికవుతుంది

నాకు తోచినసహాయం చేయగలిగినంతవరకూ నేనూచేస్తాను" అన్నాడు సౌమ్యం వుట్టిపడుతూ ఫణిభాబు.

కమలం కొద్దికాలం మాట్లాడకుండా నే వుండిపోయింది.

ఫణిబాబు కొద్దిసేపు ఏదో ఆలోచించి, చివరికి ఒక నిర్ణయాని కొచ్చినట్లు తలవూపుతూ "కమలం, నేను నీఎడల చాల అమానుషంగా ప్రవర్తించాను. కామంతో కన్నూమిన్నూ కానకుండా ధనమధాంధతతో నీపట్ల చాల నీచంగా ప్రవర్తించాను. అన్యంపున్యం ఎరుగని మంజూపై కక్షుగట్టి వెట్టివెట్టి పోకడలకు పోయి మీకు తీరని అపచారంచేశాను. అయితే ఆనాటి నుండే నాకు ఒక్కింత మనశ్శాంతికూడ లేదు. ఈ పాపాలతో తలభారం పెరిగిపోయి పగిలిపోతుందేమో అనిపిస్తోంది. వీటినుండి విముక్తిపొందాలంటే ఏమిచెయ్యాలో అర్థంకావటంలేదు. ఆత్మహత్య చేసుకొన్నా అంతంకాని పాపాలని మూటకట్టుకొన్నాను. పశువునయి సంచరించి 'మనిషి' అన్న మాటకే అగౌరవం తీసుకొచ్చాను. నాలోనేను దహించుకుపోతున్నాను. అందులో మీ ఎడల చాల అన్యాయంగాను, అధర్మంగాను, అమానుషంగాను ప్రవర్తించాను. తీరని కష్టాలకు మిమ్మల్ని గురిచేసి బాధపెట్టాను. క్షమించరాని పశువునయిపోయాను, అయినా మీరు నన్ను క్షమిస్తారనే అనుకుంటున్నాను. చెడుమార్గాలలోనడిచే నన్ను ఒక మంచిమార్గంలోకి తిప్పావు. ఏం కమలం! ఈ పాపిని క్షమిస్తావుకదూ?... ఏం ... మాట్లాడవేం" ... ఆవేశంతో "అవునులే! నన్ను క్షమించడమంటే పాముకి పాలుపోసిపెంచడం. కమలం నేను కృతఘ్నుడను."—మధుఅంటుంటే కమలం అతని దగ్గరగావచ్చి అనునయంతో "ఎందుకు బాధపడతావు ఫణిబాబు!

గతాన్ని మర్చిపో, విధి మనల్ని అలా ఆడిస్తోంది. ఇందులో నువ్వు చేసినదేముంది. అయినా నువ్వు చాల బాధపడుతున్నావు. చేసిన తప్పులను గ్రహించి పశ్చాత్తాపంతో క్రుంగిపోతున్న నీ మనస్సు కుదుటపడి పాపాలన్ని తుడిచిపెట్టుకుపోతాయి. ఇంతకన్న వేరొకరు క్షమించేందుకు ఏముంది. నీ పశ్చాత్తాపమే నిన్ను క్షమిస్తుంది. ఫణిబాబు నేనొకటి చెపుతున్నాను విను. మనిషి ఎప్పుడయితే 'నాలో మానవత్వంపుంది ప్రాణికోటికి నేను అధికుృడను' అని వివేకంతో గర్వించకలిగినన్నాళ్ళు ఆ మనిషి తప్పుడుత్రోవ త్రొక్కడు. నీవు ఇప్పుడు ఆ స్థానములోకే వచ్చావు. అటువంటప్పుడు నిన్ను ఒకరు క్షమించవలసిన అవసరమేముంది. నీవు నిన్ను క్షమించుకోగలిగిననాడు మరొకరి అవసరందేనికి ఫణిబాబూ! నీవనుకున్నట్లే నేను నిన్నుగూర్చి ఆలోచించటంలేదు. ఈమధ్య నామనసు పూర్తిగా చెడిపోయింది. నన్ను ఆదుకొనేఆసరాకూడలేదు. బ్రతికి చెడినదాన్నయిపోయాను. మాట సాయంచేసేవారుకూడ లేకుండ నా అనేవారెవరొకూడ తెలియకుండా బ్రతుకుతున్నాను. నడి ఏటిలోపడ్డ గడ్డిపోచమాదిరిగ ఈ ప్రపంచంలో కొట్టుకుపోతున్నాను. ఇవన్నీ తల్చుకుంటే ఈ లోకంలో నేను ఎందుకు వుండాలనిపిస్తుంది. ఇదే ఆలోచిస్తున్నాను ఫణిబాబు! నాకు ఏ ఇబ్బందీలేదు. ఎటుపోయినా పోవచ్చు. అయితే మంజు నాదారికి అడ్డునిలచింది. దానిని నే కష్టపెట్టలేను. నేను ఇన్నాళ్ళు జీవించానంటే దానికోసమే. మంజు ఒక ఇంటిదయిందంటే నా బాధ్యత తీరిపోతుంది. ఏవిధంగానూ దాని కళారాధనకు అడ్డంకి వుండకూడదు. దాని సంసారజీవితం సుఖంగా సాగిపోవాలి. అదే నా

ధ్యేయం. మంజుల ఆశయం. అందుకు తగినమార్గం ఒక్కటే! మంజును ఒక కళావేత్తకుగాని, కళాభిమానికిగాని ఇచ్చి వివాహం చేయాలి. కాని, నేను అబలను. కాకపోయినప్పటికి ఆపని నావల్ల కాదు. నా పరిస్థితి నీకు తెలుసుకదా! నేనొక వ్యభిచారిణిని, కులటను, నీచురాలను అయినప్పుడు నా చెల్లెలను వివాహంచేసు కొండుకు ఏ కళాభిమాని, ఏ కళావేత్త అంగీకరిస్తాడు? కాని, నాకు పూర్తినమ్మకముంది. మంజు ఒక కళాకారునే వివాహ మాడుతుందని. అయితే నువ్వు నాకు సహాయం చేయాలి. నాకు నీకంటె వేరే ఆప్తులులేరు ఫణిబాబూ. సింహాలుతో ఈ వూరు చేరిన నాకు ఆశ్రయంఇచ్చింది నువ్వు. ఏదో కలతలతో మనలో ఏవయినా గతంలో అరమరికలు ఏర్పడితే వాటిని మర్చిపో. ఇటుపయిన మనలో ఏవిధమయిన బేధభావాలూ రాకూడదని ఆ భగవంతుని ప్రార్థిస్తాను. నువ్వు గతంలోచేసిన సహాయానికి కృతజ్ఞురాలను. ఫణిబాబూ, కృతజ్ఞురాలను" అని కమలం చెప్పింది.

అంధకారం అలుముకొని నల్లని మేఘాలు ఉరుముల తోను, మెరుపులతోను భయంకరంగా భీకరనినాదాలుచేస్తూ, జగత్తును గడగడలాడించి, ఆర్తుల ఆర్తనాదాలను ఆలకించి నట్లు, ఒక్కసారి తన రౌద్రాన్నివిడచి ప్రకృతిని ప్రశాంతపరచి నట్లు వారిమధ్యవున్న అంధకారం తొలగిపోయి వాతావరణం ప్రశాంతమయింది.

"కమలం! బాధపడవద్దని నాకు హితబోధచేసి, అనుభ వజ్ఞురాలవయిన నువ్వే ఆవిధంగా బాధపడుతూంటే మేమేం చేయగలం? మేము అల్పులం, మాచేత నువ్వు చెప్పించుకోవల

సినదానవు కావు. నీకు ఎటువంటి సహకారం కావాలన్నా నానుండి లభ్యమాతుంది. గతాన్ని మర్చిపో. ఈ రోజునుండి మనం పాతవాళ్ళంకాము. ఈ లోకానికి క్రొత్తవాళ్ళం. నీ ఆశ యమే నా ఆశయం. మంజుల వివాహవిషయమేగదా నిన్నం తలా కృంగదీసినది. ఆ విషయం నాకు వదిలెయ్యి. ఆ బాధ్య తంతా నాది. ఆమెకు తగినవరుణ్ణి, నువ్వుకోరినటువంటి కళా కారుని ఆమెకిచ్చి వివాహంచేసే పూచీ నాది. నువ్వేం బాధ పడకు కమలం. మంజు వృద్ధిలోకివచ్చి, దేశం నలుమూలలా అమెనుగూర్చి వింతవింతలుగ కీర్తిస్తూంటే చూచి ఆనందించా లని నాకూవుంది. ఆ ఆనందం పంచుకోవాలంటే నేను ఆమెకు సహాయం చేస్తేకాని లభ్యంకాదు. అప్పటిదాక నా మనస్సుకు స్థిమితంవుండదు" అని కమలంవైపు చూశాడు.

కమలం ఏదో ఆలోచిస్తూ కూర్చుంది. ఆమె పరధ్యా నాన్నిచూచి ఫణిబాబు చకితుడయిపోతాడు. తన మాటలు ఆమెకు ఇంపుగా లేవేమోయని బాధపడతాడు. తను అక్కడకు రావటం కమలానికి ఇష్టంలేదేమోయని శంకిస్తాడు.

"కమలం...! నేనంటే నీకు ఇష్టంలేనట్లుగావుంది. అటు వంటప్పుడు నీకు నే నీవిధంగా కష్టంకలిగించటం మరేమంత బాగాలేదు. కనుక వెళ్ళొస్తాను" అంటూ లేచాడు.

"అదేమిటి ఫణిబాబూ! ఉన్నట్టుండి హఠాత్తుగా వెళ్ళి పోతున్నావు కూర్చో వెడుదువుగాని" అంది కమలం తన ఆలోచ నలోనుండి తేరుకుంటూ లేచి వెళ్ళిపోతూన్న ఫణిబాబును చూస్తూ.

"మరేంచెయ్యమంటావ్! నారాక నీకు కష్టంకలిగిస్తే

క్షమించు. నా మాటలన్నీ నీకు ముఖస్తుతిగా, గాలిలో ఎగిరిపోయే దూదిపింజిలానే కనిపిస్తున్నాయి. అటువంటప్పుడు ఇక్కడుండి మీకు కష్టంకలిగిస్తూ నేను బాధపడడంకంటె, వెళ్ళిపోతేనేనయం. నా ఆతృతకొలదీ ఏదో చెప్పాను. నీవు అవేమీ వినిపించుకున్నట్లులేవు. అందువల్లనే వెడుతున్నానంటున్నా. మధ్యలో నీయోచనకు అంతరాయం కలిగించినందుకు క్షమించు కమలం" అంటూ బాధపడ్డాడు.

"అదికాదు ఫణిబాబూ! నాకు ఈవేళ ఏదో భయంగా వుంది. మాటలు తడబడుతున్నాయి..." అని ఇంకా ఏదో చెప్పబోతూంటే "అందుకనే నేవెడతానంటున్నా. ఈ కిరాతకుడు నీ ఎదుట వున్నంతకాలం అంతే. అంతేకాదు, నా పేరువింటే పసిపాపలుకూడ పాలుముట్టరు. నేనటువంటి కఠినాత్ముడ్ని. ఇక అటువంటప్పుడు నువ్వు భయపడ్డంలో ఆశ్చర్యంలేదు. నాపేరే ఫణిబాబు. ఇక నాలోవుండేది కాలకూటవిషమే. ఈ విషపు గాలులకి, కమలం! నువ్వుకూడ మాడిపోతావు. నిజమే కమలం! మాడిపోతావు. నాకు దగ్గరగారాకు. ఈ ప్రపంచమునుండి ప్రాణికోటి సంచరించని ప్రదేశానికి పారిపోతా. నన్ను ఇంక మర్చిపో కమలం! ఈ ఫణిబాబు ఇక్కడ లేడనుకో" అని ఆవేశంతో హృదయభారాన్ని వెళ్ళగక్కుతూ తలను చేతులతో పట్టుకుని కూర్చుండిపోయాడు.

"ఏమిటి ఫణిబాబూ! ఈవేళంత ఉద్రిక్తంగా మాట్లాడుతున్నావు. నాలో చాలగొప్ప సంచలనమే కల్గివుంటుంది. ఆవేశపడిపోతున్నావు. నేను నీగురించి ఏదో అపార్థంగా ఆలోచిస్తున్నా

ననుకుంటున్నావు. అదిపొరపాటు. నమ్మినవాళ్ళను శంకించడమనేది నన్ను నేను అవమానపరుచుకోవడమే. అటువంటప్పుడు నీవు ఆ విధంగా దిగులుపడటం దేనికి? నిన్ను చూచి కాదు నామనస్సు నిలకడతప్పిపోత. మనస్సు నిలకడ లేకపోవుటవలననే నాలో భయం ఆవహించింది. అందువల్లనే మాటలు తడబడు తున్నాయి. ప్రొద్దుటనుంచీ నా కుడికన్ను అదురుతోంది. అదేదో ఉపద్రవానికి సూచన. దానినే నేను ఆలోచిస్తున్నాను. మంజుల ఒక్కతే ఈరోజు దేవాలయాని కెళ్ళింది. చీకటిపడి పోయింది. ఇంకారాలేదు. నాకేదో భయంగావుంది. ఆడదంటే లోకానికి ఆటబొమ్మయిపోయింది. మనుష్యులతత్వాలు మారి పోతున్నాయి. నాకేదో దిగులుగావుంది. ఫణిబాబూ ఏవిధంగా నయినాసరే మంజుల శీలాన్ని నాశనం చేయాలని మూకప్రజలు పశువుల్లా తిరుగుతున్నారు. నాకదేభయం. నేనెల్లాగూ చెడి పొయ్యాను. ఆమెనుకూడ యీ నరకంలోకి దింపడానికి నాకు ఇష్టంలేదు. కాని లోకంపగబట్టింది విషపుగాలులు వెదజల్లు తోంది. ఏమూలకుపోయినా స్త్రీకి తీరని అవమానమే జరుగు తోంది. ఒక అందమైన స్త్రీ కంటపడినప్పుడు ఈ ప్రజలు తమ మృగతృష్ణకు బలిచేయకుండా వదలిపెట్టరు. సమాజం నాగరి కతతో ముందుకుసాగిపోతున్నకొలదీ ప్రజల్లో పాపభీతి నశించి పోతోంది. పాపభీతేలేనపుడు నీతికి, నిజాయితీకి ఈ లోకంలో స్థాన మెక్కడుంటుంది? అందుకనే నేనంత భయపడతాను మంజుల నా ప్రాణం. ఆమె తప్పించి నాకు కావలసినవారు నాకెవరున్నారు? వుంటేవుండవచ్చు. నేనీవిధంగా అంటున్నానని నీవు మరో విధంగా భావించవద్దు. నే బ్రతుకుతున్నది మంజుల

కోరికే. నా ఆశయాలతో నేను అడుగంటిపోతున్నా. నాకు తృప్తిఅనేదే వుండదు. నేను జీవిస్తున్నంతకాలం అవీ జీవిస్తూనే వుంటాయి. నాలో రక్తమాంసాలు వున్నంతవరకూ నా శక్తివంచనలేకుండా నాపనినేను చేసుకు పోతాను. ఎన్నిఅడ్డంకులురానీ, ఎంతమంది ఉసురులుతగలనీ నాపని నాదే. సమాజం కుళ్ళికుళ్ళి ఏడవనీ, నాకేమీా ఇబ్బంది లేదు. అది అల్లా ఏడవడమే నా సంతోషం. నా ఆశయం. మానవత్వాన్ని మాపుచేసే ఈ సమాజం ఒక మానవ సమాజమా? కాదు ఎన్నటికీకాదు! కోరలుచాచిన ఒక రాక్షసిమూక. ఇంతకంటే నేను నిర్వచించలేను. నీవు మరోకవిధంగా ఎంచి ఆత్మవంచన చేసుకోకు. నీకు నువ్వే నిందించుకొని బాధపడకు. అటువంటి పనిచేస్తే ప్రాణానికే అపాయం. అప్పుడే మానవుడు ఆత్మహత్యకు పాల్పడుతాడు..." అని చెప్తూంటే "అక్కా...!" అని పరుగునవచ్చి కమలం కాళ్ళమీాద పడింది మంజు. కమలం నిశ్చేష్టురాలయిపోయింది.

తను శంకిస్తున్నది నిజమే అయ్యింది. అయితే తన ఆశయాలన్నీ కూలిపోయాయా ? తన తల్లిదండ్రుల కిచ్చినమాట వమ్ము అయిపోయిందా? ఈ లోకం ఎంత నిర్దాక్షిణ్యమయింది? అసలు భగవంతుడనే వాడున్నాడా?-అయినా నేనెంత వెఱ్ఱి దాన్ని. ఈ విషయం గతంలో ఒకసారి దేవునిగూర్చి ఆలోచింప జేసింది. అప్పుడే తేలిపోయింది అసలు దేవుడనేవాడున్నదీ లేనిదీ. ఇపుడు రెండవసారి దేవునిగూర్చి తలపురావటమే ఒకపొరపాటు. భగవంతుడే రాయిఅయితే మావంటి స్త్రీలు ఆ రాళ్ళమీాద తలలుబాదుకొనుటకై బహుశా నిల్చివున్నాడు. ఎంత అభాగ్యుల

మయిపోయాం. అని తర్కించుకుంటూ, కాళ్ళవద్దపడి ఏడుస్తున్న మంజులను "చెల్లీ...!" అని గాఢంగా హృదయానికి హత్తుకుంది.

ఏడుస్తున్న వాళ్లిద్దర్నీ చూస్తూ ఫణిబాబు అసలు విషయం అవగతంకాక వారిని వూరడించడానికి పూనుకున్నాడు. కాని అతనికి ఏవిధంగా వారికిచెప్పి వూరడించాలో తెలియలేదు. అయినా ఒకింత ధైర్యంచేసి "చూడు కమలం! అలా బేలవైపోతే ఎల్లాగ. అసలే మంజుల హడలిపోయి దెబ్బతిన్న లేడిలా ఇక్కడికి వచ్చిపడింది. ఆమెను ఓదార్చవలసినదానవు నీవే మరింత క్రుంగదీస్తే ఎల్లాగ చెప్పు. ఇంతకూ అసలు విషయం ఏమిటో తెలుసుకోందే విచారించి మాత్రం ప్రయోజనమేముంది? మనకేదయినా కష్టం కల్గినప్పుడు తప్పించుకొనే మార్గం వెతకాలిగాని, ఈ విధంగా కృంగిపోవటం విజ్ఞులలక్షణం కాదు" మంజులవైపు తిరిగి "ఏం...మంజూ! నీవయినాచెప్పు, నీకు కలిగిన ఆపదఏమిటో? దానికితగిన ఉపాయం నేను ఆలోచిస్తా" అని అడిగాడు.

కాని మంజుల ఏమాత్రం సమాధానం చెప్పలేదు. కళకళలాడే ఆమెవదనం విచారంతో ముడుచుకుపోయింది. కన్నీటికి బుగ్గలమీద ఆనవాలుగా చారలుపడ్డాయి. కాని కళ్ళు నిప్పులు గ్రక్కుతున్నట్లు ఎఱ్ఱగావున్నాయి. ఉచ్వాస, నిశ్వాసములలో వేడివాయువులు వెలువడుతూ నీచమైన ఈ లోకాన్ని కాల్చివేస్తానన్నట్లున్నాయి. స్వేదంతో శరీరమంతా తడిసిపోయింది. కట్టుకన్నచీర మాసిపోయి దుమ్ముతో నిండిపోయింది. నిగనిగలాడే సల్లత్రాచువంటి ఆమె విడినజడ పడగవిప్పి త్రాచులా గాలికి

ఇటూ అటూ కదలుతోంది. వేడినిట్టూర్పులు వేగంగా వెలువడుతున్నాయి. ఆమెచూపుల్లో ఏహ్యత గోచరిస్తోంది. కాని ఎక్కడో ఓమూల కృతజ్ఞతాభావం తొణికిసలాడుతోంది. అది ఫణిబాబు గ్రహించలేదుగాని కమలం గుర్తించింది. ఆమెలో ఇక ఫరవాలేదనే భావన గోచరించింది. తనమంజు నాశనం కాలేదని భావించి "మంజూ! దుఃఖించి లాభంలేదమ్మా. ఇక మనబ్రతుకులు దినదినగండంతో గడుస్తాయి. మనం తామరాకుమీద నీటిబొట్టువంటివారం" అంటూ మంజులను మరింత దగ్గరికి తీసుకుంది కమలం.

ఆ వాత్సల్యానికి ఆమె మరింత బేలయిపోయింది. ఆమె ఓదార్పులు మంజులలో నిండిపోయిన దుఃఖాన్ని నిలవరించలేకపోయాయి. దుఃఖాన్ని దిగమింగలేక, కమలం హృదయానికి మరింత గాఢంగా హత్తుకుపోయి వెక్కి వెక్కి ఏడ్చింది మంజుల.

మరికొంతసేపు వారా విధంగానే మౌనంగా ఉండిపోయారు.

"మంజూ! ఫరవాలేదు చెప్పమ్మా. ఇలా విచారిస్తే ప్రయోజనంలేదు. జరిగిందేదో జరిగిపోయింది. జాగ్రత్తగా బ్రతికి బయటపడ్డావు అంతే. అదేచాలు" అని కమలం ఓదార్చింది.

"అంతగా పుట్టడమే తప్పయినప్పుడు భగవంతుడు ఈ అందాన్ని ఎందుకు సృష్టించాడు అక్కా! మానవుల్ని మృగాలుగా చేయటానికా ఈ అందం సృష్టించింది! ఇక అటువంటప్పుడు మానవుల్లోని ప్రత్యేకత ఏమిటి? అందరిని పశువులుగ సృష్టించితే అప్పుడు ఈ బాధలేమీ వుండవుగ. ఇంగితజ్ఞానం లేకుండ

చేసి, తారతమ్యాలు కనపడకుండ కళ్ళకి పొరలుకప్పి అల్లాంటి వారిచేత ఆటలుఆడిస్తూ భగవంతుడు ఆనందిస్తున్నాడు. అటు వంటివాడు భగవంతు డెట్లవుతాడు? కాదు ముమ్మాటికీ కాదు. అసలు భగవంతుడనేవాడు లేడు. అదంతా వట్టిభ్రమ. మానవుడు మలచిన శిల. అంతే అక్కా! అంతే. లేకపోతే ఏమిటి? దేవుడు అనేవాడు అసలు వుంటే, భక్తులపాలిట, ఆర్తులపాలిట దయామయుడేఅయితే నన్నా తుచ్ఛులు అవమానపరుస్తుంటే ఎందుకు వూరుకున్నాడు. నిద్రపోయాడా? ఇదేనా 'ఆర్తత్రాణ పరాయణుడు' అంటే అర్థం! ఇదేనా మనకిచ్చే రక్షణ? కామంతో కళ్లుమూసుకుపోయి మానవత్వాన్నే మరచిపోయి, తన సాన్నిధ్యంలో, తనఎదుట, తనను దయామయుడు, భక్తుల పాలిట కామధేనువు, కల్పతరువు, నమ్మినవారిని చేరదీసి, ఆద రించి వరాలనొసగే పరమేశ్వరుడు అనుకొని, నిత్యము ఆరా ధించే ఒక స్త్రీని, అబలని మానభంగం చేస్తూంటే చూస్తూ వూరుకుంటాడా పాషాణి. అతనిలోని దైవత్వం చచ్చిందా? వాడా భగవంతుడు. కాదు. భక్తులపాలిట కాలయముడు. ఆయనేవచ్చి నన్ను ఆదుకొని కాపాడకపోతే ... అక్కా ఈ పాటికి ఏమయిపోయుండేదానినో నీకు తెలుసా? దేవుడు అనే వాడికి బుద్ధిచెప్పిన మానవుడు, కాదు నాపాలిట పెన్నిధి. ఆయన రాకపోతే ఆ కిరాతకులు నన్నేమి చేసివుండేవారో కదా! ఈ నా శవాన్ని చూచివుండేదానవు అక్కా. ఇంతకంటే వేరే అవ మానం స్త్రీకి ఈ ప్రపంచంలో ఏముందక్కా. ఈ తుచ్ఛ పపంచం - ఈ పురుగులపుట్ట - ఎప్పుడో మనవంటి స్త్రీవుసురు

తగిలి దగ్ధమైపోతుంది. అది తప్పదు. స్త్రీ శివశక్తి. అది ఈ మూర్ఖులకు తెలియటం లేదు.

సంఘపెద్దలమని బుజాలు ఎగురవేసుకొని తిరిగే ఈ రాక్షసులు, రాబందులు, వారి సంఘం. ఈ జాలిలేని రాతి దేవుడు, ఆయనపేరున బ్రతికే ఈ అర్చకులు, అంతా ఒకేసారి ఈ స్త్రీ శక్తికి ఆహుతయిపోతారు. అప్పటివరకూ నీతీ, నిజాయితీలకు స్థానం లేదు ఈ లోకంలో." అని తనకి కలిగినటువంటి అవమానానికి, అన్యాయానికి దహించుకుపోతూ ఆ ముగ్ధ లోకం పైన, భగవంతునిపైన తన కక్షను, శాపాన్ని వెల్లడి చేస్తోంది.

అందుకనే స్త్రీ అబల.

ఫణిబాబుకి ఏంచేయాలో తోచటం లేదు. మంజులతో– "ఆ పెద్దలెవరో నీకు గుర్తుందా? వాళ్ళెవరో వెంటనే చెప్పు? ముక్కముక్కలుగ తరిగి కాకులకి, గ్రద్దలకి పడేస్తాను. ఈవిధంగా నయినా ఈ పశువుల రక్తమాంసాలు వాటికి లభిస్తాయి. చెప్పు మంజులా-చెప్పు. నాలోని రక్తం ఉడికిపోతోంది. ఇక ఊరుకుంటే ఉపయోగం లేదు. ఈనాడు నీకయింది. రేపు ఇంకొకరికి. దీనికి వెంటనే తగిన గుణపాఠం నేర్పాలి. కళ్లు మూసుకుపోయిన వారి కళ్లు తెరిపించాలి. ఆలస్యం చేయకు మంజులా... చెయి దాటిపోతుంది..." అన్నాడు కోపంతో.

అయితే అతడిమాటల్లో సత్యం గోచరించలేదు మంజులకు. కంటికి కనిపించిన ప్రతి మగవాడు ఆమెకు ఒక రాక్షసుడి లాగ కనిపిస్తున్నాడు. ఆమె చూపులలో ఒకడే ఆ భావంనుండి వెలువడి బయటపడినవాడు. అతడెవరో ఆమెకు తెలియదు.

ఆమె ఎవరో బహుశా అతడికీ తెలిసివుండదు. దేవాలయంవైపు నుండి పోతూంటే ఈమె కేకలు వినిపించాయి. అంతే. వెంటనే అతడు ఒక్కక్షణంలో వచ్చేసరికి, కిరాతకులు పారిపోయారు. అతడు ఆమెను పల్కరించలేదు. మంజుల సుందరమోహన మూర్తిని చూచేసరికి అతడు చకితుడయిపోయి, విగ్రహంమాదిరిగ రెప్పవాల్చకుండ నిలబడిపోయాడు. భయంతో వణికి పోతూన్న మంజుల అతన్ని, రూపాన్ని చూచి, అతని వాడిచూపులకి తట్టుకోలేక సిగ్గిలి కృతజ్ఞతాభావంతో అతడినొకమారు వీక్షించి, హృదయమందే ఆ మూర్తిని నిలుపుకొని వందనమాచరించి ఆలయ బహిఃప్రాంగణంలోనికి వచ్చి వెనుదిరిగి చూచుసరికి, ఆ సుందరాకారుడు, మన్మథుని మరిపించు మోహనుడు మందహాసముతో వేడయిన చూపులబాణములు వదలి తన హృదయాన్ని గాయపరచినాడు. కాని, కనురెప్పపాటులోనే అతడు మాయమయ్యాడు. అంతే-తడబడుతూ భయంతో ఇంటిదారి పట్టింది.

చీకటి మరింతదట్టంగ ఆవరించుటచేత మంజుల మరింత భీతినొంది వడివడిగా నడిచింది. ఆమె హృదయంలో ఆ కిరాతకులు గావించిన దుష్టచర్యలు గిర్రున తిరుగసాగాయి. వ్యాకులత పొంది నిల్వ్రతొక్కుకోలేకపోయింది. అందువలననే ఆమె అక్కను చూడగానే దుఃఖము పెల్లుబికివచ్చింది.

ఏవిధమయిన అడ్డంకులు వచ్చినప్పటికీ తన కళావ్యాసంగమును నిర్విరామంగా కొనసాగిస్తోంది. కాకుల్లామూగే కాముక ప్రజలకు ఈసంగతిస్తే తెలియదు. తెలిసినా పట్టించుకోరు. ఎందుచేతనంటే వారు రసికులు. రసికులకు ప్రపంచమంతా ఒక స్వర్గ

ధామంగా గోచరిస్తుంది. వారికి ఒకరికష్టాలు కన్పట్టవు. అంతా వసంతమే. అంతా స్త్రీమయమే. అంతంలేని తృప్తితో ఆరాట పడుతారు. తీరనితృష్ణ వారిని మరింత మధురలోకాల్లోకి తీసికొని పోతుంది. మధువును గ్రోలుతేనేగాని వారితృష్ణ తీరదు. తుమ్మెద వలె ఘోషిస్తూవుంటారు. జ్వాలచుట్టూతిరిగే శలభాల్లాగ తిరుగు తారు. అయితే ఆ జ్వాలకు ఎప్పుడు మలమలా మాడిపోతారో తెలియదు! కాలం కలసిరానప్పుడు తప్పక మాడిపోతారు.

ఫణిబాబు, సింహాలు రక్షకులయిపోయారు. మొదట్లో కమలం వార్ని నమ్మకపోయినా క్రమేపీ వారితో అలవాటుపడి పోయింది. ఏ విషయమయినా ఫణిబాబుతో చెప్పనిదే చేయటం లేదు. ఈమధ్య ఆమెకోసం వచ్చేవారుకూడ తగ్గిపోయారు. దీనికి కమలమే కారణం. ఆమె మనస్సులో ఏహ్యాభావం ప్రస్ఫు టంగా గోచరించింది. వచ్చే ఇద్దరుముగ్గురూ గొప్ప జమిందారులు. డబ్బుకేమీ లోటులేదు. ఇకపోతే ఫణిబాబు అవసరానికి ఆదు కొంటూనేవున్నాడు.

తనకొరకు రాకపోయినా మంజులకొరకు అనేకమంది వస్తున్నారు. అది ఆమె సహించలేకపోతోంది. ఇదంతా తనవల్ల. వీరందరూ పూర్వం ఈ వాతావరణమునకు, మార్గమునకు అల వాటు పడిపోయారు, ఇప్పుడువద్దంటే మానరు. ఈ విషయమై అనేకసార్లు తగువలువచ్చాయి. 'రావద్దు. ఇదేమయినా భోగం కొంపా' అంటే నవ్వుతున్నారు. దుర్భాషలాడుతున్నారు తమను కించపరిచామని. 'నీవు భోగందానివి, కులటవుకాకపోతే పతి వ్రతవా' అని గేలిచేస్తున్నారు. అదీనిజమే. తనమార్గం అటు వంటిదే. అయితే తన మంజు అటువంటిదికాదుగా? అది వారికి

అనవసరం. పైగా నడివీధిలోనే నానామాటలు! వీధికెక్కిన గౌరవస్థులు, సంఘోద్ధారకులు, సంఘ పెద్దలు!! - కళ్లు ఎర్ర చేసి కక్షలుపెంచుకొని 'తినడానికి తిండిలేకుండ చేస్తాము' అని ప్రతిజ్ఞలుపట్టి పోతున్నారు. ఈమధ్య ఇటువంటివారు ఎక్కువయిపోయారు. అలజడి మితిమీరిపోతోంది.

ఈరోజున దేవాలయం ఆవరణలో మంజుల నృత్య ప్రదర్శనమని వార్త వెలువడింది. పక్క గ్రామాలవారికి యీ వార్త గొప్ప వింకుగతోచింది. మంజులకు సన్మానముకూడ యీ రోజునే ఏర్పాటుచేశారు. పంచాయితీ అధ్యక్షుని, సభాధ్యక్షునిగ నియమించారు.

సాయంత్రం అయిదుగంటలయింది. జనులు తండోపతండాలుగా వచ్చేస్తున్నారు. అప్పుడే దేవాలయం ఆవరణంతా నిండిపోయింది. వారుచేసే కోలాహాలం అంతింతని చెప్పశక్యం కాదు. ఒకరితో ఒకరికి సంబంధంలేదు. అనేకమంది ఇంకా వస్తూనేవున్నారు. వారిలో వివిధరకాలవా రున్నారు. కొందరు నాట్యశాస్త్రాచార్యులు, మరికొందరు కవులు, కొందరు గాయకులు, నాట్యకళాభిమానులు, కొందరు చిత్రకారులు. ప్రతివక్కరు మంజులనుగూర్చి ఆలోచించేవారే. ఏవిధంగా ఆమె మెప్పును పొందాలాఅని వువ్విళ్ళూరుతున్నారు. గానకళాకోవిదులు ఆమె కంఠమాధుర్యాన్ని అనుభవించాలని ఆతృతపడుతున్నారు. వీరందరూ ఇదివరకు విన్నవారే. అయినప్పటికి ఆమె కోకిలకంఠంలో నవీనత ఎప్పుడూ చూరగొంటూనేవుంటారు. ఆమె కంఠస్వరములో సప్తస్వరాలూపలికి చూపరులను చకితులను చేస్తాయి. తన్మయత్వంలో మునిగిపోతారు.

ఆమెచే తిరస్కరింపబడిన రసికులుకూడ వచ్చారు. ఆమెను పొందలేకపోయినా, ఆమె అందాన్నయినా ఆస్వాదించా లనే యిచ్ఛతో వచ్చారు. మరికొందరు అదనుదొరికితే కక్ష తీర్చుకుందామని కిరాతకులవలె పొంచివున్నారు. ఈవిధంగా ప్రతి ఒకవ్యక్తి ఏవేవో ఊహాలతో కొట్టుమిట్లాడుతున్నాడు. ఏ యోచనా లేకుండా వున్నవారు కొద్దిమంది ఉన్నారు. ప్రతి ఒక్కరు వేదికమీద తెర ఎప్పుడు తొలగిపోతుందా, ఎప్పుడు మంజుల దర్శనభాగ్యం లభిస్తుందా అని ఆతృతతో ఎదురుచూస్తు న్నారు.

వేదిక చక్కగా అలంకరింపబడింది. ఏమూలనుండి చూచినా ప్రదర్శనము చక్కగా కనిపిస్తుంది. భూమికి మూడడు గులఎత్తులో నిర్మింపబడింది. దీపాలకాంతిలో ఆ వేదిక మరింత శోభాయమానంగా వెలిగిపోతోంది. చీకటి పడ్డకొద్దీ దీపాల కాంతికి ఆ ప్రదేశమంతా పట్టపగలులా గోచరిస్తోంది.

తహతహలాడిపోతున్న ప్రేక్షకులకు వేదికపై తెర తొల గించేసరికి కన్నులపండుగయ్యింది. నటరాజ విగ్రహంవలె ఏ కద లికా లేకుండా నిలబడివుంది. ఆ వాతావరణంలో అప్పుడే అడుగు పెట్టిన ఏ వ్యక్తికయినా ఆమె రంగులువేసిన శిల్పరాజమువలె గోచరిస్తుంది. ప్రేక్షకులు నిస్తబ్ధులయినారు. ఇంతలో ఆరంభ సూచకంగా గంట గణ.. గణ మ్రోగింది. నాట్యం ప్రారంభ మయింది. ప్రేక్షకులు మంత్రముగ్ధులయిపోయారు. మంజుల ప్రతి కదలిక ప్రేక్షకులకు ఒక్కొక్కరూపంలా గోచరించి మెరుపువలె మాయమవుతోంది. ఆమె భావప్రకటన అతి సునిశితంగాఉంది. ప్రేక్షకుల నయనాలు సూదంటురాయిని ఇనుము ఆకర్షించి

నట్లుగా ఆకర్షించి ఆమెతోపాటు నృత్యంచేస్తున్నాయి. ప్రతి ఒక్కని వీనులు ఆమె గానామృతాన్ని గ్రోలుటకు రిక్కరించి నిలబడ్డాయి. పదవిన్యాసంతో గాత్రం లయమవుతుంటే తన్మయు లయిన ప్రేక్షకుల హృదయాలు తరంగములవలె ఉప్పొంగిపోతు న్నాయి. ఏ దేవతామూర్తో స్వర్గలోకమునుండి దిగివచ్చి నృత్యము చేస్తున్నట్లుగా వుంది.

నృత్యమయిపోయింది. కాని ప్రేక్షకుల హృదయాలలో ఆమె నృత్యభంగిమలు హత్తుకొనిపోయి వారి నేత్రాలకు ఆమె యింకా నృత్యము చేస్తున్నదానివలె గోచరిస్తోంది. వాళ్ళని వారే మర్చిపోయారు. అంటే ఆమె అంత కళామయి. ఇంత చిన్న వయస్సులోనే, ఆమె ఆరితేరిన కళాకారుల మనస్సులను ఆకట్టు కొన్నదంటే బహుశా ఆమె పూర్వజన్మసుకృతమయ్యుంటుంది. ఆ సువాసనాపుంజములు ఈజన్మలో లీనమయిపోయాయి. అందు చేతనే స్వల్పకృషితో మంజుల నేడు వాటిని వెలుపలికితీసి ప్రజ లను ఉర్రూతలూగిస్తోంది.

తన్మయులయిన ప్రజలకు అధ్యక్షునికంఠం అంతరాయ మొందించింది. అప్పుడు వారు తమ భావాలనుండి కోలుకొని మిన్నంటేట్లు ఆనందోత్సవాలతో కరతాళధ్వనులు కావించారు.

సభాధ్యక్షులు ఉత్సాహం వుట్టిపడుతూ "నేడు మంజుల గావించిన నృత్యప్రదర్శన ఏ దేవలోకానికో మనలనందరిని కొని పోయింది. మనల ఆనందింపచేయుటకు దివినుండి భువికి దిగి వచ్చిన యక్షకన్యక మంజులరూపంలో ఈ జన్మలో మనకు సాక్షాత్కరించిందంటె అతిశయోక్తికాదు. ఆమెనుగూర్చి ఇంత కంటె నే చెప్పలేను. చెప్పుటకు అర్హుణ్ణికూడ కాను. ఏదో

హోదాగలిగినవ్యక్తిగ నన్నీ సన్మానసభకు ఆహ్వానించి అధ్యక్ష పీఠాన్నిచ్చారు. ఆమెను సన్మానించతగిన వ్యక్తినికాను నేను. అయినా మీ ఆనందానికి అంతరాయంకలిగించకుండా ఈ కళా తపస్వినిని, గానకోకిలను, చదువుల సరస్వతిని, భాషకందని వర్ణనా తీతమయిన జగదేక రూపసిని సంతోషంతో సన్మానించుటకు అంగీకరించాను" అని కూర్చున్నారు.

మంజుల నృత్యప్రదర్శనాదుస్తులను మార్చి వేదికపైకి వచ్చింది. ఆమె ప్రశాంతంగావుంది. ఈ పొగడ్తలకు కించెత్తు మాత్రమయినా ఆమెలో గర్వము పొడసూపినట్లు గోచరించటం లేదు. గర్వించటం ఆమె అభిమతంకాదు. అయితే ఆమె వెంట పడి ప్రాకులాడే మగరాయళ్ళను తలచుకొనేసరికి ఆమెలో అహంభావం బయలుదేరుతుంది. ఆమెదృష్టిలో వారు అనామకులు. అయితే ఆ ప్రసంగం అప్రస్తుతము.

సన్మానము జరిగిపోయింది. ప్రేక్షకులు ఎవరింటికివారు జారుకున్నారు. సందడి ఎప్పుడయితే తగ్గిందో అప్పుడే వెలవెల పోయింది ఆ ప్రదేశమంతా. కొందరు గ్రద్దలవలె ఏదో ఆశలతో ఇటునటు తచ్చాడుతున్నారు. వారి ఆశఏమిటో తెలియదు. కాని అందరిముఖాల్లోనూ ఏదో ఆతృత గోచరిస్తోంది.

మంజుల బయటకు వచ్చింది. వారిలో ఏదో సంచలనం కలిగింది. కాంతికిరణం వారి ముఖములలో మెరిసింది. కాని అంతలోనే వారి ఆశయం అంతరించి నిరాశతో వెనుదిరిగారు. అందుక్కారణం మంజులవెంట సింహాలు, పంచాయతీ అధ్యక్షుడూ వున్నారు.

బహుశా రాత్రి 10 గంటలయ్యుంటుంది. బండి నెమ్మ

దిగా పోతోంది. చల్లనిగాలి వీస్తోంది. "మీరు ఈరోజు మా ఆతిథ్యం తీసుకోవాలి. తప్పక అంగీకరిస్తారనుకుంటా?' అన్నాడు మంజులకు ఎదురుగా కూర్చునివున్న పంచాయతీ అధ్యక్షుడు.

"ఫరవాలేదు లెండి. ఇంటికి పోతాను. అక్కయ్య ఎదురు చూస్తూ వుంటుంది. అసలే ఆలస్యమైపోయింది. క్షమించాలి" అంది నెమ్మదిగా మంజుల.

"మీరు ఆ విధంగా మాట్లాడుతారని ముందుగనే అనుకున్నాను. అయినా నాకోరిక మన్నించుతారనుకున్నా."

"ఇందులో మన్నించేటంత భాగ్యమేముందండి. ఆ మాత్రందానికే మీరంత బాధపడ్తారనుకోలేదు."

"మీకు ఆమాత్రం తోచినప్పుడు మా కోరికను గమనించవచ్చుగా. ఇంత ప్రాధేయపడుతున్నా మీ మనస్సులోని కాఠిన్యత కరగలేదంటే అది మా దురదృష్టం."

చల్లగావుండే వాతావరణం తన ప్రశాంతతను విడచింది. ప్రచండమారుతం మహావేగంతో వాతావరణాన్ని భీభత్సం చేస్తుంది. చూస్తుండగనే కారుమబ్బులు పూర్ణచంద్రుని కబళించాయి. భయంకరమైన ఉరుములు, కర్ణభేరులను అదరు గొడుతుంటే వాటిమధ్యన మెరుపులు వికటాట్టహాస రేఖలను ప్రజ్వరిల్ల జేస్తున్నాయి. క్షణంలో ఎంతమార్పు!

ఈ భీభత్సమునకు మంజులలో భయం తలఎత్తింది. చూస్తుండగనే ఆమె ఒణికిపోతోంది. నోటినుండి మాటరావటం కూడ అతికష్టమైపోతోంది. అందులోనూ ఇప్పుడు పరాయి మగవాళ్ళతో వున్నది.

అక్క చెప్పిన మాటలన్ని మస్తిష్కములో గిర్రునతిర

నారంభించాయి. ఆమెలో ఏదో అనుమానం తలఎత్తింది. "ఆడదానికి శీలంముఖ్యం. శీలం...శీలం...!!! అది పోయిం దంటే యీ ప్రపంచంలో ఆడదానికి విలువేలేదు! ఈ సంఘం నిన్నొక మనిషిగా చూడదు. పవిత్రతకై ప్రాణాలైనా తృటిలో విడువుగాని నీ గౌరవాన్ని మట్టిపాలు చేసికొనకు...జాగ్రత్త" అని ఒకటే రొదచేస్తున్నాయి. ఈవూహ తలంపు కొచ్చేసరికి శరీరమంతా ముచ్చెమటలు పోసేశాయి.

"మంజూ! బండినడవటంలేదు. తుఫానుపట్టేట్లుంది. ధైర్యం చేసి ఎదరికిపోయినప్పటికి మనం ఇల్లు చేరుకోలేము. అది సాధ్యంకానిపని, పైగా ప్రాణాపాయకరం. బాబుగారు చెప్పినట్లు ఈ రాత్రికి వారిభవనంలో వుండిపోదాం. మరేం భయపడకు. అంతటివారు మనల్ని ఇంతప్రాధేయపూర్వకంగా అడుగుతుంటే కాదని నిరాకరించటంకూడ ఏమంత మంచిపనికాదు'' అని అన్నాడు, బండివానిప్రక్కన కూర్చున్న సింహాలు వోరుగాలిలో తనమాటలు వినిపించవేమోనని బిగ్గరగా.

మంజులకు చీకటివలన అతని ముఖభావాలు అర్థం కాలేదు. కాని అతనిమాటల్లో ఏదో నిగూఢరహస్యం గోప్యంగా దాగివున్నట్లు గోచరిస్తుంది. కాని అంతలోనే సింహాలు తన అన్నవంటివాడు, తనకు ఆపదతలపెడతాడా? చిన్నతనంలోనుండి తనను ఎత్తుకుమోసినవాడు. ఈ సంగతి తనకు జ్ఞానంవచ్చిన తరువాతకూడ తెలుసు అని సమాధాన పడబోయింది. ఇంతలో అక్కమాటలు గుర్తుకువచ్చాయి. ఫణిబాబు తేనెపూసినకత్తి. ఒకకంటితో కనిపెట్టు. అదేవిధంగా సింహాలునుకూడ కనిపెట్టు. వాడు ఒక చీడపురుగు. "పయోముఖ విషకుంభం. వెన్నవంటి

మాటలు, పాషాణంవంటి హృదయం వాడిది" అన్నమాటలు గుర్తుకువచ్చాయి. వాడు తనను చిన్నతనంనుండీ చూసినప్పటికి వాణ్ని చూసేసరికి ఏహ్యాభావం కలుగుతుంది మనస్సులో. ఆ భయంతోనే కంగారుపడుతూ మంజుల "ఫరవాలేదు సింహాలు. నాకేదో భయంగావుంది. వారింటికి ఇంకొకసారి వెడదాము. నామాటవిని ఇపుడు మనయింటికి వెళ్ళిపోదాము. అక్కయ్య మనకోసం భోజనంకూడ చేయకుండ ఎదురుచూస్తూవుంటుంది. అందులోనూ ఈమధ్య ఆమె ఆరోగ్యం బాగాలేదు" అని చెప్పబోతూంటే బండి ఒక మూడంతస్థుల భవనంవద్ద ఆగింది. సింహాలు బండిదిగి "మంజూ! దిగు" అన్నాడు.

మంజులకు ఏమీ అనడానికి తోచటంలేదు. అదీకాక ఇప్పుడు ఏమిఅన్నాకూడ లాభంలేదు. వినిపిలచుకొనేవారు లేరు. ఎల్లా జరిగేది అల్లా జరగకమానదు అనే ఉద్దేశ్యంతో ఆగంతకుల వెంటబడి మేడఎక్కింది.

మంజుల మనస్సులో చెలరేగే వూహాలతో భయంకర రూపాన్ని నిర్మించుకొని హడలిపోయింది. కాని వారి ప్రవర్తనలలో సందేహించవలసినదేమీ కనుపించలేదు. వారి ముఖాలలో కూడ ఏ మార్పులేదు. వారు సామాన్యంగా అతిధిని ఆహ్వానించినట్లే ఆహ్వానించారు. కాని రాత్రి సమయంలో పరాయి మగవాడు ఒక స్త్రీని ఆహ్వానించాడంటే, ఏ స్త్రీ అయినా తప్పుగా అనుమానపడుతుంది. అది సహజం. అందులోనూ మంజుల పరిస్థితులు, ఆవిధంగానే వున్నాయి. ఈ భీతావహత పరిస్థితులకు తగ్గట్టుగా బయటి వాతావరణం ప్రళయంగామారింది. అందుచేతనే ఆమెమరింత క్రుంగిపోయింది.

"కూర్చో మంజులా! నువ్వేంత భయపడవలసిన దేమీ లేదు. కమలంతో ఉదయమే చెప్పాను ఈ రాత్రికి నువ్వు మా ఆతిథ్యంస్వీకరిస్తావని. సింహాలికీ తెలుసు. అదికాకుండా సింహాలు నీ ప్రక్కనే వున్నాడులే! అని చెప్పి గుమ్మంవైపుచూస్తూ "ఒరేయ్, వెంకన్నా! భోజనం తొందరగా తీసుకురా" అని కేక వేసి, మంజులను చూస్తూ "కూర్చో మంజూ! నేనేమీ క్రొత్త వాణ్ణికాను. మీ అక్కను నేను దరిదాపుగా పది సంవత్సరాల నుండి ఎరుగుదును. అప్పటికి నువ్వింకా చిన్నపిల్లవు. కాని నేడో! మీ అక్కను మించిన అందకత్తెవయ్యావు. వికసించే పుష్పానివి, రా! అట్లాకూర్చో" అన్నాడు పంచాయితీ అధ్యక్షుడు తన్నుతాను పరిచయంచేసుకొంటూ.

"అవును మంజూ! నీకీయన గుర్తుండకపోవచ్చు. అయినా ఈమధ్య నువ్వు బయట ప్రపంచాన్నే మర్చిపోయావు. మనం ఈవూరు రాగానే ఆసరాయిచ్చి ఆదుకున్నవారిలో వారొకరు. నీవు మరొక విధంగా అనుకోకు. గౌరవం, అంతస్థులూ కల వారిలో ఈయన మొదటివారని చెప్పొచ్చు. అదిగో వెంకన్న భోజనం తీసుకువచ్చాడు" అని ఆయన మాటలకు సింహాలువంత పాడాడు.

వెంకన్న ముగ్గురికీ భోజనాలు ఏర్పాటుచేశాడు.గాలిఎక్కువగుటవలన కిటికీతలుపులు వేసివచ్చాడు. బాగా ఆకలిఅగుట వల్ల సింహాలు తినడానికి ఉపక్రమించాడు. సింహాలు ఏ ఎండకు ఆ గొడుగు పడతాడు. అతడికి మంచి మర్యాదలతో, పాప పుణ్యాలతో, ధర్మా ధర్మాలతో నిమిత్తంలేదు. అవన్నీ పట్టుకొని వ్రేలాడుతే యీ మానవ జీవితం సుఖమయం కాదని

అతని అభిప్రాయం. అందుకై అతడు ఎంతటి నీచకార్యానికైనా ఒడికట్టి ఆ సుఖాన్ని పొందుతాడు.

"ఏం మంజూ! నీ పంతం మానవన్నమాట. దీని మూలంగా ఆ గౌరవస్తులుకూడా మాడిపోతున్నారు. మధ్యన నా పరువు తీస్తున్నావు" అన్నాడు, తను తింటూ ఒకసారి మంజుల వైపు, పంచాయితీ అధ్యక్షుని వైపూ చూచి.

మంజుల ఏమీ మాట్లాడకపోవటం చూచి నాలుగు ముద్దలు గబగబా నోట్లో కుక్కుకుంటూ "ఆ మూర్ఖురాలితో ఏమిటండి. అది తింటే ఎవరికి కావాలి? లేకపోతే ఎవరికి కావాలి? తినకపోతే దాని కడుపే మాడుతుంది. అక్కను మించిన చెల్లెలు. బ్రతికేది నీచంగానయినా పౌరుషాలు, పట్టుదలలూ చూస్తే మితిమీరిపోతూంటాయి. అంతస్థుకు తగ్గట్టు అణిగి మణిగి పడివుండాలి" అన్నాడు కోపంతో నోట్లోవున్నది మింగుతూ.

"నువ్వూరుకో సింహాలూ! ఆమె మనస్సు అసలే బాధ పడుతూంటే నువ్వు మరింత కష్టపెడుతున్నావు." అంటూ వెంకన్నవైపు తిరిగి వెంకన్నా! మంజులకు ఒక గ్లాసుడు పాలు తీసుకురా, యింతలో నేను భోజనం ముగిస్తా" అంటూ లేచి వెంకన్నను ప్రక్క తీసికొని వెడుతూ అతని చెవిలో రహస్యంగా ఏదో చెప్పాడు. వెంకన్న చిన్నగా నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. తరువాత ఆయనకూడ భోజనానికి కూర్చుండి పోయాడు.

మంజుల అక్కడినుండి లేచి యిటు అటు పచార్లు చేస్తోంది. ఆమెకేమీ తోచటంలేదు. ఆమె ముఖభావం గానే వుంది. మనస్సులో ఏ భావాలు మెదులుతున్నాయోగాని

బయటకు మాత్రం ఆ విధంగానేవుంది. ఒక్కొక్కసారి కిటికీ తలుపులు తెరిచి వర్షం పడుతున్నది లేనిదీ చూస్తోంది. మళ్ళీ తలుపులు వేసేస్తోంది. ఒక మారు ఏదో ఒక నిర్ణయానికి వచ్చి నట్టు తలను యిటునటు వూపి ఒక వేడి నిట్టూర్పును వదలు తోంది. ఆయన ప్రవర్తననుబట్టి ఆమెలో ఏదో ఒక భావన నిండి వుందని అనుకోనాలి. ఈ విధంగా అర్ధగంటకాలం గడిపేసి వుంటుంది.

మిన్ను విరిగి మీదపడుతుందేమో అన్నట్లు ఉరుములు ప్రచండ శబ్దానిచేస్తూ చెవులను చిల్లులు పొడిచాయి ఒక్క సారిగ. ఈ భయంకర శబ్దానికి ఆమె అమాంతంగా వులిక్కిపడి భావనా ప్రపంచంనుండి బయటపడింది. కాని ఆమె హృదయం దడదడలాడింది. ఒక్కమారుగ తెల్లబోయింది. ఆ పరిస్థితి గమ నించి 'సింహాలు' అని గట్టిగా ఒక కేకపెట్టింది. సమాధానం లేదు. ఆ వెలుతురు లేని గదినుండి ఒక మూల చిన్న దీపం మినుకుమినుకు మంటూ వెలుగుతోంది. గదికి మధ్యగా ఆ దీపపు కాంతిలోనే తళతళలాడుతోంది ఆ పాన్పు.

"సింహాలు" అన్న కేకకు సమాధానంగా పంచాయితీ అధ్యక్షుడు ఎదురయ్యాడు.

ఆమె హడలిపోయింది అతని వేషానికి. కాని ఏం చేయ కలదు? విజ్ఞురాలు కాబట్టి, మనోధైర్యాన్ని చిక్కబట్టుకొని మాట్లాడకుండా నిలబడింది.

"ఏం కావాలి మంజూ ! సింహాలికి నిద్రవస్తోందని క్రిందకి వెళ్ళిపోయాడు. నీ వేదో ఆలోచనల్లో మునిగిపోయావని, నే వున్నాననే ధైర్యంతో పలకరించకుండా వెళ్ళిపోయాడు. అప్పుడే

రాత్రి పన్నెండు గంటలయిపోయింది. నీవు ఆహారమేమీ తీసుకో లేదు. రా...వచ్చి పాలు తీసుకో" అన్నాడు మందహాసం వలక బోస్తూ, విలాసాన్ని వెదజల్లుతూ.

వద్దంటే మూర్ఖపు పట్టుపడతాడేం! అతనందించిన పాలు త్రాగి "వర్షం తగ్గినట్లుంది. దయచేసి నన్ను మా యింటివద్ద దిగ బెడితే మీ కెంతో కృతజ్ఞురాలను!" అంది మంజుల నెమ్మదిగ.

ఆ మాటలకు అతడు సన్నగా ఓ చిరునవ్వు విసిరాడు.

"ఇంతరాత్రివేళ మీరేమి వెడతారు. వాన తగ్గిందను కోండి. సగం రాత్రి గడచిపోయింది. దారి బాగుండదు. యిప్పటివరకు కురిసిన వర్షానికి రోడ్లన్ని నిండిపోయుంటాయి. బండిమీద పోదామా అంటె బండినడవదు. ఇకపోతే కాలి నడక పట్టాలంటే ఆ నీటిలో దారి తెన్ను గోచరించదు. అంటే చీకటిమయం. యింకా తుంపరపడుతూనేవుంది. ఈ వర్షం తగ్గి పోతుందని ఎల్లా అనుకుంటాం. ఉరుములు మెరుపులు వస్తూనే వున్నాయి. మనం మధ్య దారిలో చిక్కుకొన్నామంటే ప్రాణా లను రక్షించుకోడానికి కూడా ఆస్కారంలేదు. మీకు ప్రాణాల మీద తీపి లేకపోతే పోవచ్చుగాని నాకువుంది. అయినా మీ కంత తొందరేమొచ్చింది? యిక్కడేమయినా ముళ్ళకంచెలతో కట్టి పారేశామా! బొత్తిగా నిలువ లేకపోతున్నావు. అయినా నీ కంత మూర్ఖత్వం పనికిరాదు. మానవులమైన తరువాత ఒకరిని మరొకరు విశ్వసించకపోతే ఎల్లాగ. నువ్విల్లా భయపడు తున్నావు కాని మీ కమలం ఒకరాత్రి రెండు రాత్రిళ్లూ కాదు. వరుసగా వారం పదిరోజులుండి సకల భోగాలూ అనుభవించేది. నేటి రోజున మీరు ఏ కష్టం లేకుండా ఇంత తిండితిని బ్రతుకు

తున్నారంటే నా చేతి చలువే. అది నీకింకా తెలియదు. నీ కసలు అనుభవం లేదు. అంతకంటే ప్రపంచం జ్ఞానం అసలే లేదు. నిన్ను చూస్తే నాకు జాలివేస్తోంది ఎలా బ్రతుకుతావా అని. బ్రతక నేర్చుకోవాలి. అప్పుడే నీ తెలివి తేటలను ఉపయోగించు కోవాలి. అంతే కాని ఎల్లప్పుడూ ఈ మూర్ఖత్వం ఏమిటి? అసలు ఇంతకూ మావంటివారి పరిచయం మీ వంటి వాళ్ళకి లభ్యమవుతుందా? మా పరిచయం కోసం అనేక ప్రయత్నాలు చేసి, పడిగాపులుపడి తహతహలాడి పోతున్నారు అనేకమంది. అటువంటిది నువ్వు విలువ తెలుసుకోలేక, కాదు పొమ్మంటు న్నావు" అంటూ ఒక దీర్ఘ శ్వాస తీసుకొని "చూడు మంజూ! నీకు ఏం కావాలంటే అది ఇస్తాను. బంగారపు తొడుగు తొడుగు తాను. ఇంతగా బ్రతిమాలించుకోవడం మంచిది కాదు" అని ఆమె రెండు భుజాలమీద చేతులువేసి "దా...ఎంతసేపు ఇట్లా నించుంటావు. నాకు కాళ్ళులాగుతున్నాయి. ఆ మంచంమీద కూర్చుందాం" అన్నాడు నలుబది ఏండ్ల పంచాయతీ అధ్యక్షుడు, ఇరువది ఏళ్ళ యువకునిలా శృంగారాన్ని విరజిమ్ముతూ.

మంజుల మాట్లాడకుండా అతనివెనకనే నడిచింది. ఎదిరిస్తే పశువయిపోతాడని భయపడింది. అదీలేక అతడిని ఎదిరించి బయటపడడమనేది కల్ల. యికపోతే అతను చెప్పినట్లు ప్రవర్తించి మనస్సును మార్చాలని నిర్ణయించుకుంది.

"రా మంజూ! నా ప్రక్కన కూర్చో!" అన్నాడు మంచంమీద కూర్చుంటూ.

"ఫర్వాలేదు లెండి. నేనీ సోఫాలో కూర్చుంటాను" అంటూ సోఫాలో కూర్చుంది.

"మంజూ! నువ్వింత సిగ్గుపడతావని అనుకోలేదు. అక్కని మించిన నెరజాణ వౌతావని అనుకొన్నాను. అయినా నాదగ్గర నీకింత సిగ్గెందుకు" అన్నాడు అనునయంగా.

ఆమె మనస్సులో ఒక నిర్ణయానికి వచ్చినతరువాత అతడు ఎంత అనునయం, విధేయత చూపితేమాత్రం ప్రయోజన మేముంది. అయినా అతడు కించపడలేదు. మరలా మంజులవద్దకు వెళ్ళి, సోఫా వెనుకనుంచి ఆమె ముఖమువైపువంగి గోముగా, "రా... ! మంజూ... ! కాలమంతా వృధా చేసేస్తున్నావు." అని ఒక ముద్దుపెట్టుకొని, వెనుకనుండే ఆమెను బిగియార కౌగ లించుకున్నాడు.

ఆమెలో పౌరుషం తలతన్నుకువచ్చి ఉక్రోషం ఉబి కింది. క్షణకాలంలో ఆమెలో అనేక మార్పులువచ్చి, అతన్ని ఒకతోపు తోసింది.

అతడు కైపులో వుండుటవలన కండరాలపట్లు తప్పి పోయాయి. అతడు కౌగలించుకొన్న క్షణంలో ఆమె ఏమీా మాట్లాడక పోవడంచేత, ఆ సౌఖ్యంలో మధురానుభూతితో బాహ్యాన్ని మరచిపోయాడు. ఆమె త్రోసిన తోపుకు పట్టువదలి కుర్చీలో వెళ్ళిపడ్డాడు. అప్పుడతడు తన స్థితిని గుర్తుకుతెచ్చు కొని తెల్లబోయి, మరుక్షణంలోనే రౌద్రుడయిపోయాడు. అప జయమన్నది ఎన్నడూలేదు. అతడిజీవితంలో ఈ అబల తనను నిరాకరించిందని ఊహించుకొని, తన ఓటమికి నిర్ఘాంతపోయాడు. యిది తన జీవితంలో గొప్ప విఘాతమనుకొని 'మంజూ! నేను నా జీవితంలోఎన్నడూ, ఎవ్వరిచేతా తిరస్కరింపబడలేదు. కాని ఈనాడు నువ్వు జయించావు. అయినా నేను ఓపికపట్టి సహ

సంతో నిన్ను అడుగుతున్నాను. నాలోని పశుత్వాన్ని రెచ్చ గొట్టకు. నువ్వు నన్ను కాదని ఎక్కడికీ పోలేవు. ఏమీచేయలేవు. నిన్నిక్కడ రక్షించేవాడుకూడా ఎవ్వరూలేరు. నువ్వు ప్రస్తుతం నా బందీవి. సింహాలు నావాడు. అతడు డబ్బుకు దాసుడు. ఎవరు డబ్బు యిస్తే వాడు వాళ్ళసొత్తు. నన్ను కాదని నువ్వు బయటకు పోలేవు. కనుక సవ్యంగా నా కోరికతీర్చు. నీ కోరిక నే తీరుస్తా' అన్నాడు కోపాన్ని, అనునయాన్ని జోడిస్తూ.

ఉబికివచ్చే ఉక్రోషాన్ని అణగద్రొక్కుకుంటూ సమయ స్ఫూర్తితోనే అపసవ్యంగాపోయి 'మీలోనున్న మృగత్వాన్ని రెచ్చగొట్టటంలేదు. మీలోనున్న కోపాన్ని మీరు అణుచు కోలేక మృగంవలె ప్రవర్తిస్తున్నారు. మీరింకా లోతుకు ఆలో చిస్తే దాన్ని మీరే గ్రహిస్తారు. నేను స్త్రీని, మీ కూతురు లాంటి దానిని. మీరు నాకు తండ్రిలాంటివారు. కామానికి కట్టు బడి తారతమ్యతలు, విచక్షణా జ్ఞానం వదలివేసి మూర్ఖునిలా ప్రవర్తించడం మీకు, మీ హోదాకి తగనిపని. మీరు మగ వారు. మాకంటే ఎప్పుడూ మీదే పైచెయ్యి. మీరు మీ యిష్టాయిష్టాలను వదలి మమ్మల్ని మీ పశుబలంతో ఏమయినా చెయ్యగలరు. మా అయిష్టతను ఏమాత్రం ప్రదర్శించినా క్షణి కోద్రేకంతో పశుబలంతో మామీద పడతారు. ఈవిధంగా అంటున్నానని మీరు మరోకలా తలచకండి. మీరు సర్వజ్ఞులు. పెద్దవారు. ఈ విషయాలు మీకు తెలియనివికావు. మీరు నా కోరికలు తీరుస్తానని అన్నారు. కాని, మీవలన నాకేవిధమయిన కోరికలూ లేవు. అదికూడ మీకు చెప్పేస్తున్నాను. కనుక దయ వుంచి నన్ను వదిలేస్తే, నే వెళ్ళిపోతాను. నావలన మీకు నిద్రా

భంగం, శ్రమకలగటం నాకిష్టంలేదు" అంది మంజుల నెమ్మదిగగా.

"అయితే నామాట నువ్వు వినవన్నమాట. నక్క వినయంతో దాటుకుపోదామనుకుంటున్నావేమో! చేతికిచిక్కిన తరువాత వదలిపెట్టేటంత తెలివితక్కువవాడ్ని కాను. మర్యాదగా గౌరవాన్ని, ఆత్మాభిమానాన్ని చంపుకొని నేను ప్రాధేయ పూర్వకంగా ఓరిమితో అడిగితే తిరస్కరించావు. అవును. నాదే పొరపాటు! అసలు నీ అంగీకారం నాకనవసరం. కాలమంతా వృధాఅయిపోతోంది" అని తనలో చెలరేగుతున్న తాపాన్ని అణచుకోలేక సన్నిహితమయిన సౌఖ్యాన్ని, ఆసందాన్ని చేజేతులా ఒదులుకుంటున్నామేమోనన్న వూహా మనస్సులో మెదలుతూంటే 'కాదు. అల్లాకాదు. రా! మంజూ... రా!' అని అంతంలేని పిపాశతో ఆమెమీాది కురికాడు.

ఎంతటివాడయినా కామానికి దాసుడయిపోతాడు పశువయిపోతాడు. విచక్షణాజ్ఞానం, నీతిధర్మాలు అతన్ని విడిచి దూరంగా పారిపోతాయి. అప్పటివరకు 'మనిషి' అని చాటే సద్గుణాలు ఈ కామప్రబుద్ధికి దూరమయిపోతాయి. ఏ మహా పురుషుడో కాని ఈ కామాన్ని జయించలేడు. అందుకనే వారి పిపాశముందు స్త్రీ తప్పించి మిగతా ప్రపంచమంతా శూన్యమే అయిపోతుంది.

అంత ఉద్రేకంతో అతడు ఆమెమీాదకు వురకగానే హడలిపోయి ఆమె ప్రక్కకుతప్పుకొని గట్టిగా వెర్రికేకలు వేసింది. మంజుల సోఫాలోంచి తప్పుకోగానే అతడు దానిమీాద పడ్డాడు. అతడిలో కోపం, ఉద్రేకం, ఓడిపోయాననే అవమానముతో మరింత రెచ్చిపోయాయి.

ఆమె భయంతో అతడిని తప్పించుకొంటూ గది నలు మూలలా పరుగెడుతూ ఏవిధంగానయినా బయటపడాలనే ఉద్దేశంతో తలుపువద్దకు వెళ్ళింది. కాని దాన్ని ముందుగనే బంధించివేశారు.

ఇదిచూచి 'మంజులా! నువ్వు పంజరంలో చిక్కుకున్నావు. వృధాప్రయత్నం చెయ్యకు' అని దగ్గరకువచ్చాడు విషపునవ్వు నవ్వుతూ. ఆ నవ్వులో అతడు వికృతాకారిగ, యమకింకరునిగ ఆమెకు గోచరించి భీతాహతయై ప్రక్కనున్న కిటికీ ఎక్కింది- చచ్చిపోవుటకు. "చావుకంటె శీలంముఖ్యం... చావుకంటె శీలంముఖ్యం. శీలంకొరకు ప్రాణాలనయినా బలిచేయటానికి వెనుకాడకు" అనిఅన్న అక్కమాటలు చెవులో గింగురు మన్నాయి.

అందుకామె ఆత్మహత్యచేసుకొనుటకు నిర్ణయించుకొని అతడివైపు చూస్తూ "ఆగు పశువా! ఒకఅడుగు ముందుకు వేసావో పడి చస్తా. నా నుదుటన ఈవిధంగా చావాలని ఎల్లాగా రాసివుంది. నన్ను నీవిప్పుడు వదలినా మరొకప్పుడు నన్ను అధఃపాతాళానికి అణగద్రొక్కక మానవు. ఆ నీచపుపని జరగక మునుపే పవిత్ర దేహంతో మృత్యువాత ఇరువురికీ శ్రేయస్కరం. అయితే నీవలన నేను చచ్చిపోతున్నాను.

"నాలోనూ అనేక కోరికలున్నాయి. వాటిని అనుభవించి సుఖాలను పొందాలనివుంది. కాని వాటికి నువ్వు అడ్డుపడ్డావు. అందువలన అవి తీరకముందే చచ్చిపోతున్నాను. నే చనిపోయిన తరువాత నా ఉసురు నీకుతగిలి జీవితాంతం మనశ్శాంతిలేకుండా చేస్తాను. తిన్నతిండి వంటబట్టకుండా, నిద్రలేకుండా ఆఖరుకు

నువ్వు నీరు[ త్రాగే పాత్రలోకూడ నా ప్రతిరూపంతో నిన్ను నరకయాతనలను అనుభవింపజేస్తాను. నీవంటి రాక్షసులందరికీ 'స్త్రీ - శీలం' అంటే ఎటువంటిదో స్త్రీఉసురు ఎటువంటిదో తెలియజేస్తాను" అని అంటుంటే ఆమె నిజంగా కిందకు ఉరి కేస్తుందేమోనని భయపడి ఒకటి రెండడుగులు వెనక్కివేశాడు. కాని అతడిచూపుల్లో కాంక్ష, ఉద్రేకం తాండవిస్తూనే వున్నాయి.

మంజుల క్రిందకు వురుకుటకు ఉద్యుక్తురాలగుతూ కళ్లు మూసుకుని చేతులుజోడించి నమస్కరిస్తుంటే, ఆగంతకుడు ఒక్కఉదుట్లో వచ్చి ఆమెజుత్తును పట్టుకొని, తనబాహువుల్లో ఇరికించుకొని మంచంవద్దకు తీసుకుపోయాడు. బోయవాని చేతుల్లో చిక్కినపిట్టలా మంజుల అతనిచేతుల్లో గిలగిల తన్ను కుంటోంది.

ఇంతలో గదితలుపులను దబదబా బాదినచప్పుడయ్యింది.

అసలతడు ఇదేమీ వినిపించుకునేస్థితిలోలేడు. మంజుల ఆ కిరాతకుడి బారినుండి తప్పించుకోవాలని శక్తినంతా వినియో గిస్తోంది. కాని ఫలితం కనిపించలేదు. గోళ్ళతో రక్కేసి అతడి చేతిని గొరికేసింది. వెంటనే అతడు అమాంతం ఆమెను వది లేశాడు. మంజుల నేలమీద పడిపోయింది. కుపితుడైపోయాడు. నేలమీద పడివున్న మంజులపైకి ఉరికాడు. ఇంతలో దీపం ఆరిపోయింది.

"అమ్మా !" అని బాధతో అరచిన పంచాయతీ అధ్య క్షుని కేక ఆ చీకటిలో లీనమైపోయింది.

# 7

"కమలం, నువ్వు అడ్డమైనవాళ్ళనూ నమ్మి పీకలమీదకు తెచ్చుకొంటున్నావు. అంతకంతకు నువ్వింత అజ్ఞానంలో పడి పోతావని అనుకోలేదు. ఎందుకొచ్చిన సన్మానాలు? ఎందు కొచ్చిన గౌరవాలు శీలంపోయిన తరువాత? ఆ సింహాలుగాడు ఒకడు. వాడా నీకు సోదరుడు? ఏమో! నేను నమ్మలేకపోతు న్నాను. వాడికి ఒక్కింతకూడ జ్ఞానం లేదు. పశువుకన్నకూడ హీనం. లేకపోతే తోబుట్టువుని చేతులారా మానవత్వంలేని ఒక పశువుచేతిలో వదులుతాడా? పైగా నీతులు చెపుతాడు.

"వాడామాత్రం తెలుసుకోనక్కరలేదూ! డబ్బు, హోదా ఉన్నాయని విచ్చలవిడిగా కనపడిన స్త్రీమీదకు ఉరుకుతాడా? పైగా పంచాయతీ అధ్యక్షుడు. ప్రజలకు ఆదర్శప్రాయుడు. అసలు తప్పు వాళ్ళిద్దరిదీకూడకాదు. ఇదంతా నీవలననే జరిగింది. నీవు ప్రతిదానికి అలుసుయిచ్చావు. అదిగమనించి వారందరూ మీాద పడుతున్నారు. ఆ మూర్ఖుడేమన్నాడో చూడు, "నాకు నీతి నిజాయితీలు లేవట. నీవద్దకు వచ్చేవాళ్ళందరూ నీ మొగుళ్ళే నట. అందువలన మంజులమీాద వాడికి అధికారముందట. ఒక రోజూ, రెండురోజులూ కాకుండ వారాలతరబడి నువ్వు వాడింట్లోవుండి, సమస్తభోగాలతో కులుకుతూ వుండేదానవట" అదేవిధంగా మంజులను కూడ వుండమని ఆ మూర్ఖుడు పశు

బలంతో మంజులను, - నీవు 'శీలము...శీలము' అని ఘోషి స్తున్నా చిన్నారి ముద్దుచెల్లెలు, గానకోకిల, నాట్యవిశారదను నేలమీాద పొర్లిస్తూ ఆమెమీాదకు లంఘించాడు" అని ఫణిబాబు చిలువలుతోనూ, పలవలతోను చెపుతుంటే "ఆగు ఫణిబాబూ! ఆగు" అని చెవులు మూసుకొని గాద్గదికంగా అరచింది.

ఫణిబాబు అదిరిపడ్డాడు. అంతలోనే తమాయించుకుని "అవును. నువ్వు ఏడుస్తావని' ఇవన్నీ వినలేవని నాకు తెలుసు. కాని వాటిని నా హృదయంలో దాచుకొని, భారంతో బరువెక్కి విరామంలేకుండా వున్నాను. గతించింది జ్ఞప్తికి తెచ్చుకుంటూ, భావికి సరియైనమార్గం వెతుక్కుంటూ చొచ్చుకుపోవాలి! నీవు అసలు ఈ భారమంతా మొయ్యాలి. ఆమెబాధ్యత నీది. అందు కనే కంటకమైన వెనుకజరిగిన జీవితాన్ని గుర్తుంచుకోవాలని నీకు అక్కడి సంగతులు వివరిస్తున్నా.

"నీవు నాతో ఉదయాన్ని ఈ సన్మానాన్ని గురించి చెప్పావు. నేనూ ఆనందించాను. ఎందువల్లనంటే ఒక గౌరవ మైన హోదాకలిగిన వ్యక్తిచే మన మంజుల గౌరవింపబడు తోందంటే నా హృదయం సంతోషంతో నిండిపోయింది. వెళ్ళి చూడాలనుకున్నాను. కాని అందుకు నే నోచుకోలేకపోగా ఈ పాపిష్టిక్రియని కళ్ళారా చూచాను.

"అసలు జరిగినదంతా వివరంగా చెప్తాను విను.

"మంజుల సాయంకాలం ఇక్కడనుండి బయలుదేరిన గంటకు నీవుచెప్పిన ఆ నీచుడిసంగతిని, నీ అనుమానాన్ని పుర స్కరించుకొని వాడింటికి చేరుకున్నాను. వాడినౌకరుకు కొంత ముట్టజెప్పి మరోయిద్దర్ని అక్కడికి తీసుకువెళ్ళాను. చాలా

రాత్రివరకు సన్మానమునుండి వారు తిరిగిరాకపోయ్యేసరికి మంజులను సింహాలు నీవద్దకు తీసుకువచ్చాడనుకున్నాను. ఇంక అక్కడినుండి వచ్చేద్దామనుకుంటుంటే హోరునవర్షం కుండపోతగా మొదలెట్టింది. వర్షం తగ్గినపిమ్మట బయలుదేరవచ్చునని వుండిపోయాను.

"ఇంతలో నేనొకరువచ్చి అయ్యగారూ, మంజులమ్మగారు, సింహాలు వస్తున్నారని చెపితే మేము చీకటిలో మేడమీదకి కలిసిపోయాము.

"గదిలో వాళ్ళల్లోవాళ్ళు గొడవపడ్డారు. సింహాలు నానా మాటలూ ఆడాడు నిన్నూ, మంజులనూ. వాడిమాటలు చాలా దూరం పోయాయనుకో, అవి ఇప్పుడు అవసరంలేదు' అని ఒక సారి చిన్న దగ్గుదగ్గి కమలంవైపు చూచాడు. ఆమె కొయ్య బొమ్మలా కూర్చొని ఫణిబాబు చెప్తున్నది వింటోంది.

"ఉన్నట్టుండి సింహాలు బయటకు వచ్చేశాడు. కాంతిగా వెలుగుతున్న దీపం తగ్గిపోయింది. బయటకువచ్చిన సింహాలు గదివద్ద వెంకన్నను కాపలావుంచి వెళ్ళిపోయాడు. నాతోవచ్చిన ఇద్దరువ్యక్తులు యమభటుల మాదిరిగ వాడిని వెంబడించారు. దానికితోడు వారికి బయటివాతావరణం అనుకూలించింది. వారికి తగినంతడబ్బు ముందరే ముట్టచెప్పడంవలన, పూర్వం నుండి సింహాలికి వారికి ఏవో కక్షలు వుండటంచేత వాడిమీద విరుచుకుపడ్డారు. ఇప్పుడు వారికీ సమయంకూడ చాల అనుకూలించింది.

"ఇక సింహాలు గొడవ మనకి ముగిసింది. మన జీవిత రంగములోనుండి వాడు తొలిగిపోయాడు" అన్నాడు తాపీగా

ఫణిబాబు కమలంవైపు తీక్షణంగా చూస్తూ, బహుశా అతని చూపులవల్ల కమలంలో సింహాలునుగూర్చి ఏవిధమైన కలవరం పొడచూపుతుందో గ్రహిద్దామని.

ఫణిబాబు నిశితమైన చూపులకు, మాటలకు కమలం 'ఆ...!' అని ఒక్కసారిగా గతుక్కుమని అది కనిపించనీయకుండా సర్దుకుందామని అనుకొందిగాని ఫణిబాబు చూపుల్లోంచి అనుకున్నట్లు తప్పించుకోలేక పోయింది.

ఇది గమనించిన ఫణిబాబు "ఎందుకే కలవరపడి కప్పిపుచ్చుకోవాలనుకుంటున్నావు? వాడిని దయదలిచామంటే మనలను బ్రతకనీయడు. ఇప్పటివరకు వాడు నీకేవిధంగా తోడ్పడ్డాడో ఒకసారి మననంచేసుకో. నీకు సింహాలును ఆ విధంగా చేయడం ఇష్టంలేదా? అసలు నా అనుమానం వాడు నీకు సోదరుడుకాడని" అని అంటూ మరల కమలం ముఖంలోకి చూచాడు.

కమలం ఈ మాటలకు వెలవెలపోయింది. భయంతో "ఏమిటె ఫణిబాబూ నువ్వంటున్నది? తెలుసుకునే మాట్లాడుతున్నావా!" అంది.

ఆమె కలవరపడి భయపడ్డం గమనించి "సింహాలూవాళ్ళు వెళ్ళిపోయిన తరువాత మంజుల వాడ్ని బ్రతిమాలుకుంటోంది. ఈమారు నేను గదితలుపువద్దకువెళ్ళి వింటున్నాను. వాడామె మాటలను ఖాతరుచేయకుండా మంజులను రాక్షసత్వంతో బలాత్కరించబోతూంటే వాడ్ని తప్పించుకొని బయటకు పారిపోదామని యత్నించింది. కాని ఆ సాలెగూడులోంచి తప్పించుకోలేక వాణ్ణి నానామాటలు అని తనవుసురు తన జీవితాంతం

ఏడిపిస్తుందని శపించి చచ్చిపోదామని కిటికీ ఎక్కింది.

అప్పుడు నాకు ఏంచెయ్యడానికి పాలుపోలేదు. తలుపులు తీసి ఆమెను రక్షిద్దామని ప్రయత్నించి ఆమెవద్దకు వెడితే, తనకు దక్కలేదుకదా అన్న వుద్దేశంతో వాడు నాకంటె ముందుగా ఆమెవద్దకు వెడతాడు. మంజుల 'ఒక్కఅడుగు వేసేవో-తక్షణం వురికిచస్తా' అంది. అందువల్లనే భయపడి, జరగవలసిందేదో జరక్కమానదని దైవంమీద భారంవేసి అయోమయంగా మాట్లాడక నిలబడ్డాను. తలుపులు బాదాను. దానిఫలితం శూన్యం.

ఇంతలో ఆ కిరాతకుడు మంజులను ఏవిధంగానో పట్టుకున్నాడు. ఆమె పిచ్చిగా కేకలు వేసింది. బహుశా ఈసారి వాడు నిజంగా మానవత్వాన్ని వదలివేశాడేమోనని అనుకున్నాను. ఇంతలోకే 'దబ్బున' శబ్దంవస్తే నెమ్మదిగా తలుపులు తెరిచాను. కన్నులున్నా కానకుండా కామంతో కొట్టుమిట్టాడుతున్నవాడు యిదేమీ గమనించలేదు. మంజుల నేలమీద పడివుంది. వాడు కోపంతో మంజులమీదకి వురికాడు. తలుపులు వేయటంవలం బయటినుండి వచ్చినగాలికి దీపం ఆరిపోయి నాకు మరింత అవకాశం యిచ్చింది. అంతే, ఒక్కగెంతులో వాడివద్దకుచేరి, ఆ పాపాల్భైరవుడి తలమీద శక్తికొలది ఒక్కటి బాదాను. వాడు 'అమ్మా' అంటూ స్పృహతప్పాడు. గబగబా మంజులను తీసుకువచ్చేశాను. దైవం మనల్ని వెన్నంటివున్నాడు. కాబట్టి ఆమెను రక్షించగలిగాను. కాని, అప్పుడు మంజులరూపం నా హృదయాన్ని కదల్చివేసింది. నాకు తెలియకుండానే కన్నీటిబొట్లు రాలాయి. కాని మనస్సు దిటవుపర్చ

కున్నాను. అసలే మంజుల హడలిపోతోందని. అప్పుడు నామీద నాకు తగనికోపం వచ్చింది. ఆ తుచ్ఛులుచేసే సన్మానానికి మురిసిపోయి మంజులను నరకకూపానికి తెలుసుండి కూడా పంపావని. సరేలే జరగవలసిందేదో జరిగిపోయింది. ఇంకెన్నను కుంటే లాభం ఏముంది? కాని, సవ్యంగా మన మంజుల మనకు దక్కింది. అంతే" అని గతరాత్రి జరిగిన సంగతులన్నీ కమలానికి వివరించాడు.

కమలం ఏమీ మాట్లాడలేదు. ఆమెముఖం విచారంతో వెలవెలలాడిపోతోంది. చాలసేపు వారిద్దరూ మౌనంగానే వుండిపోయారు.

నిశ్శబ్దాన్ని భేదిస్తూ "చూడు కమలం! ఈరోజున మన అదృష్టం బాగుండి అన్నింటికిమిన్న దైవసహాయం లభించడంవలన మంజులను రక్షించుకోగలిగాం. ఇటుపయిన పరిస్థితులు విషమించిపోవచ్చు. మనకు మిత్రులకంటె శత్రువులధిక మయిపోయారు. ఇల్లువిడిచి బయటికి వెడితే పగబట్టి, పడగలు విప్పిన కాలనాగుల్లా బుసలుకొడతారు. ఒకటి రెండురోజులు వారిబారినుండి తప్పించుకున్నా తరువాత మనతరంకాదు. ఏదో ఒకనాడు మనలను నాశనంచెయ్యకపోరు. కొన్నిరోజులకు కొట్లాటలు, ఖూనీలు జరిగి నెత్తుటేరులు ప్రవహిస్తాయి. ఎందుకంటే?–కారణం గోచరించదు. ఈ ఖూనీలు పనిలేకాఅంటే–అది కాదు, కక్ష. ఎందుకాకక్ష?–ఒకస్త్రీని పొందుటకు, వాడు అనుభవించాలన్న స్త్రీ అందుకు ప్రతికూలంగా వుండుటవలన. ఇదే మనకు కనిపించే సమాధానము.

సంఘం యింత నీచపరిస్థితిలోకి దిగజారిపోయింది. కనుక

ఈ నీచులనుండి తప్పించుకోవాలంటే నాకు ఒకటే మార్గం కనిపిస్తున్నది" అని కమలంవైపు తిరిగి "చెప్పనా?" అన్నట్లు చూచాడు ఫణిబాబు.

కమలంలో అదేమిటో తెలుసుకోవాలనే కుతూహలం పొడసూపింది. కొంచెం ముందుకువంగి "నువ్వు చెప్పింది అక్షరాల నిజం. మమ్మల్ని మేము రక్షించుకోలేనంతస్థితిలోకి తీసుకు వచ్చారు ఈ నీచులు. అందుకు భగవంతుడు అడుగడుగునా నిన్ను మాకు చూపెట్టాడు. పాలముంచినా నీటముంచినా నీదేభారం" అంది కమలం.

"అదిసరేలే! నే చెప్పినట్లే వినాలి నువ్వు. ఎవరికి ఏ అపాయంలేని మార్గం అది."

"ఎందుకు అనుమానిస్తావు ఫణిబాబు? నా భారమంతా నీదేనన్నానుగా !"

"అయితే విను. వచ్చేవారం మా అన్నగారు ధర్మారావు జన్మదినోత్సవం. ఆయన్ని నువ్వు చూసివుండవుగాని వినేవుంటావు. ఆయన కళాపోషకుడు, అపారకళాభిమాని. కనుక ఆరోజు మన మంజులచే నాట్యప్రదర్శనము ఏర్పాటు చేయిస్తాను. మంజుల ఆయన అభిమానాన్ని చూరగొంటుందనే నా నమ్మకము. అటుపయిన మన అదృష్టము.

"ఆమెను తప్పక ఆదరిస్తాడు. అప్పుడు ఆమె తనకళకు మరింత ప్రావీణ్యత సమకూర్చుకొనే అవకాశము లభిస్తుంది. అదీకాక మా అన్నగారి స్నేహితులలో అనేక మంది కాకలుతీరిన కళాకారులు, కళాభిమానులు వున్నారు. వారిలో ఎవరికయినా మంజులనిచ్చి వివాహం చేయవచ్చు. మా అన

గారి పరిచయంతో మీ కుటుంబానికి అంతులేని ఆశ్రయం కలుగుతుంది. ఏమంటావ్" అని కమలంవైపుచూచి కొంతసేపు ఏదో ఆలోచిస్తున్నట్లు తలవంచుకొని "ఇందులో పెద్ద నిర్బంధ మేమీలేదు. ఈ విధంగాచేస్తే ఈ రాడీమూక గొడవలు వదిలి పోయి మంజులకు రక్షణ కల్పిచినట్లుంటుంది. అప్పుడు నువ్వు నిశ్చింతగా వుండవచ్చు" అన్నాడు.

ఫణిబాబు మాటలకు కమలం హృదయం సంతోషంతో నిండిపోయి కృతజ్ఞతతో కనులను క్రిందికి దించింది. మంజుల సుఖమే తనసుఖమనుకునే కమలానికి, యింతకుపూర్వం ధర్మారావు మనస్సులో మెదలినా, అది సాధ్యంకానిపని అని తలచి నిరాశకు లోనయింది. కాని ఫణిబాబు యిప్పుడు తన నిరాశలను తొలగించి తన జీవితానికి వెలుగుబాటనువేసి మంజుల జీవితంలో అమృతం చిలికించాడు. అందుకే ఫణిబాబు ఎడల అంత కృతజ్ఞతను చూపింది. కట్టలుత్రెంచుకొని పారలే సంతోషాన్ని అణచుకోలేక ఫణిబాబునుదుటన చేతితో తడిమి అక్కడినుండి వెళ్ళిపోయింది.

విజయం పొందేనన్నట్లుగా ఓ చిరునవ్వు నవ్వుకున్నాడు. తను అనుకొన్నవన్నీ సక్రమంగా జరిగేయని, భారం తొలగి పోయిందని. తలను ఒకసారి చేతితో తడుముకొని, చేతులు విదుపుకొని నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

# 8

ధర్మారావు గృహమంతా అలంకరణలతో నిండి పోయింది. ఆహ్వానితుల సందడిలో కలకలలాడుతోంది. ఎవరికి వారే ఉత్సాహంగా తిరుగుతున్నారు. ఆహ్వానితులు అందరిని సారథి తగువిధంగా గౌరవించే బాధ్యతను తీసుకొన్నాడు. అలంకరణబాధ్యత అంతా మధుది. ఆ భవనంలోని ఒక్కొక్క గదిని ఒక్కొక్కమాదిరిగ అలంకరించాడు ఏగదిలోని అలంకరణ ఆ గదికే ప్రత్యేక ఆకర్షణీయంగా వుంది. 'ఇది బాగు లేదు, అది అన్నిటికంటె బాగుంది' అని ఆ గదిలోని ప్రత్యేకతను, బాగోగులను నిర్ణయించటం కష్టం.

ఒక్కొక్కగదిలోనికి వెడితే ఒక్కొక్క అనుభూతి కలుగుతుంది. మానవుని మనస్తత్వాలు విభిన్నప్రవృత్తులలో వుంటాయి. అయితే ఒక సాధారణ నగ్నసత్యాన్ని నిరూపిస్తే విభిన్న మనస్తత్వాలుగల మానవులు ఒక నిశ్చితాభిప్రాయానికి వస్తారు. అప్పుడే వారు ఏకానుభూతులవుతారు. మధు అలంకరణ ఆ విధంగా అందరినీ ఏకానుభూతుల్ని చేసింది.

ఆరోజు ధర్మారావు ఒక్కనికేకాదు, అక్కడికి వచ్చిన ప్రతివ్యక్తికి శుభదినమే. ఎందువల్లనంటే, ఆ వాతావరణం అటువంటిది. ప్రతిఒక్కడు ఆదమరచి సంతోషంగా కాలం గడిపేరు. పిన్నాపెద్దా బీదాగొప్పా అనే ఆధిక్యతలను, అంతస్తులను ఆ సమయంలో అందరూ మర్చిపోయారు. మధు గీసిన

చిత్రాలు ఆ విధంగా వున్నాయి. కర్కశుల అమానుషత్వం ధనమదాంధకారుల అక్కసు, బీదలపాట్లు, కామాంధకారుల కండకావరము, వెలుపలికితీసి, వాటికి గురియగుచున్న అభాగ్య జీవులను వేలెత్తి చూపుతున్నాయి ఆ చిత్రాలు. ఎలాంటి పాషాణహృదయుడికయినా వాటిని చూచేసరికి హృదయం ద్రవించి వెలవెలలాడుతుంది. మానవత్వం మేల్కొంటుంది. అవును! పాషాణంకూడ సతతజలధారలకు కరగకమానదు! అది సత్యం!! దారితెన్ను తోచక అంధకారంలో అలమటించి పోతున్న హృదయాలకు కాంతిపుంజమై వెలుగుబాటను నిర్మింప జేస్తాయి ఆ చిత్రాలు.

విందులు, బహుమతి ప్రదానములు ముగిశాయి. ధర్మా రావు, సారథి మధుకి సన్మానముచేశారు. అతడి చిత్రాలు అపూర్వమని. మధు చిత్రకారులలో మణిపూసవంటివాడని, ఆంధ్ర మాతను తీర్చిదిద్దగల వరపుత్రుడని పరిపరివిధాల పొగిడారు.

మధు తనజీవితంలో యిటువంటి అదృష్టం కలుగు తుందని కలలోకూడ అనుకోలేదట. ఇందులో తనగొప్ప ఏమీ లేదని, అదంతా దైవానుగ్రహమని, తన కళను రాణింప జేసిన ధర్మారావు, సారథిల ఆదరాభిమానములే అని, ఒక ప్పుడు తను తినడానికి తిండిలేక, ఊరు పేరులేక తిరుగు తుంటే ఆదరించినవారిఘనతని, తాను నిమిత్తమాత్రుడని మధు అతివినయంగా కృతజ్ఞత తెలుపుకొన్నాడు.

సన్మానమయిన తరువాత మంజుల నాట్యప్రదర్శ నం ఏర్పాటుజేశారు. ఆమె నాట్యంచేస్తున్నంతకాలం ప్రేక్ష

కులు మంత్రముగ్ధుల్లా కూర్చుండిపోయారు. ఆమె గానామృతం గ్రోలుతూ వారిహృదయాలు ఊహాలోకంలో తేలిపోయాయి. అక్కడ చేరినవారు "ఈరోజు జన్మలో మర్చిపోలేము" అనుకొన్నారు. అమరలోకం చూడగలిగేరు. ధర్మారావు సారథిల ఆదరాభిమానములు, మధు, మంజులల కళాకౌశలము వారినా విధంగా పరవశుల్ని చేసింది.

సందడి అంతా తగ్గింది. రాత్రి పదకొండుగంటలైంది. మంజుల తనకై ఏర్పాటుచేసిన గదిలోనికి వచ్చింది. అప్పటికే కమలం, ఫణిబాబు కూర్చుని ఏదో మాట్లాడుకుంటున్నారు.

మంజుల నాట్యాలంకరణాలను తీసివేసి, దుస్తులనుమార్చుకొని అక్కగారి ప్రక్కకువచ్చి కూర్చుంది.

ముగ్గురి మనస్సులు ఉల్లాసంగా వున్నాయి.

"కమలం ! యీరోజు మా అన్నయ్య జీవితంలో అపూర్వమయిన మరపురానిదినం. నాకు నేను ఇంత సంతోషం ఎప్పుడూ అనుభవించలేదు. మా అన్నయ్య అదృష్టవంతుడు. పేరుకు తగ్గట్టుగా ధర్మరాజు. ఒకరికి అపకారం చెయ్యడు. ఒకరు ఆయనకి అపకారం చేయాలని తలపెట్టరు. సరే! ఆయన గురించి నేను చెప్పుకోవడం ఏమంత మంచిదికాదు" అని కొంతసేపాగి మంజులవైపు ఒకసారిచూసి, కమలంతో "ఈరోజు నీ హృదయాన్ని కదల్చివేసిన సంఘటన ఏమిటి ? ఇక్కడకు వచ్చిన ప్రతిఒక్కరి హృదయం అటువంటి అనుభూతి పొందుతుంది" అన్నాడు వుత్సాహంగా ఫణిబాబు.

కమలం ఏదో ఆలోచిస్తూ కూర్చుండి పోయింది.

"అదేమిటి కమలం! యీరోజు జరిగిన వేడుకల్లో నీకు నచ్చినదేలేదా?" అని మరల ప్రశ్నించాడు.

ఈసారి "జవాబు దొరకటంలేదు. చెబుదామంటే" అంది కమలం.

"అంటే! నీకు కావలసినది దొరకలేదనేగా. దానికేం. నే నున్నానులే. మనిద్దరికి ఈ జీవితంలో..." అని ఫణిబాబు ఇంకా ఏదో అనబోతూంటే—

"ఫణిబాబూ!" సన్నగా అరచింది కమలం.

ఉక్కిరిబిక్కిరి అయ్యాడు సంతోషంతో. ఆమెకు కోపం తెప్పించడమే ఇటువయిన ఫణిబాబుకి ఓ ఆట.

"ఫణిబాబూ! నీ గుణం నువ్వు పోనిచ్చుకోలేదు. నేనంత కామంతో కళ్ళుపడి, ఒళ్ళు కొవ్వెక్కి కొట్టుకోవటంలేదు. నీవు నన్ను సరిగా అర్థంచేసుకోలేకపోతున్నావు."

అమాయకతను స్ఫురింపచేస్తూ "క్షమించు" అని తిరుగు లేని బాణం వదిలాడు.

చిరాకుతో ముడుచుకుపోయిన కమలంమనసు 'క్షమాప ణాస్త్రం'తో వికసించింది.

"అదికాదు ఫణిబాబూ! ఈరోజు నాకొక పర్వదినం. నన్ను నేనే మర్చిపోయానంటే నమ్మ. అశాంతితో తల్లడిల్లి పోతూన్న నా మనస్సుకు, ఈరోజు జన్మలో మర్చిపోలేని ప్రశాం తతకల్గింది. అందుకే నేను, ఈ సంఘటన నాకు నచ్చింది అని చెప్పలేకపోయాను నీ వడిగినప్పుడు. దానికి నువ్వు అపార్థంచేసు కొని నన్ను నొప్పించి నువ్వు బాధపడ్డావు.

"శాంత సౌమ్య గాంభీర్యముతో నిండిన మీా అన్నగారి

ముఖవర్చస్సును చూడగానే నాలో రగులుకొన్న అశాంతి పటా పంచలయ్యింది.

"ఇక మధుగారి చిత్రాలు నన్నీలోకంనుండి వేరుపరచి ఏవేవో లోకాలకి తీసుకుపోయాయి. ఆ చిత్రాలలో యిమిడి వున్న భావాలు బహుశా నా చిన్నబుర్రకు అర్థమయ్యుండక పోవచ్చు. నా మంజు గానం నన్ను ఆనందాబ్ధిలో నోలలాడించింది. ఆమె గానం ఆనందసాగరమయితే, ఆమె నాట్యం ఆ సాగరంలో రత్నాలు, వజ్రాలు పొదగబడిన బంగారునావ. ఆ నాట్యం చూస్తున్నంతసేపు, నేనా నావలో కాంక్షలకు, పాప దుఃఖములకు, అవినీతికి అతీతమయిన మధు నిర్మించియిచ్చిన లోకంలో సౌఖ్యం అనుభవిస్తూ విహారం చేస్తున్నట్లుంది. ఈ అనుభూతుల్ని విడమర్చి చెప్పగల శక్తి నాలో లేదు. అందుకే నీవడిగిన ప్రశ్నలకు జవాబు ఏవిధంగా చెప్పాలా? అని ఆలోచిస్తు న్నాను ఫణిబాబు!" అంది కమలం, ఫణిబాబువైపు తిరిగి నీ అనుభూతి ఏమిటో అన్నట్లు ప్రశ్నార్థకంగా చూస్తూ.

ఫణిబాబు కమలం చూపులకు సమాధానంగా ఒక నవ్వు నవ్వాడు.

కమలం గతుక్కుమంది. ఆమెలో ఏదో శంక మెరుపు తీగలా మెరిసింది. ఆ నవ్వు పూర్వపు నవ్వువలె వుంది. అది కక్ష, ఆకాంక్షలతో నిండివున్న విషపునవ్వువలె ఆమెకు గోచరించింది.

ఫణిబాబు ఆమె కంగారును, ఆమె ముఖంలోని మార్పులను గమనించాడు. ఆవని క్షే ప్రేగులను లెక్కపెడతాడు. అతనికి కావలసిందికూడ తనను, తన భావాలను కమలం అర్థంచేసు

కోవడమే. అందుకతడు మరల చిన్న చిరునవ్వు నవ్వుతూ "కమలం బాగాచెప్పావు. నే చెబుదామనుకున్న దే సరిగా తు. చ. తప్పకుండా నీవే చెప్పేశావు. నిజమే! మన ఇద్దరిమనస్సులు, హృదయాలు ఒకటయి నిలచినప్పుడు ఒకరిభావాలు మరొకరికి తెలియకుండా వుంటాయా ?" మంజులవైపు చూశాడు.

మంజులకు వీరిమాటలు, వీరి వాదాలు చికాకుపరచాయి. ఏమాత్రం అర్థంకాలేదు. అందువలన ఆమె ఏమీ మాట్లాడ కుండా అక్కడినుండి లేచి వెళ్ళిపోయింది.

ఫణిబాబు చూపులను అర్థంచేసుకొన్న కమలం "అవును నీవుచెప్పిందీ నిజమే. యిద్దరి మనస్సులు, హృదయాలు కలసి పోయినతరువాత ఒకరి మనస్సులోని ఆలోచనలు, భావాలను దాచినా మరొకరు తెలుసుకోనటం ఏమంత కష్టంకాదు. ఏమం టావ్ ఫణిబాబూ ?" అంటూ అతనివైపు చూడగానే ఫణి బాబు కంగారుపడ్డాడు ఆమె గ్రహించిందని.

ఫణిబాబు ఆవలిస్తే ప్రేవులు లెక్కబెడితే, ఆ ప్రేవుల్లో ఏఏ పదార్థములున్నవో చెప్పగల సమర్థురాలు కమలం. ఒకర్ని మించినవారు మరొకరు.

సంభాషణ త్రుంచివేయాలన్న ఉద్దేశంతో "చాలా రాత్రి గడిచింది, వెడతాను" అంటూ ఫణిబాబు వెళ్ళి పోయాడు.

"మంజూ... మంజూ...!" అంటూ కమలం మంజు వద్దకు వెళ్ళింది. మంజుల తన చిత్రాన్ని చూచుకొంటూ తన్మ యత్వంలో పడిపోయింది. కమలం ఆశ్చర్యంతో "మంజూ"

అంటూ ఆమెను కుదిపింది. తత్తరపాటుతో మంజుల నవ్వుతూ ఏదో అపరాధం చేసినదానివలె లేచి నిలబడింది. ఆమె తత్తర పాటుకి కమలం నవ్వుతూ, సోఫాలో కూర్చొని మంజులను తన ప్రక్కన కూర్చోబెట్టుకుంటూ - "ఏమిటెమంజూ! నీ చిత్రాన్ని నువ్వే చూచుకొని మురిసిపోతున్నావు, యిన్నాళ్లు నీరూపాన్ని నీవు చూసుకోనట్లు?" అంది హాస్యపుధోరణిలో...

మంజుల సిగ్గుపడింది. నిజమే. తన్ను తానే మర్చిపోయి నట్లుగా వుంది యీ చిత్రాన్ని చూస్తుంటే. తన రూపం ఇంత అందంగావున్నట్లు, ఆ చిత్రాన్ని చూచేవరకు తెలియనే తెలియదు.

"చూడక్కా! యీ చిత్రంలో ఆయన నాలోలేని అందాన్ని ఎల్లా సృష్టించారో!" అని కమలంచేతికి యిచ్చే సింది.

నిజంగా ఆ రేఖాచిత్రం అంత అందంగానూవుంది. దానికే రంగులువేస్తే మరింకెంత గొప్పగావుంటుందో. అది నాట్యంలోని ఒక భంగిమ. నిజంగా మంజుల నాట్యంచేసేటప్పుడు ఆ భంగిమ రెండుమూడు లిప్తకాలంకంటె ఎక్కువ వుండదు. ఆ భంగిమలో హావభావాలను వ్యక్తమౌతాయి. యిప్పుడా చిత్రంలోని రేఖలుకూడ భంగిమతోపాటు, హావభావాలు సరిగా వ్యక్తపరుస్తున్నాయి. అందుకే ఆచిత్రం అంత చూడ ముచ్చటగావుంది. కొద్ది లిప్తలకాలముండే ఆ భంగిమను చిత్ర కారుడు, తన మనోఫలకముపై మొదట చిత్రించుకొంటేనేగాని వేయలేడు.

మంజులచేతికి చిత్రాన్ని అందిస్తూ "చాలా కష్టమేనే

ఈవిధంగా చిత్రించటం. నిశ్చితమయిన మనోభావాలుకల చిత్ర కారుడుగాని ఈవిధంగా చిత్రించలేడు" అంది! కమలం.

"నేను నాట్యంచేసి వచ్చేస్తుంటే, 'ఒక కళాకారుడు మరొక కళాకారిణికిచ్చే చిరుకానుకగా తీసుకోమని, యింతకంటె తను పెద్దకానుకలను సమర్పించేస్థితిలో లేను' అని చెప్పి, మధు గారు నాకు బహుమతిగా యిచ్చారు. ఆయన ఎంత నిరాడంబ రుడో చూడు. ఆయన్ని చూసిన ప్రతివారు ఎవరో సామాన్యు డనుకుంటారుగాని, యింతటి గొప్ప చిత్రకారుడనుకోరు. ఆయన మాటల్లో ఏమాత్రం దర్పం గోచరించదు. మనం ఆయన కొన గోటికికూడ తూగమనిపిస్తోంది" అని తన హృదయంలో మధును గూర్చి ఊహించుకున్న వూహాలను అక్కకి వ్యక్తంచేసింది.

మంజుల అమాయకత్వానికి లోపలే నవ్వుకుంటూ "ఆయన దర్పంలేకుండ, నిరాడంబరుడుగ వుంటాడు కనుకనే, ఆయనచేతిలో కళ అంతగా రాణించి ఆయన్ని అంత గొప్ప చిత్రకారునిగ చేసింది. అందుకే ఆయన కళాకారులందరకూ ఆదర్శమూర్తి, తలమానికం. ఆయన అడుగుజాడల్లో నడిచిన వారు, తప్పకుండా ఆయనంతటివారవుతారంది.

తరువాత వారిద్దరిమధ్య ఏమాటలూ లేకుండ చాలా కాలం గడిచిపోయింది. అర్థరాత్రి అవ్వటంచేత మంజులకు ఆవలింతలురాగా "నే పోయి పడుకుంటాను అక్కా!" అని లేవ బోతూంటే——

"నువ్వు చేరవలసినచోటుకి చేరావు. నేను చెప్పేది సరిగా విను. భగవంతుడు యిన్నాళ్ళకు మనల్ని కనికరించేడు. మనల్ని అదృష్టం వరించింది. ఆ అదృష్టాన్ని మనం నిలబెట్టు

కోవాలి. ధర్మారావు హృదయాన్ని నీ నాట్యం చూరగొన్నది. అందుకే యిక్కడ నీకు స్థానం లభించింది. మధుకూడ నిన్ను చాల అభిమానిస్తున్నాడు. సాధ్యమయినంతవఱకూ వారి ఆద రాభిమానాలకు దూరముకాకుండ మసలుకో. పురుషునకు ఆడది కనిపిస్తే కోతికి కొబ్బరికాయ దొరికినట్లు వారిమనస్సు చలి స్తుంది. నాకు ఎందువలననో ఫణిబాబుమీద అనుమానం పొడ సూపుతోంది. అసలు అతడు చపలచిత్తుడు. పైగా గోముఖ వ్యాఘ్రం. అతడి ఆలోచనలు, ధోరణిలు నన్ను కలవరపరుస్తు న్నాయి. యిప్పుడు అతడికి చాల దగ్గరగావున్నావు. కాని నువ్వు భయపడవలసిన అవసరం ఏమీలేదు. ధర్మారావుగారు నీకు కవచం. నా కదే ధీమా. నేను అయితే అబలను. నిన్ను రక్షిం చడంకూడ నా తరంకాదు. ఈ పవిత్రప్రదేశంలో నీకేం భయం లేదు. కాని జాగ్రత్తగవుండాలి. నేను రేపు వెళ్ళిపోతాను. సాధ్యమయనంతవరకూ ఫణిబాబు నీతో మాట్లాడుటకుగాని, నీ వున్నచోటుకి వచ్చుటకుగాని ఏవిధమయిన అవకాశం యివ్వకు. యిక్కడున్న పెద్దలతో పరిచయంచేసుకోటానికి ప్రయత్నించు. వారి పరిచయమే నీకు అంగరక్షగా వుంటుంది. మధువలె పేరు ప్రఖ్యాతులు తెచ్చుకో. ఈ శరీరం, డబ్బు మానవునకు శాశ్వతంకాదు. మనం నిర్మించుకొన్న ఆశయాలకు ఒక రూపం యిచ్చిననాడే మన బ్రతుకులు సార్థకమవుతాయి. ప్రాణాపాయ పరిస్థితులలోకూడ మన ఆశయాలను విడువనప్పుడే మనం అను కొన్నది జయించకలుగుతాం. అప్పుడే మానవునకు ఘనత.

"నీకు యింతగా చెప్పవలసిన అవసరం లేదుగాని, నా ఆరాటం నాది. ముఖ్యంగా ఫణిబాబుని గుర్తుంచుకో" అని లేచి

మంజులజుత్తును మృదువుగా నిమురుతూ "పోయి పడుకో. అనవసరమయిన కలతలతో నీ మనస్సునుకూడా కలవరపరుస్తున్నాను. ఆరోగ్యం దెబ్బతింటుంది. ప్రతిరోజూ ఎక్కువకాలం మెలుకువగావుండకు" అంది కమలం.

మంజుల ఏదో ఆలోచిస్తూ పక్కమీద వాలి నిదురపోయింది.

ధర్మారావు జన్మదినోత్సవంలో కమలం, మంజుల ఎప్పుడైతే అడుగుపెట్టేరో, అప్పుడే అక్కడ పాల్గొన్న సంఘపెద్దలలో సంచలనం కలిగింది. వాళ్ళలో కోరిక రేకెత్తింది. కాని ఆ కోరిక అంతలోనే అంతంకాగా కక్ష తలయెత్తింది. దానికి కారణం లేకపోలేదు.

అక్కడున్న పెద్దలందరూ కమలాన్ని ఆస్వాదించినవారే. కాని వారి కాంక్ష అక్కడతో తీరలేదు. మంజులపైకూడ పడింది. ఎంతడబ్బైనా వెచ్చిస్తామన్నారు. దానికి కమలం, "డబ్బుతో స్త్రీశీలం పొందుటకు, యిది బజారులో దొరికే ఆభరణంకాదు" అని తన అభిప్రాయం చెప్పింది. ఆమె నీతులకు ఆగ్రహావేశపరులై చిందులుత్రొక్కేరు. ఫలితం శూన్యమైంది. యాచించారు. తిరస్కృతులైనారు! తోకత్రొక్కిన త్రాచులా ఉక్రోషంతో బుసలుకొడుతూ భయపెట్టారు. మంజుల శీలమే మంజులను కాపాడుతుందని తలచి వారి బెదరింపులకు బెదరలేదు

కమలం, మంజులల ప్రక్కన ఫణిబాబు లేకపోతే ఏంచేసి ఉండేవారో కాని, యిప్పుడుమాత్రం వారి కక్షను వారిలోనే అణగద్రొక్కుకోవలసి వచ్చింది. ధర్మారావుకు వారిని పరి

చయం చేయించుటకు ఫణిబాబు తీసికొని వెడుతూంటే పంచా యితీ అధ్యక్షుడు ఎదురుపడ్డాడు. మంజుల కిరాతకుడినిచూచిన లేడిపిల్లలా భయపడిపోయి, అక్కప్రక్కకు తప్పుకుపోయింది.

కోరచూపులు చూచుకుంటూ పెదిమలమీద శృంగా రాన్ని చిరునవ్వులతో జోడిస్తూ, ఫణిబాబుకు నమస్కారంచేసి వెళ్ళిపోయాడు.

"వాడ్నిచూస్తే నీకు అంత భయమెందుకు మంజులా? నేను నీ ప్రక్కనుండగ నిన్నువాడు మింగేస్తాడనే అంత యిదిగా భయపడి గజగజలాడిపోతున్నావు. వాడికి యింకా దేవుడు ఈ భూమిమీద యిన్ని నూకలుపోసేడు కనుక బ్రతికి బయట పడ్డాడుకాని, లేకపోతే ఆరోజున సింహాలుతో వీడుకూడ ప్రయాణమై పోయేవాడే. నా జీవితంలో నీపైన మరొకడు చెయ్యివేస్తే, చూస్తూ ఊరుకోగలనా. నా ప్రాణాలు నిన్ను కవచంమాదిరిగ ఎప్పుడూ నీచుట్టూ తిరుగుతూనేఉంటాయి. ఏం కమలం. నే చెప్పినమాటల్లో తప్పేదైనా ఉందంటావా?" అని తనఊహ కమలం గ్రహించిందో లేదో అని ఆమె ముఖాన్ని పరీక్షగా చూచేడు.

కమలం అతడి భావనను ముందరే ఆకళింపుచేసికొనడం వలన తనలోని ఏభావాలు బయటకు వ్యక్తంచెయ్యకుండా "నిజమే మంజూ! మన ఫణిబాబు మనకు అండగా ఉన్నంత వరకూ, యిటువంటి పంచాయితీఅధ్యక్షులు, ధనమదాంధులు వందలమంది మనమీద విరుచుకుపడ్డా భయపడనవసరం లేదు" అని మంజులతో చెప్పి, ఫణిబాబువైపు చూస్తూ "మనం మన జాగ్రత్తలోఉండడం ఎల్లాఅయినా మంచిది. కొందరు ఎదురు

గుండావచ్చి దెబ్బతియ్యడానికి ప్రయత్నిస్తారు. అది యింకా నయం. కాని కొందరు నయవంచకులు మనతో ఉన్నట్లేఉండి మనల్ని ఊబిలో దింపుతారు. చూడు, ఆ సింహాలు మనతో ఉన్నట్లేఉండి ఎంతపని చేశాడో. సహజంగా వాడు చాల మంచి వాడే. కాని వాడిమనస్సు హటాత్తుగ ఎల్లా తిరిగిపోయిందో! అందువల్ల ఎవరిమనస్సులు ఏవిధంగా ఎప్పుడు మారుతాయో చెప్పలేంకదా.

"ఇప్పుడు కాలం మారిపోయింది. మానవునిమీద మానవుడికే విశ్వాసం సడలిపోతోంది. ఏపుట్టలో ఏపాముందో నన్న భయమే" అంటూ—"ఏం ఫణిబాబు! మన జాగ్రత్తలో మనం ఉండటం అన్యాయమా" అంది.

ఆమె మాటలను అర్థంచేసికొనుటకు ఆమె చెప్తున్నంత సేపూ ప్రయత్నించాడు. తన మనస్సులోని భావం పసికట్టేసిం దేమోనని మొదట భయపడినా, యిక మొండికెత్తి, "నువ్వు చెప్పిందీ నిజమే. అదేకాకుండ యిటువంటి ప్రదేశంలో యిక అటువంటి దుష్క్రియలు జరగటానికి ఏమాత్రం అవకాశం లేదు. అదీకాకుండ నేనుండగ యిక మంజుల కేవిధమైన ఆపదా రానివ్వనన్నానుగా. మీకు నామీదకూడ నమ్మకంలేదా ?" అన్నాడు కొద్దిపాటి ధైర్యంతో.

"నువ్వు అసలు ఆవిధంగా ఎందుకనుకోవాలి. నీమీద మాకు నమ్మకంలేదు అన్నామా. నీమీద నమ్మకమే లేకపోతే మేమసలు యిక్కడకు వచ్చేవారం కాదుకదా. అనువైతే మంజులను యిక్కడే ఉంచేద్దామనికదా వచ్చింది. నిన్ను ఆసరా

గానే మేము ధైర్యంతో ముందుకు అడుగువేశాము" అంది కమలం.

ఆమె మాటలమీద ఫణిబాబుకు పూర్తినమ్మకం కుదర లేదు. అయినా తనపని తాను నిర్విఘ్నంగా కొనసాగించుకో వచ్చు అన్న ఊహతో "అవును. మనం జాగ్రత్తగ ఉండటమే ఎల్లప్పుడూ శ్రేయస్కరం మంజులా" అన్నాడు మంజులవైపు చూస్తూ.

మంజుల అవేమీ పట్టనట్లు ముందు నడుస్తోంది. ఇంతలో ధర్మారావువున్న గదివద్దకు చేరుకున్నారు. కమలమును, మంజు లను ధర్మారావుకు పరిచయంచేశాడు. ఆరాత్రికి మంజులనృత్యం ఏర్పాటు చేస్తానన్నాడు.

తరువాత సారధికీ, మధుకు వారిని పరిచయం చేశాడు. కమలం మంచితనాన్ని, మంజుల గానాన్ని, నృత్యమునుగూర్చి వారికి చెప్పాడు. సాయంత్రం మంజుల నృత్యప్రదర్శనం ఏర్పాటుచేశామని చెప్పేడు.

అతడి మాటలను కాదనేవారెవరు? కాని అతడి నైజమే అంత. నలుగురిలోను తన ఆధిక్యత నిలబెట్టుకోవాలని ప్రయ త్నిస్తాడు. మంజులను తను వెంటబెట్టుకొని నడుస్తూంటే అత డిలో ఒక అతిశయం, ఠీవీ బయల్పడుతుంది. అది ఒక అంత స్థుగా భావిస్తాడు. దానికి కారణం? మిగతావారి నందరను మంజుల తృణీకరించినదని, తనను ఆదరించి, ఆరాధిస్తూన్నదని బయటవారికి కనపడేలా ఉండాలని ప్రవర్తిస్తాడు. అది అతడికి ఆలవాటయిపోయింది.

మధుకు మంజులను పరిచయుం చేయగనే అతడు ఆదర

గౌరవాభిమానములతో మంజుకు నమస్కరించాడు. మంజుల హృదయంలో నిద్రపోతూన్న మూర్తి మధును చూడగనే హఠాత్తుగ మేల్కొంది. మంజుల కలవరపడిపోయింది. తడబడుతూ "నమస్కారం" అని ప్రతినమస్కారం చేసింది.

ఆమె తత్తరపాటుకు మధు లోలోనే నవ్వుకున్నాడు.

సిగ్గుతో ముఖం క్రిందకుదించుకున్న మంజులనుచూచి ఫణిబాబు చకితుడయ్యాడు. ఆమె మాటలలోని తడబాటును గ్రహించాడు. అతడికేదో అనుమానం వేసింది. చిక్కుకుపోయింది. విడదియ్యలేకపోయాడు. ఎక్కడా ఆధారం కనిపించలేదు. మధువైపు, సారథివైపు ఒకక్షణం చూశాడు. కాని వారిలో మార్పేమీ అతడికి గోచరంకాలేదు. కమలాన్నికూడ ఒకమారు పరికించాడు. కాని ఆమెలోకూడ ఏమార్పులేదు. అయితే సారథితో, అన్నయ్యతో, యితరులతోను పరిచయం చేసినప్పుడులేని తడబాటు సిగ్గు యిప్పుడు మధును చూడగానే ఎందుకువచ్చిందా అని అతడి మనస్సులో ప్రశ్న తలఎత్తింది. దానికి జవాబుమాత్రం అతడికి ఎంత తర్కించుకున్నా దొరకలేదు.

తెల్లబోయి ఆలోచిస్తూన్న ఫణిబాబును చూచి "అల్లాగే. దానికంత యోచన దేనికి పగలంతా మధు గీచిన చిత్రాలు చూడటం, విందు భోజనాలతో ముగుస్తుంది. ఇక రాత్రి మంజుల నృత్యప్రదర్శనంతో గడుస్తుంది. యిక మనకి వినోదానికి లోటేమిటి? ఏమంటావమ్మా మంజులా" అన్నాడు సారథి ఆమెవైపు చూస్తూ.

మంజుల సారధి వైపు ఒకసారి వంచినతల యెత్తి మరల దించేసుకుంది.

"నలుగిరిలో ప్రదర్శనలిచ్చి, అందరకూ ఆహ్లాదమును చేకూర్చటానికేగా కళ. ఆ విధంగా చేసినప్పుడేకదా ఆమె అభివృద్ధి చెందడం, నలుగురి మన్ననలను పొందటం. తనకళను తనలో దాచుకొని, యితరులకు వ్యక్తంచేస్తే ఎక్కడికిపోతుందో అన్న భయస్తురాలకు కళవిలువ ఏంతెలుస్తుంది? ధనమైతే ఆ విధంగా పోతుంది. అందుకు చోరభయంవలన వ్యక్తం చెయ్యరు. కాని కళను, మనలోని కళాకౌశలమును ఆ విధంగా చోరులు దొంగిలించలేరుకదా? ఒకవేళ ఏ కళాకారులైనా ఆ విధంగా తలస్తే వారు అజ్ఞానులు మూఢులు. వారు కళా కారులు, కళాపోషకులుకాదు కళావినాశక ధురంధరులు!" అని చెప్తూ, మంజులవైపు చూస్తూ "మీరు ఆవైపుకుపయనించకండి అధఃపాతాళంలో పడి అణగద్రొక్క బడతారు" అన్నాడు మధు.

అందరూ నిలబడి ఉండటం, మాటలు కొనసాగడం చూచి "రండి. యిక్కడ కూర్చొని కబుర్లు చెప్పుకోవచ్చు" అన్నాడు సారధి.

కమలం, మంజుల ఒకసోఫాలో కూర్చున్నారు. సారధి మరొక సోఫాలో కూర్చున్నారు.

ఫణిబాబుకు ఈ మాటలేవి యిష్టంలేనట్లు మొఖం చిట్లించుకొని పైకిచూస్తూ ఉండిపోయాడు.

మధు, "ఏం ఫణిబాబు! ఏదో ఆలోచిస్తూ నిలబడి పోయావు, రా.. కూర్చో" అన్నాడు.

ఫణిబాబు ఏంమాట్లాడలేదు. అతడు అన్నమాటలు విని పించనట్లు ఉండిపోయాడు.

"ఆయనకు అవతల ఏదో పనివున్నట్లుగా ఉంది. ఆలోచనల్లో పడిపోయాడు. బయటకు వెడతారా ఫణిబాబూ" కమలం అంది.

ఈ మాటలువిన్న ఫణిబాబు కమలం తనను ఏదో మిషతో బయటకు పంపించేయ్యాలని తలస్తోంది అని అనుమానించాడు. ఇందాకటి అనుమానానికి యిది జతచేసి చూచాడు. విడువలేదు. సమస్య మరింత జటిలమైపోయింది. ఇకలాభం లేదనుకొని హఠాత్తుగా ఆలోచనలనుండి బయటపడ్డవాడిలా చూస్తూ "అరె! కూర్చుండిపోయారే" అన్నాడు.

"అవును నువ్వేదో ఆలోచిస్తూ ఎక్కడో విహరిస్తున్నావు. అటువంటప్పుడు నీకు, మేము ఏంచేస్తున్నామో ఏమంటున్నామో తెలిస్తేగా. అదృష్టవంతుడవు. ఏచీకూచింతా లేకుండ హాయిగ సకలభోగాలు అనుభవిస్తున్నావు. పెట్టిపుట్టేవు" అన్నాడు సారథి.

సారథి అన్నమాటలకు ఫణిబాబు చురచురా చూశాడు. "తాతముత్తాతలనుండి అనుభవిస్తున్నారు. నేనూ ఆ విధంగానే అనుభవిస్తున్నాను. ఇందులో వేలెత్తిచూపించ నవసరంలేదు. నేను పొంగవలసినదీలేదు. కాని కొందరికి నడిమంత్రపు సిరితో కళ్ళు నెత్తిమీదకు పోతాయి. పాపం ఏంచేస్తాం. ఆ సిరి వాళ్ళను ఎల్లకాలం అంటిపెట్టుకొని ఉండదని తెలియదు" అన్నాడు.

"ఇక్కడ అటువంటి నడిమంత్రపుసిరితో ఒళ్ళూపై

తెలియకుండ విఱ్ఱవీగుతూన్నవారు లేరే" అన్నాడు సారథి ఫణిబాబు మాటలలోని లోతును గ్రహించి.

"ఇక్కడ అటువంటివారు వున్నారని నేను అనటంలేదు కదా. గుమ్మడికాయ దొంగేడిఅంటే బుజాలు తడుముకున్నట్లు నీ వెందుకు ఖంగారుపడిపోతావు. నేను సహజమైన లోకధోరణి చెప్పాను" అన్నాడు ఫణిబాబు.

"ఓ! అంతేనా" అంటూ సారథి నవ్వుతూంటే మిగతా వారుకూడ శృతికలిపేరు.

వాళ్ళు నవ్వుతూంటే తను నవ్వకపోతే బాగుండదనో, చిన్నతనంగా ఉంటుందనో, చిన్నగా ఒక విషపునవ్వు నవ్వేడు, యిష్టంలేకపోయినా ఫణిబాబు.

ఇల్లా ఉంటే రభస పెరిగిపోతుందని "చూడండి మధు గారు ! లోకం ఆడదానికి విలువనివ్వటంలేదు. ఇంతకుపూర్వం ఎప్పుడో స్త్రీని ఆరాధిస్తే ఆరాధించవచ్చును. కాని ఇప్పుడు స్త్రీ ఒక ఆటవస్తువై పోయింది. పురుషుడు ఎటుతిప్పితే అటుతిరగాలి. దాహం తీరేవరకూ చీమూనెత్తురూ పీల్చేస్తాడు. ఆఖరకు చెరుకుపిప్పిని అమ్మేసినట్లు హీనంగా త్రోసిపారేస్తాడు. పవిత్రత శీలం అనేమాటలకు అర్థంలేదు. నామట్టుకు నేను స్వానుభవం చేత చెపుతున్నాను. నాగూర్చి నలుగురూ నాలుగు విధాలుగా అనుకోవచ్చు. చేస్తూన్నది బయటకు చెప్పటకు భయపడేవారు జీవితాశయాలను జయించలేరు. అది నాకు తెలుసు. గడచిన జీవితపు పుటలను తిరగవేస్తూ తప్పొప్పులను మననం చేసుకుంటే సాధ్యమైనంతవరకు మన ఆశయాలను నెరవేర్చుకొనేందుకు దారిదొరుకుతుంది. కుత్సితమును సాధ్యమైనంత దూరంలో

వుంచితే మానవుడు తాను తలపెట్టింది సాధించి, నలుగురి మన్ననలనుపొంది ఆదర్శజీవి అవుతాడు. కాని యిప్పుడు ఆ విధంగా చరించేవారు చాలతక్కువే అనుకోండి.

"ఇంతకూ చెప్పబోయే దేమిటంటే అందమే నేడు ఆడ దాని శీలాన్ని చెరస్తోంది. ఈ లోకంలో ఆడది అందంతో పుట్టుటమేతప్పు. అందమైన స్త్రీని చూచినప్పుడల్లా నాకు ఈ తలపే కలుగుతుంది. ఇది జుగప్సకాదు. నాలో చెలరేగేబాధ నన్ను ఆ విధంగా తలపింపజేస్తుంది.

"అటువంటి స్త్రీనిచూచి లోకం కోడైకూస్తుంది. లేని పోని అనుమానాలతో ఆమెను శంకించి అనేక బాధలను లోను గావిస్తోంది. అది వారికి ఆనందం. అప్పుడు ఆమె జీవితం ఒక కంటకప్రాయం, దారీతెన్నూ తెలియని నడిసంద్రంలోని నావికునివంటిది. ఒకకెరటం ఒడ్డుకుయీడ్చుకుపోతూంటే మరొక అల నడిసంద్రంలోనికి లాక్కుపోతుంది. రెంటికిమధ్య నలిగిపోయి జీవచ్ఛవమైపోవటమే.

"అటు లోకుల ఘోర పరుషవాక్యాలకు కుమిలిపోయి సతమతమైపోతూంటే, కొందరు కామాంధకాగులు విచక్షణా జ్ఞానానికి తిలోదకాలు సమర్పించి పశువులై కామం పరవళ్ళు త్రొక్కుతూంటే, జాలివదలి పాషాణహృదయంతో స్త్రీమీాద విరచుకుపడతారు. ఆమె జీవచ్ఛవమయ్యేవరకూ రక్తమాంసాలు పీల్చేస్తారు.

"అందువల్లనే అందంగా ఆడదిపుట్టడం ఆమె మనువుకే చేటు అంటున్నా.

"అందానికితోడు మంజుల అటు కళలోకూడ యింతో

అంతో పాండిత్యం సంపాదించింది. ఆమె యింకా వృద్ధిలోనికి మీవంటివారి ఆశీర్వచనబలంతో పైకివస్తుందని అనుకుంటున్నా. కాని లోకం అదిచూచి ఓర్వలేక గ్రద్దల్లా ఎప్పుడు మీదపడదామా అని కాంక్షతో చూస్తోంది. వీలుచిక్కటంలేదు. ఒకవేళ అటువంటిది సంభవించినా, దైవానుగ్రహంవలన మీవంటి పెద్దలవలన తప్పిపోతోంది.

"ఏ యితర ఆసరాలేని నేను ఆమెను కాపాడ్డం బహు కష్టంగానే వుంది. ఈమధ్య ఫణిబాబుఆసరా కొంత లభించింది. మీవంటి పెద్దలతో స్నేహం ప్రాప్తిస్తే కొంతభారం నాకు తగ్గుతూ ఉంటుంది. నాచుట్టూ ఎప్పుడూ కందిరీగలు రొదచేస్తూ ఎప్పుడు రక్తము పీల్చుదామా అని తిరుగుతూ వుంటాయి. నావద్ద మంజులవుంటే ఆమెనుకూడ పీల్చిపిప్పిచేస్తాయి. ఆమెలో ఉండే అటువంటికళ, ఉన్నతశక్తి వాటికేం తెలుసు. అవి ఎప్పుడు దాహం తీర్చుకుందామా అన్న ఆతృతతోనే తిరుగుతూ వుంటాయి. అటువంటప్పుడు మనజాగ్రత్తలో మనం ఉండటం మంచిదికదండీ" అని కమలం ఒకమారు ఫణిబాబును చూచి అతను గతుక్కుమనడం గమనించి మధువైపు చూచింది.

మధు కమలం మనస్సులోని విప్లవానికి అసహాయతకు చకితుడయ్యాడు. విచారించాడు.

కమలం జీవితంలో అశనిపాతంవంటి దెబ్బతిని పాతాళమునకు ఆమె ఆశయాలు అడుగంటిపోయి ఉంటాయని, అందువల్లే ఆమెకు లోకం యింత హేయ్యంగా గోచరిస్తోందని, జీవితం మీద విరక్తితో ఆత్మహత్య చేసికోలేక, తన ఆశయాలకు మంజుల హృదయంలో గూడుకట్టి, తను మంజులకు కవచంవలె

ఉందని తలచి, ఆమె సమున్నతస్ఫూర్తికి, ఓర్పుకు, ఆమె ఉత్త మాశయాలకు మనస్సులోనే శ్రద్ధాంజలి ఘటించాడు సారథి.

ఇక ఫణిబాబు అక్కడ కూర్చుండలేక "మీరు ఇక్కడ కూర్చుండిపోతారా, వస్తారా" అని కమలాన్ని, మంజులను ప్రశ్నిస్తూ లేచాడు.

"అబ్బే! ఒచ్చేస్తున్నాం" అని కమలం లేచింది. కమ లంతోపాటు మంజులకూడ లేచింది. మంజుల అక్కడ ఉన్నంత సేపు తల వంచుకునే కూర్చుంది.

సారథికూడ లేచి నిలబడుతూ "మీరు అంతగా భయ పడనవసరంలేదు. ధర్మారావు వున్నంతవరకూ ఆమె కేభయము లేదు. నేను మంజులను నా సోదరిగ చూసుకుంటాను. నాకు యింతటి కళామూర్తిఅయిన ఒక చెల్లెలును కలిగించేందుకు భగవంతుడు సదవకాశమును యిచ్చినందుకు ఎంతో కృతజ్ఞుణ్ణి. ఏమమ్మా మంజూ! నన్ను అన్నయ్యగా భావించి, సోదరిప్రేమను ఈ తడారిపోయిన హృదయానికి అందిస్తావుకదూ" అంటూ మంజులను చూస్తూ కన్నీరు పెట్టుకున్నాడు. వాళ్ళు చూస్తా రేమోనని ముఖం ప్రక్కకుతిప్పుకున్నాడు.

అదిచూచి వారు అర్థంకాక ఆశ్చర్యచకితులైనారు.

అది గమనించి "పోయిరండమ్మా, మేమూ వచ్చేస్తు న్నాము" అన్నాడు సారథి చిరునవ్వు ప్రయత్నపూర్వకంగ పెది మలమీదకు తెచ్చుకుంటూ.

సారథి వింతప్రవర్తన అర్థంకాక సతమతమౌతూ, అతడి బేలహృదయాన్ని తలుచుకుంటూ ఫణిబాబు వెనుకనే కమలం, మంజులా నడచారు.

మధు సారథిని చూచాడు. సారథి కనుకొలుకుల్లో యింకా నీరు నిలచివుంది. ఆర్ద్రమైన అతడి నయనాలవెనుక ఏదో శోకపూరితగాథ నిలచివుందని తలచి, "ఏమిటి సారథి? అంత చిన్నపిల్లవాడవై పోయావు. నీ హృదయంలో ఏదో శోక పూరితమైన భాండాన్ని నిలబెట్టుకొని భారంతో కృంగిపోతు న్నావు. అదేమిటో నాతో చెప్పకూడదా. ఆప్తమిత్రుడిగ నేను నీ బాధను పంచుకోవటంలో తప్పులేదుగా... సారథీ అదే మిటో నాకు చెప్పవూ" అన్నాడు.

సారథి కన్నీటిని తుడుచుకుంటూ "మధూ! మంజులను చూచేసరికి నా హృదయంలో అట్టడుగున అతిగుప్తంగా దాచు కున్న నాచెల్లెలు మాధవి గుర్తుకొచ్చింది. నేను ఈనాడు నలు గురిలోను ఒక మనిషిగ ఉన్నానంటే నాకు మా చెల్లెలిచ్చిన జ్ఞానం అని సగర్వంగ చెప్పకోగలను. అయితే మా మాధవికి కృతజ్ఞతగ ఆమెను ఒకసారి తల్చుకోటంతోనే సరిపోతోంది.

"నా జీవితంలో మా నాన్నగారు పోయినప్పుడుకూడ నే నింతగ బాధపడలేదు. అదీకాకుండ జ్ఞానంలేని నా పసితనంలోనే అస్తమించారు ఆయన. అయితే ఆయన లేనిలోటు మాఅమ్మ నాకు తీర్చింది. కాని మా మాధవిలేనిలోటు తల్లి తీర్చలేక పోయింది. అప్పటినుండి నా హృదయం శుష్కించిపోయింది. కారణమేమంటే ఆమె, నేను తప్పించి మాఅమ్మకు సంతానం లేదు.

"మాధవి చనిపోయేటప్పటికి నాకు పద్నాలుగుపళ్లు నిండాయి. ఆమె ఎల్లాచనిపోయిందో నాకు బాగా గుర్తు. నా జీవి

తంలో ఈ సంఘటన మర్చిపోలేను. ఆమెను యమసదనానికి పంపిన దౌర్భాగ్యుణ్ణికూడ నేనే.

"అప్పట్లో కాలం చాల విచిత్రంగా దొర్లిపోయేది. నేను పాఠశాలకు ఒంటరిగపోయి ఒంటరిగ వచ్చేవాణ్ణి. చినిగిపోయిన దుస్తులతో వెళ్ళేసరికి విద్యార్థులందరు 'నన్ను ముట్టుకోకోయి నామాలకాకి' అన్నట్లు దూరంగ పోయేవారు. ఏవేవో తిను బండారాలు తెచ్చుకొని నన్ను ఊరించేవారు. చిన్నతనంవలన నాలో ఉక్రోషం బయలుదేరేది. అయితే నాలోని సాత్వికగుణం నన్ను ఆపుచేసేది.

"పాఠశాలలో వంటెరివాడిగ ఉండటంచేత, వారు నన్నేడి పించటంచేత ఉక్రోషంతో యింటికివచ్చి మాధవిని ఏడిపించే వాడిని. ఆమెను నానాతిప్పలూ పెట్టేవాడిని. ఆమె ఆటవస్తువు లను దొంగిలించేవాడిని. యిదే నాకు నిత్యకృత్యం అయి పోయేది.

"కొన్నినాళ్ళకు నాలో మరింత మార్పువచ్చింది. ఈ మారు పూర్తిగ పాఠశాలకు శలవుయిచ్చేసి, సోమరిలా తిరు గుతూ చెడ్డస్నేహాలతో దొంగతనంకూడ నేర్చుకున్నా. మా అమ్మ మందలింపులు గాలిలో ఎగిరేవి. ఆమె నాపై చెయ్యి చేసికోనేందుకు మాతృహృదయం అడ్డునిలచేది. యిప్పుడు మాధవిని ఏడిపించేందుకు తీరికకూడ ఉండటం లేదు.

"అంత కంతకు నా దుండగాలు మితిమీరి పోయాయి. యింట్లో కాబట్టి మా అమ్మ నాలుగుతిట్టి ఊరుకుంది. కాని బయటవాళ్ళు నాలుగు తన్నేవారు. ఒకరోజున నేను పట్టుబడి నప్పుడు, వాళ్ళు నాకాళ్ళు చేతులు కట్టి కొడుతూ మాఅమ్మ

దగ్గరకు ఈడ్చుకువచ్చి పడేసి, అమ్మను నానాతిట్లూ తిట్టాక. ఈ రభసకు భయపడి మాధవి అమ్మచాటుకు పోయి ఏడుపు మొదలుపెట్టింది.

"వాళ్ళు ఎన్ని మోగుతూన్నా మాట్లాడక ఊరకుండి పోయా. వంటికి దెబ్బలు రోజూ అలవాటయిపోయాయి. "యిటువంటి కొడుకును కని, ఊరుమీదకు అందరిప్రాణాలు తియ్యడానికి వదలకపోతే, పీక నొక్కి అవతల పారెయ్య కూడదూ" అని నానామాటలు ఆడుతూంటే అమ్మ తనకుఏమీ పట్టనట్లు, నావైపు, తిడుతూంటే వారివైపూ చూస్తూ నిలచుని అమాంతంగ యింట్లోకి వెళ్ళిపోయింది. ఆమె ఆవిధంగా మంద లించకుండా వెళ్ళిపోయినందులకు వాళ్ళకు పట్టరానికోపం ముంచు కొచ్చి, నన్ను దడ దడా ఎవరికి తోచినట్లు వారు బాదేస్తుంటే మాధవి నావద్దకుచేరి ఏడుపు మొదలుపెట్టింది. నాచుట్టూ మూగివున్న వాళ్ళను తప్పించుకుంటూవచ్చి అమ్మ మాట్లాడ కుండా నానడ్డిమీద కాల్చిన గరిటెతో రెండువాతలుపెట్టింది.

"దాంతో అక్కడకు చేరినవారి హృదయాలు చల్ల బడ్డాయి. ఒక్కొక్కరే ఎవరిదారిన వారు జారుకున్నారు. నేను ఒళ్ళు తెలియకుండా నేలమీదపడి దొర్లుతున్నాను. అమ్మ ఏడుస్తూఒక్కపరుగున యింట్లోకిపోయింది. ఇప్పుడాలోచిస్తూంటే నాకు అవగత మాతూంటుంది, ఆమె హృదయంలో నేనుఎంత క్షోభ కలిగించేనోయని. అయితే లోపలకు వెళ్ళిన మాఅమ్మ నేలమీదపడి దొర్లుతూవున్న నన్ను లోపలకు తీసుకొనివెళ్ళి పుండ్లమీద నవనీతంరాసి కట్టుకట్టింది.

"శరీరంపై నడున్న పుండ్లకయితే కట్లుకట్టి మంటలనుతగ్గి

చింది కాని నాహృదయంలో రగుల్కొన్న క్రోధం, పగ సంగతి ఆమెకు తెలియదు. "యిల్లాచేస్తే ఎల్లాగురా, చక్కగ చదువుకొని నలుగురిలో మంచిపేరు తెచ్చుకోవాలి కాని" అనిఅమ్మ చెపుతూంటే "అన్నయ్యా మంటపుడుతోందా, అమ్మ మంచిది కాదు. అమ్మపని పడ్దాం" అంటూ తెలిసీ తెలియని జ్ఞానంతో నన్ను ఓదార్చింది, బేల హృదయి అయిన మాధవి. నాన్న లేనందువల్ల అమ్మే నాలుగు రూపాయలు, అక్కడా యిక్కడా పనిచేసి సంపాదించి సంసారపోషణ సాగించేది. అమ్మ కొంత తడవు నాదగ్గరుండి, పడుకోమని చెప్పి ఎవరింటికో పనిలోనికి వెళ్ళి పోయింది. అప్పుడు నాలో దాగివున్నకక్ష నన్ను పశువుని చేసింది. అమ్మ కాల్చిందికాబట్టి దానికి తగ్గప్రతీకారం తీర్చుకోవాలని చెల్లాయిదగ్గరకు వెళ్ళాను. అది ఆడుకుంటోంది, నేనిల్లా ప్రవర్తిస్తానని దాని చిన్నహృదయానికేం తెలుసు? "ఏం అన్నయ్యా నాతో ఆడుతావా" అంది, నావైపు సంతోషంగా చూస్తూ. దానితో మనసిచ్చి ఆటలాడి, మాటలాడి, చాలా కాలమైనది. అందుకే నేను దానిదగ్గరకు చేరగనే సంతోషంతో అల్లా అడిగింది. కాని నాదృష్టిఅంతా దానిమెడమీదే వుంది. నేనింక ఆగలేకపోయాను. నాలోని అక్కసు, నన్ను నిలువనివ్వలేదు. అంతే, ఒక్కలాగులాగేను ఆమె మెడలోవున్న గొలుసును. గొలుసు తెగిపోయింది. దానితోపాటు మాచెల్లాయి మెడకూడ కొంత కోసుకుంది. అది ఏడుపు మొదలుపెట్టింది. రక్తంకారిపోతోంది.

"ఆగొలుసు దొంగిలించాలన్న ఆతృతేకాని, యీవిధంగా జరుగుతుందని నాకేం తెలుసు? చెల్లాయిరక్తం చూచేసరికి ఏమి

చెయ్యటానికి పాలుపోలేదు. దానిరక్తం కడుగుదామని దొడ్డి లోనికి పరుగెత్తుతుంటే అది కంఠం మరింత హెచ్చించి, భయంతో నావెంట పడింది. దానియేడుపుకు నేను మాఅమ్మ వచ్చి నన్ను మళ్ళీ కొడుతుందేమోనని భయపడ్డాను. దాని యేడుపు మాని పించడం ఎల్లాగోనాకు తెలియలేదు. "నువ్వు ఏడుస్తే నూతిలో పడిపోతా" అని నూతిదగ్గరకు పరుగెత్తాను. అదియింకా గట్టిగా ఏడుస్తూ నూతివద్దకు వస్తూంటే నూతిప్రక్కనున్న రాయి నూతిలోవేస్తూ, నూతిగట్టున దాగుకున్నా. ఆ శబ్దానికి అది నూతిలోనే పడిపోయేనేమోనని నూతిలోకి తొంగిచూస్తూ, "అన్నయ్యా: అన్నయ్యా" అనిఏడుస్తోంది. అసలే ఆ నూతికి ఎత్తు బాగాతక్కువ. నేను వెనకాలేవచ్చి దానినోరు మూద్దామని అదినిలబడిన రాయిమీదకు ఎక్కేను. ఆరాయి తొలగింది. అంతే నేను క్రిందపడిపోయూ. నూతిపంచన చెల్లాయి ఉండటంచేత ఆమె నూతిలోపడిపోయింది.

"నేను చెల్లాయి నూతిలోపడిపోయిందని కేకలువేసు కుంటూ అమ్మదగ్గరకు వెళ్లి చెప్పేను. చెల్లాయిని నూతినుండి గ్రామస్తులు తీశారుకాని ఫలితం శూన్యం" అనిచెప్పటం ముగిస్తూ "మధూ! నేను ఒకజీవిని పొట్టనపెట్టుకుంటేగాని తిరిగి మనిషి నవ్వలేదు. అప్పటినుండి నాలో పరివర్తన వచ్చింది. నా జీవి తాంతం నాబాల్య జీవితాన్ని గుర్తుచేస్తాయి మా అమ్మ నడ్డి మీద పెట్టిన వాతలురెండు. మాఅమ్మ ఆరోజున ఆవిధంగా దండించకపోతే నేనీనాడు నరరూప రాక్షసినై వుండేవాడిని. కాని చెల్లెలు దక్కిఉండేది. ఆమెబ్రతికిఉంటే నాకిరాతక చర్యలను చూసి కుమిలిపోయిఉండేది. కాని ఆమె చనిపోవడంవల్ల నేను

ఈనాడు యిలాఉన్నాను. ధర్మానికి ఎప్పుడైనా తెలుసుండికాని, తెలియకకాని అపకారం తలపెడుతూఉంటే నాహృదయం లోని మాధవి నన్ను తిట్టి లేపుతుంది, జ్ఞాననేత్రం తెరుస్తుంది. కాని నే నీజీవితాంతంవరకూ ఆమెను తల్చుకుంటూ సోదరి ప్రేమ అంటే ఎలాఉంటుందో తెలుసుకోకుండా చనిపోవలసిందేనా అని బాధ పడుతూఉంటున్నా. కాని నేటితో ఆబాధ తీరిపోయింది. మంజు లను చూడగానే నాచెల్లెలు మాధవి మరలా నాకోఅకు బ్రతికి వచ్చిందా అనిపించింది. మాధవిరూపమంతా మంజులలో నిబి డీకృతమయివుంది.

"అందువల్లే మంజులనుచూడగనే మాధవి తలపుకువచ్చి బాధకలిగింది. కాని అంతలోనే చెల్లెలికోఅకు తపిస్తూన్న హృద యానికి చెల్లెలు దొరికిందికదాయని ఆనందం కలిగింది" అన్నాడు సారథి పోయిన చెల్లెలు తిరిగివచ్చినట్టు.

ధర్మారావుగారు పిలుస్తున్నారంటూ పంచాయతీ అధ్య క్షుడు వీరితో చెప్పి వెళ్ళిపోయాడు.

ధర్మారావును చేరేసరికి అతడు ఏదో ఆలోచిస్తూ కూర్చోవటం చూచి సారథి "ధర్మా ఎప్పుడూ ఏదోఒక ఆలోచనలో మునిగిపోయి వుంటావు. ఈరోజుకూడ ఆ విధంగా ఉంటే ఎల్లాగచెప్పు. పిలిచావట, ఇంతకూ అసలు సంగతేమిటి?" అన్నాడు.

ధర్మారావు పెదవులమీద చిన్నచిరునవ్వు వెలిసింది.

ఆ నవ్వులోని అంతరార్థమేమిటోకాని ఎటువంటి కోప తాపాలు కలిగిన మనిషైనా ఆ చిరునవ్వుతో పిల్లి అయి పోతాడు. హృదయంలో ప్రశాంతతను నెలకొలుపుతుంది.

"ఏమీలేదు. ఈరోజు ఫణిబాబు నావద్దకు యిద్దరాడ వారిని తీసుకొనివచ్చి పరిచయం చేసేడు. ఈరోజు నృత్యప్రదర్శన ఏర్పాట్లుకూడ గావిస్తానన్నాడు. వారినిగూర్చి మన పెద్దలు అనేక విధాలుగ నావద్దకువచ్చి చెపుతున్నారు. ఫణిబాబును వారు లోబర్చుకున్నారని, అందాన్ని ఎఱగాచూపి ధనాన్ని గుంజు తున్నారని,. అనేక సంసారాలు వాళ్ళమూలంగ కూలిపోయా యని చెబుతున్నారు. ఇంతకూ అసలు వారెవరో మీకు తెలుసా ? అని అడుగుదామని పిలిచాను" అన్నాడు.

"బాగుంది ధర్మా! ఎవరో చెప్పారని అది పట్టుకొని కూర్చుంటామా ? లోకులు కాకులు అంటారు. గోరంతను కొండంతచేసి చెపుతారు. నాకు వారినిగూర్చి బాగా తెలుసు. అయితే వారి పుట్టుపూర్వోత్తరాలు తెలియవు.

"ఆమె యీవూరు తనచెల్లెలు, అంటే మంజులన్నమాట-ఒకసోదరుడు సింహాలుతోను వచ్చింది. ఆమె చాల అందంగా వుంటుంది. బహుశా యిప్పుడు నీతోచెప్పిన పెద్దలందరూ ఆమెకు దాసోహమన్నవారే. కావలసినంత ధనం గుమ్మరించే వారు. అయితే ఆ ధనాన్ని ఆమె గుప్తపరుచుకోక, బీదప్రజలకి పుణ్యకార్యాలకు వినియోగిస్తుంది. ఈ ప్రాంతంలో అనాధలకు ఆమె తల్లి. దైవభక్తి కలది. అయినా వ్యభిచారిణి. ఆమెనుగూర్చి తలచుకుంటే చాలవిచిత్రంగ ఉంటుంది. చాల నెమ్మదస్తురాలు. పెద్దలయెడల గౌరవం కలది.

"నా అనుమానం ఏమిటంటే ఆమె జీవితంలో ఒకగొప్ప దెబ్బతింది. ఆ దెబ్బతో ఆమె నిర్మించుకున్న ఉన్నతాశయాలు అన్నీ నేలమట్టమయ్యాయి. అందువల్ల ఆమె నిస్పృహచెంద

లేదు. జీవితంపోయినా శీలంముఖ్యం స్త్రీకి అంటుంది. పవిత్రతలేని స్త్రీ అసలు స్త్రీఅని అనిపించుకునే అర్హురాలు కాదంటుంది. అయితే ఆమెకు యిప్పుడా పవిత్రతలేదు. నా ఉద్దేశ్యంలో శారీరకంగా ఆమె పవిత్రత దెబ్బతిందికాని ఆమె హృదయం గొప్ప సంస్కారం కలిగినది. పవిత్రతకలది. ఏమి ఏమైనప్పటికి సంఘం దృష్టిలో ఆమె ఒకచీడపురుగు, నీచురాలు, వ్యభిచారిణి ఇటువంటి పదాలకు గురికాకుండ తనచెల్లెలను రక్షించుకోవలయునని ఆమె తాపత్రయం. ఆమె ఆశయాలు అన్నీ మంజులలో యిమిడ్చింది. లోకులు ఆమెను పీల్చిపిప్పిచేశారు. యిప్పుడు మంజుల మీదకు ఎగబడుతున్నారు పిపాశతో. కమలం వారిని మంచి మాటలతో పవిత్రమైనభావం వారి హృదయాలలో తీసికొని రావలయునని ప్రయత్నిస్తోంది. కామానికిదాసులై పశువులవలె ప్రవర్తిస్తున్నారు కాని ఆమె మాటలను వినిపించుకోవటం లేదు.

" మొన్న నీమధ్యన మంజులను దేవాలయంలోనే ఈ సంఘ పెద్దలు బలవంతంచేశారు. నిర్బంధించి ఆమెను నేలమీద పొర్లించారు. కాని ఆమె అదృష్టంకొద్ది ఆరోజు మన మధుచే రక్షింపబడింది.

"మరొకరోజున మన పంచాయితీఅధ్యక్షుడు పెద్దసన్మానం ఏర్పాటుచేసి ఆరాత్రి తనయింటికి మాయమాటలతో మంజులను తీసికొనిపోయాడు. ఆరోజు ఫణిబాబుచే ఆమె కాపాడబడింది.

"వీరందరూ కమలంచే మంజులనుగూర్చి తిరస్కరింపబడి కక్షకట్టి యిక్కడ స్థానంలభించకుండా చేద్దామని ప్రయత్నం

చేస్తున్నారు. ఎందువలనంటే ఈ ఆవరణలో వారిఆటలు సాగవు.

"ఇక ఫణిబాబు మాటంటావా, అతడి సంగతి పూర్వం నీకు తెలుసు. అతడి చర్యలకు ఎంతమంది గురిఅయ్యారో వేరే చెప్పక్కరలేదు. కమలం ఈ వూరు వచ్చిన తరువాత ఆమె మోజులో అతిడు పడ్డమాటనిజమే. అందుకు నేను, ప్రజలుకూడ సంతోషిస్తున్నాం. కారణం యిప్పుడు ఫణిబాబు పూర్వంవలె కనపడిన ఏ ఆడదానివెంటా పడటంలేదు.

"మన చుట్టుప్రక్కల గ్రామాలలో ఏంజరుగుతున్నా మంచికాని, చెడుకాని ఏదిఅయినా క్షణంలో ఆవార్త నావద్దకు చేరుతుంది" అన్నాడు సారథి.

"అయితే ఒక ఆడదానికి గౌరవం యివ్వలేని హీనస్థితి లోనికి దిగజారిపోయిందన్నమాట ఈ సంఘం" అన్నాడు సారథి లోకానుభవంలేని ఒక చిన్నపిల్లవాడు అన్నట్లు.

"అల్లా తీసిపారెయ్యకు. అక్క లోకువవల్లె, చెల్లెలిమీద విరచుకుపడుతున్నారు. ఇంటెనిమరిగిన కుక్కను తోలేమాత్రం పోతుందా."

"అయితే యిన్నినీతులు తెలుసున్న మంజుల అక్క గారికి ఆలోకువ ఎందుకిచ్చింది ?"

"బ్రతకడానికి."

"ఈ ప్రపంచంలో స్త్రీకి యింతకంటె వేరేదారే లేదా ?"

"ఉంది. అది ఆమెకూ తెలుసు. స్త్రీ వ్యభిచరించటం

కంటే చస్తేమేలు అంటుంది. అయినా ఆమె ఆ దారే త్రొక్కింది.''

"అరె! అన్నీ తెలుసున్న వివేకవతి అయివుండికూడ ఆమె ఆదారే పట్టిందంటే చాల విచిత్రంగానే ఉందే" అన్నాడు ధర్మారావు ఆశ్చర్యపోతూ.

"ఆమె భావనేమిటో ఎంత ఆలోచించినా అంతుచిక్కటం లేదు. అయితే ఒక్కటిమాత్రం తెలుసు. ఆమె జీవితంలో ఈ లోకంవలన ఏదో ఘోరఅన్యాయం జరిగిపోయింది. అందువలనే ఆమె యిల్లా మారిపోయింది. మంజులకుకూడ అటువంటి అన్యాయం జరిగిపోతుందేమోనని తల్లడిల్లిపోతోంది. అందుకే ఆమె మనసహాయం కోరుతోంది. దానికి లోకులు అనేక నిందలు మనమీద వేస్తారు. వారి అపనిందలకుదడిసి ఒకస్త్రీని, సోదరిని రక్షించలేకపోవటం, ఆదరించకపోవటం నీచం. కమలంలోకూడ వేరే దురుద్దేశ్యమేమీ లేదు. అదినాకుబాగా తెలుసు. అందువలన మంజులను నేను సోదరివలె చూచుకొని, సంరక్షిస్తానని హృదయపూర్వకంగా మాటయిచ్చాను. నా మాటవల్ల హృదయభారం ఆమెకు తీరిపోయింది. ఆ భారం వహించటంలో కూడా నా స్వార్థంవుంది." ఈ మాటలు అంటూంటే సారథి కంఠం గాద్గదికమైనది. కొంచెం, మనిషి చలించాడు "నాస్వార్థం నా మనస్సుకు ఎంతో సంతోషాన్ని యిచ్చింది. నాజన్మలో యిటువంటి ఆనందాన్ని దేనివలనా పొందలేదు. నీతో ఒకసారి చెప్పాను. నా చెల్లెలు జీవితాన్ని ఈ దౌర్భాగుడు బలిగొన్నాడని"—అతడి కంఠం మరింత రుద్ధమైనది.

కొంచెంసేపు ఆగి "ఇప్పుడు నా మాధవి బ్రతికుంటే

మంజులంత అయిఉండేది. ఆనందంగా ఆమెకు నా చేతులతో పెళ్ళిచేసి భర్తకు వప్పజెప్పేవాణ్ణి. కాని ఆ అదృష్టానికి నోచుకో లేదని తపించిపోతూంటే నాచెల్లెలి స్థానం మంజులాక్రమించి నాకు సంతోషాన్ని ప్రసాదిస్తోంది. నా చెల్లెలినుండి ఆ సంతో షాన్ని పొందటం తప్పంటావా ధర్మా?" అన్నాడు.

సోదరికోరకు తపించిపోతున్న అతడిని చూస్తూంటే ధర్మారావు హృదయం ఆర్ద్రమైపోయింది.

"ఎలా తప్పుఅవుతుంది సారథీ? నీ చెల్లెలిసౌఖ్యమే నీసౌఖ్యం, నీ ఆనందం. అదృష్టవంతుడవు సారథీ ? పోయిన చెల్లెలను మరలా మంజులగ బ్రతికించుకున్నావు. నీ అదృష్టంలో సగభాగం నాకుకూడ యిస్తే ఈ జన్మలో నీ ఋణం తీర్చుకో లేను సారథీ" అని సారథిని కౌగలించుకున్నాడు.

నవనీతంవంటి ఆ ప్రమిత్రుల హృదయాలను ఊహించు కొనేసరికి ఈ ప్రపంచములో యిటువంటి దయామూర్తులు ఈ కాలంలోకూడ ఉన్నారా అనిపించింది మధుకు.

"వారి గతజీవితాలతోను, వారి గుణాలతోను మనకి పనేమిటి. మనం మన జాగ్రత్తలోఉంటే వారి గుణాలువచ్చి మనని అంటుకోవుగా? అదీకాకుండ మనం వారిగుణాలకు ఏ మాత్రం జంకవలసినది లేదు. మనం పూజించేది, గౌరవించేది ఆమెలోనుండే కళను. కళ ఆమెలో నిలచియున్నంతవరకూ ఆమెను ఒక కళామూర్తిగా, కళాతపస్వినిగ ఆరాధిస్తాము" అంటూ తనలోనుండే కళాపిపాసను వ్యక్తంచేస్తూ "ఏమంటావు మధూ! నే చెప్పినదానిలో ఏమాత్రమైన తప్పు వున్నదేమో చెప్పు" అన్నాడు ధర్మారావు.

"మీ హృదయం నాకు తెలుసుకదండీ. మీవంటి పవిత్రహృదయులు అపవిత్రాన్నికూడ పవిత్రంచేసి మీదరికి తీసుకుంటారు. కనుక మీ ఆశయంలో ఆమె పవిత్రమార్గగామౌతుంది. అది నాకు తెలుసు."

"నిజమే ధర్మా. నా చెల్లెలును నీ ఆశ్రయంలోనే ఉంచుతా. ఆమెకు నీ పవిత్ర శాంత గంభీరౌదార్యములు, మధువంటి ఆదర్శభావాలు, కళాపిపాస అబ్బగలుగుతాయి" అన్నాడు సారథి.

ఊరి పెద్దలందరు యింతలో అక్కడకు చేరుకున్నారు. బహుమతులను అందజేసి కొంతతడవు యిష్టాగోష్టి జరిపిన పిమ్మట మధుగీచిన చిత్రాలనుచూచి వేనోళ్ళ పొగడేరు.

మధు చిత్రించిన చిత్రంలోకంలో మంజుల నాట్యం వీక్షించి మయూరములు మేఘములనుగాంచి నాట్యమాడినట్లు ధర్మారావు ఆదరాభిమానములను కని వారి హృదయాలు నృత్యంచేశాయి.

ఆరోజు అంతా ఆనందంగా గడచిపోయింది.

మరునాడు కమలం ధర్మారావువద్ద శలవుతీసికొని వెళ్ళిపోదామని అనుకుంది. మంజులతో చెప్పింది. మంజుల ఈరోజు అంతా ముభావంగానే ఉంది. ఆమెలో అనేక ఆలోచనలు గిరున తిరుగుతున్నాయి. అవి యిదివరకు అనేకసార్లు వచ్చాయి. కాని వాటికి సమాధానంరాక వెనుతిరిగాయి.

తను ఎవరు? తల్లితండ్రు లెవరు? అక్క యిన్ని నీతులు చెపుతుంది. శీలం ముఖ్యంఅని చెపుతుంది. అయితే ఆమె తన శీలాన్ని ఎందుకు తప్పుదారి త్రొక్కించింది. వ్యభిచారం మంచిది

కాదంటుంది. అయితే తన శరీరాన్ని ఎందుకు నలగకొట్టుకుం టుంది! అనేక సంసారాలనుకూల్చి ధనం రాబట్టింది. ఆ ధనాన్ని దాచుకొనకుండ ఎందుకు వెచ్చిస్తోంది? ఆమెమూలంగా తనను కూడ ఈసంఘం ఎంత నీచురాలుగా చూస్తోందో. ఒక పురుగు మాదిరిగ చూస్తోంది. అది ఆమెకు తెలుసు. పవిత్రత కావాలంటుంది. తను ఆ పరిస్థితిలోఉంటే నాకుమాత్రం ఈ సంఘంలో స్థానం ఎల్లాదొరుకుతుంది? సింహాలు ఎవడు? వాడూ ఒక సోదరుడేనా ? ఈ పవిత్ర హిందూదేశంలో చేతులార తన సోదరిని ఏ సోదరుడైనా వ్యభిచరించుటకు పురికొలుపుతాడా? ఏమో అంతా అగమ్య గోచరంగా ఉంది. తలయెత్తి ఈ ప్రపంచంలోమసలటానికికూడ భయంగా ఉంది. ఆనాడు ఆమూర్ఖుడు ఎన్ని మాటలన్నాడు. "నీ అక్క కులికింది. ఈరోజు బంగారుపంజరంలో హాయిగాఉంది. నువ్వెందుకు భయపడతావు. నీ జీవితంలో సంపాదించలేని ధనాన్ని, అనుభవాన్ని ఈరాత్రిలో నీకు చేకూరుస్తా" అన్నాడు. కామధన మదాంధకారుడు. పశువు. అభిమానం, మానంగల ఏ స్త్రీఅయినా యిటువంటి మాటలనుపడి బ్రతకగలదా! బ్రతి కినా ఈ లోకంలో తలయెత్తుకు తిరగలేదు. అసలు ఈ మూక ప్రజ తిరగనిస్తుందా? లోకుల సూటీపోటీమాటలతో హృదయం తూట్లుతూట్లు పడిపోతుంది. యిటువంటి అవమానాలు సహించి బ్రతకటంకంటె ఆత్మహత్యచేసికొనటం మేలు, అని అనేకవిధా లుగా యోచిస్తూ దుఃఖాన్ని, అవమానాన్ని భరించలేక అక్కను యివే అడిగేసింది.

మంజులలో రగుల్కొన్న ఆందోళనను అణచటం యిక

తన సాధ్యం కాదనుకుంది. ఒకవేళ యిప్పుడు తను తప్పించుకున్నా, ఈ పాడుఅభిప్రాయాలు తుఫానులా హృదయంలో చెలరేగి, వివిధరకాలైన అనుమానాలు తలయెత్తి హృదయాన్ని ముక్కలుముక్కలుక్రింద ఖండించేస్తాంటే ఆ బాధను భరించలేక జీవితంమీద విరక్తిపుట్టుకొచ్చి ఆత్మహత్యకు మరింతదగ్గరకు చేరుస్తాయి. అసలే మంజులహృదయం సున్నితమైనదని తలచి,—

"మంజులా! యిప్పుడు నీమనస్సు ఎల్లా బాధపడుతూందో నాకు అవగతమాతోంది. దానికి కారకురాలను నేను. ఈ జీవితంలో నాకు సుఖసంతోషాలు ఎల్లాగు లేవు. నీకు యిటువంటి విషయాలుచెప్పి బాధకల్గించి, నీ మనస్సునుకూడ కష్టపెట్టటమెందుకన్న ఉద్దేశ్యంతో, నీకు సమాధానందొరక్క బాధపడుతూన్నా విషయాలన్నీ నా హృదయంలోనే దాచుకొని క్షోభించిపోతున్నా. నువ్వు ఈవిధంగా బాధపడతావని నేను ఎప్పుడూ తలంచలేదు. నువ్వు నాన్నను అమ్మనుగూర్చి అనేకసార్లు అడిగేవు. కాని వాటికి నే సమాధానంయివ్వక ఏదోమిషతో నిన్నా ధోరణినుండి తొలగించేదాన్ని. కాని నాకు యిప్పుడు అవగతమాతోంది. కొంతవయస్సు మానవునికి వచ్చేసరికి పూర్వాపర విషయాలు, తనను తనవారినిగూర్చి తెలుసుకోవాలన్న పిపాస కలుగుతుంది. రహస్యవిషయాలని భేదించాలని మనస్సు తహతహలాడిపోతుంది. యిటువంటి సమయాల్లో అడ్డుతగిలేమంటే శరీరానికే ముప్పు వాటిల్లుతుంది. ఇక గతాన్నిగూర్చి దాచటం తెలివితక్కువే.

"మనం జమిందారుల బిడ్డలం. నీ చిన్నతనంలోనే అమ్మ

చనిపోయింది. నాన్నగారి మంచితనంవల్లనైతేనేమి, మనల్ని శని గ్రహంపట్టి రాపాడించటంవల్లనైతేనేమి, కాక అమ్మ పోవటం వల్లనేమి, వీటన్నిటినీమించి విధి మన నుదుట ఈవిధంగా లిఖించటంవల్లనైతేనేమి — ఏదోవిధంగా జమీాందారీ అంతా హారతికర్పూరంలా హరించి పోయింది. అప్పుడు నాన్నగారు పేరుకే జమీాందారు. మనది చాల పెద్దభవనం. యింటినిండా నౌకర్లుతిరుగుతూ ఎంతో సందడిగా వుండేది. ఈ సందడినంతా కబళించింది నిశ్శబ్దం. నాకు అప్పటికి పదునెనిమి దేళ్ళు. ఆ భవనానికంతకూ నేనూ, నువ్వూ, నాన్నగారూ ఉండేవాళ్ళం. అటువంటప్పుడు నిశ్శబ్దంకాక మరేం సందడి వుంటుంది. నువ్వు బాగా చిన్నపిల్లవు. అటువంటి సమయంలో-

* * *

—విధి వక్రించిందంటే రాజులేకాదు, రాజ్యాలేకాదు ప్రకృతికూడ భస్మీపటలమయిపోతుంది. మానవుడు మున్ముందు ప్రకృతిని జయించగల్గినా విధికి తలఒగ్గాల్సిందే. అసలు విధి నిర్ణయించందే ప్రకృతిని జయించలేడు. మానవుడు జ్ఞాని అయినా, అజ్ఞానిఅయినా విధిలిఖితమే. ఆ విధిని కాలదన్ని ప్రపంచములో నిలువకల్గిననాడు మానవుడే సృష్టికర్త. కాని అట్టిశక్తి మానవునిలో లేదుకనుకే విధికి లొంగిపోతాడు మానవుడు.

అది బందిపోటుదొంగలు బాహాటంగా గ్రామాలపై బడి దోచుకుపోతూన్న కాలం. దేశం నలుమూలలా ప్రజ హాహాకారాలతో అట్టుడికిపోతున్నట్లు ఉడికిపోతోంది. మానవుల్లో

మానవత్వం నశించి, రాక్షసత్వం తలయెత్తటంతో మొండి వారై బండబారిన హృదయాలతో, కసాయివారై వున్మాదంతో కనపడిన వృద్ధులను, పిల్లలను వారువీరను వివక్షత లేకుండ నిశిత కరవారాలకు ఎరగావించి ధనాన్ని రుధిరంతో క్షాళితంచేస్తున్నారు!

కామపిశాచులై కనపడిన ప్రతిస్త్రీని పశుత్వంతో లొంగదీసికొని పతితలుగా మార్చేస్తున్నారు. అన్నవస్త్రాలకు మొహంవాచి బ్రతకాలన్న ఆశకలవారు కీలుబొమ్మలవలె మానభంగమునకు సహించి వారితో కలసిపోతున్నారు. మరికొందరు 'బ్రతికివుంటే బలుసాకైనా తినవచ్చు'నన్న సామెత ననుసరిస్తూ వారి అడుగులకు మడుగులొత్తుతున్నారు. విధి అనుకూలించనివారు అనుకూలించినవారితో పోరాటంసలిపి పరాజయులై పలాయనం చిత్తగిస్తున్నారు; పగవారి చేతలకు ఆహుతై పోతున్నారు. దయాంతఃకరణలు వదలి యిండ్లను, పూరిగుడిసెలను అగ్నికి ఆహుతిగావిస్తూ మానవుల రక్తమాంసాలను పీల్చి పిప్పిచేసే పైశాచికములవలె ఘోరఘాతకాలు గావిస్తున్నారు.

అసలే భార్యపోయిందేఅన్న దిగులుతో మంచంపట్టిన జమీందారు 'కమలనాభం'గారు ఈవార్త వినగానే మూలుగుతూన్న నక్కపై తాటిపండుపడ్డట్లు హడలిపోయాడు. మతి చలించిపోయింది. అందులోనూ వృద్ధాప్యంఅగుటచేత వారు ఈ విషమపరిస్థితులను తట్టుకోలేకపోయారు. అవును. అందరిబ్రతుకులు తామరాకుమీది నీటిబొట్లువలె తయారైనవి. ఏక్షణాన ఏంజరుగుతుందో అన్న భయంతో గుప్పెట్లో గుండెల్ని దాచుకుంటున్నారు. ఎవరికివారే స్వయంరక్షణలో పడిపోయారు.

'తనకుమాలినధర్మం మొదలుచెడ్డ బేరమన్నట్లు' ఎంత జమీం దారుడైతేనేమి? ఎంత స్థితిలోనుంటేనేమి? స్వలాభాపేక్షను వదలి సుడిగుండాల్లో చుట్టుకుపోతూ, మరొక సుడిగుండంలో చుట్టుకుపోతూన్న మనిషిని రక్షించాలని ఎవరనుకుంటారు?

ఆవిధంగా తలచినపక్షంలో మానవుడు మహాత్ముడే అవుతాడు కాని అంతటి ఉత్తమగుణాలుకలవారు ఈ భూప్రపంచంలో చాల అరుదనే చెప్పాలి. యింకా ఏదో కొద్దిమంది ఉండటంవలననే ప్రపంచంలో నీతి, నిజాయితీలు, ధర్మాసు అనే సుగుణాలు నలుదిక్కులనుండి ప్రసారమవుతున్నాయి. అవి ఎంతటి సుగుణాలో వాటిని ఆచరించటంకూడ అంత కష్టం. అష్ట కష్టాలుపడి, రేయింబవళ్ళు నిద్రాహారాలుమాని అతిసున్నితంగా తయారుచేసిన ఒక అపురూపమైన శిల్పరాజాన్ని త్రుటిలో తృణంతో తుంపెయ్యవచ్చు. ఈవిధంగానే మంచిని అలవర్చుకోటం కష్టంకాని, చిటికెలో చెడుని మానవయత్నం లేకుండానే అలవర్చుకోనవచ్చు. అలవాటు పడిపోతాయి వాటంతటవే.

ఓదార్చేదిక్కులేని జమీందారు కమలనాభంకు చింత హృదయాన్ని కాల్చేస్తుంటే పదునెనిమిదిసంవత్సరాల కూతురు 'రత్నావతి' చిన్నపిల్ల 'లత' వారికి ఆధారమయ్యేరు. చంటిపిల్లవానిలా దుఃఖించే తండ్రిని రత్నావతే ఓదారుస్తూఉండేది. కాని ఆమె ఓదార్పులు ఆయనను మరింత దుఃఖపెట్టేవి. తను పోతే పిల్లలు ఏవిధంగా బ్రతుకుతారో? అన్న బెంగతో మరీ మరీ కృంగుపోయేవాడు. జమీందారుపిల్లలుగా పుట్టి అడుక్కుతినాల్సి వస్తుందేమోనని బాధపడేవాడు. ఈ విషయాలు తలంపు

లోనికి వచ్చేసరికి ఆయనహృదయం వెయ్యివ్రక్కలై పోయేది. ఎవరో తన హృదయాన్ని గునపంతో పొడిచేస్తున్నట్లు ఒణికి పోయేవాడు. నలుదిక్కులా మంటలలుముకున్న సమయంలో ఏదిక్కుకుపోవాలో తోచక యింట్లోవుండిపోయిన కుర్రవాని వలె బెంబేలపడిపోయి వలవలా ఏడ్చేసేవాడు. పూలుఅమ్మిన చోటనే కట్టెలు అమ్మాల్సివస్తుందేమోనని విలవిలలాడిపోయే వాడు. తను ఏమయిపోయినా ఫర్వాలేదుకాని, ఆ పసిపిల్లల భవిష్యత్తు ఏమిటాఅని కుంచించుకుపోయేవాడు. ఈ ఆలోచన లలో సతమతమౌతూ అన్నపానాదులను విసర్జించేసాడు. రత్నా వతి ఎంతచెప్పినా తలకెక్కటంలేదు.

"అమ్మా రత్నావతీ మీకు తీరని అన్యాయంచేసి అమ్మ వెళ్ళిపోయింది. అయినా అది అదృష్టవంతురాలు. ఎందుచేత నంటే అది మిమ్మల్ని నాకు అప్పగించింది. అది మీగురించి ఎన్నోవూహాలు పెట్టుకొని అవి నా బుజాలమీద పడేసి పోయింది. ఆ ఆశలు, ఆశయాలు నావల్ల నెరవేరుతాయని దాని పిచ్చినమ్మకం..." అన్నాడు.

"అదేమిటినాన్నా! మీకు ఇప్పుడు మాకేం లోటు చేశారు?"

"ఏం లోటుచెయ్యలేదమ్మా. అసలు ఏం చెయ్యలేదు. అసలు ఒకటంటూచేస్తే లోటుసంగతి ఆలోచిద్దును. నేను పూర్తిగా అసమర్ధుణ్ణి. మరికొన్నాళ్ళుపోతే తిండీబట్టాకూడ పెట్ట లేని స్థితిలోకి మిమ్మల్ని దిగజార్చవలసి వస్తుందేమో..." అన్నాడు దుఃఖాన్ని లోలోనే అణచుకోవటానికి ప్రయత్నిస్తూ.

"అవేంమాటలు నాన్నా" అన్న రత్నావతి మాటలకు

"నీకు తెలియదమ్మా! నువ్వింకా చిన్నపిల్లవు. మన పరిస్థితులు చాల గడ్డుగ పరిణమించాయి. చూడు. కలకలలాడుతూ నిత్యం పచ్చతోరణాలతో, లక్ష్మీనివాసయోగ్యమైన ఈ భవనం, చూడమ్మా ఎలా వెలవెలలాడిపోతోందో. ఆమెతోపాటే ఆ కళాపోయింది." అన్నాడు.

"యిప్పుడు పేరుకే జమీందారుని. 'పేరుగొప్ప ఊరు దిబ్బ' అన్నట్లు మనం జమీందారీలోనుండి దరిద్రదీనావస్థలోనికి జారుకున్నాము. మనల్ని దరిద్రం పూర్తిగా ఆవహించింది. యికదాన్ని జయించటంవల్ల ఈ దరిద్రాన్ని కాలతన్ని నెగ్గుకొచ్చిన వారు ఈ మానవ చరిత్రలో లేనేలేరు. యిప్పుడు లేరు. యిటుపై వుండబోరు. విధి దరిద్రాన్ని మనమీదకు వదలిందమ్మా, వదలింది. ఏనాడో యింతపాపం మూట కట్టుకున్నా. యిప్పుడు అనుభవిస్తున్నా. నాతోపాటు మిమ్మల్ని కష్టపెడుతున్నా. ఇదేనమ్మా నాబాధ. యిది నీకర్థంకాదు. పోయి భోజనం చేసిరా. నే తరువాతతింటా" అని కూతుర్ని సముదాయిస్తూ బేలహృదయంతో ఒణికిపోతూన్న చేతుల్తో కళ్లు తుడుచుకున్నాడు.

'యిక కొన్నిరోజులు ఈ ఊళ్ళోవుంటే ప్రాణాలు దక్కవు. నాప్రాణంపోయినా యిబ్బందిలేదు. కాని తనపేరు మీదుగానైనా ఈ అనాథలు ఈ ప్రపంచములో నిలువగలిగితే చాలు' అని ఆలోచిస్తూ ఉన్ననాలుగైదువేల రూపాయలువిలువగల బంగారు నగలు పుచ్చుకొని ఆవూరువదలి వెళ్ళిపోవుటకే నిశ్చయించుకున్నాడు.

ఎంత లేదన్న అభిమాన మున్నవాడు. పూలు అమ్మిన చోటనే కట్టెలు అమ్మలేడుకదా !

కాని తానొకటి తలిస్తే దైవ మొకటి తల్చాడు. కలసి రానప్పుడు మానవుడు ఎన్నివిధాలుగా యోచించి, ఎన్నిప్రయత్నాలు చేసినా నిష్ప్రయోజనమే. ఆర్నాత్రే మూటా ముల్లా కట్టాడు. ఊరు బాగా సర్దుమణిగినతరువాత ఎవరికీ కనబడకుండ పిల్లల్నితీసుకొని పోదామనుకుంటూ కుర్చీలో కూలబడి, తన అంతస్థూ, తను నివసిస్తూన్న భవనం, నౌకర్లతో నిండుగా హుందాగా వుండే తను- తల్చుకుంటే ఏడుపొస్తోంది. అందుకనే ఎవరికేది ఋణమో అంతే. అనుభవించటానికికూడా పెట్టిపుట్టాలి. అంతా ఒక కలమాదిరిగ జరిగిపోయింది. ఇకమిగిలింది అంధకారబంధురమైన ఈ జీవితం అనుకుంటూ "అమ్మాయ్... రత్నా...రత్నా" అని పిల్చాడు. కాని యింతలోనే అతనికి తెలియని ఒక భయంకరానుభూతి కలిగింది. మళ్ళీపిలుద్దామనుకొని "అమ్మాయ్...రత్నా... అమ్మాయ్..." పిలవబోతే గొంతుక బయటికి రావటంలేదు. విశ్వప్రయత్నం చేస్తున్నాడు. కంఠనాళాలు తెగిపోతున్నాయా యని బాధపడ్డాడు.

హాలు అంతా అంధకారమయమయిపోతోంది. హాలులోని దీపం ఆరిపోయిందేమోనని చూడాలని ప్రయత్నించాడు. కాని కళ్ళు మూసుకొని పోతున్నట్లనిపిస్తున్నాయి. రెప్పలు తెరచి చూడాలని విశ్వప్రయత్నము చేశాడు. గ్రుడ్లూడి క్రిందపడిపోతున్నాయోమోనని భయపడ్డాడు. తెఱచిన నోటినుండి ఏదో బొట్లు బొట్టుగపడటం తెలిసీ తెలియని స్పర్శకలిగింది. చేతులు కదపాలని ప్రయత్నించాడు. కాని అవిస్వాధీనంనుండి తప్పుకున్నా

యేమోనని పించింది. నోరు మూసుకోవాలని శతవిధాల ప్రయత్నించాడు కాని కపాలంపగిలిపోతోందన్నట్లు గిలగిలాడిపోయాడు. బలాన్నంతా కూడగట్టుకొని ఒక్కవిదిలింపు విదిలించాలని విదిలించాడు. అంతే అంతా చీకటి అతనికి. ఏమో ఈ ప్రపంచం ? యిక మరలా ప్రయత్నించలేదు. సూత్రాలు తెగిపోయాయి. పగలేమో ? రాత్రేమో? నువ్వేమో? నేనేమో? తనూలేడు. తనవారూ లేరు.

"చచ్చాడ్రా ముండాకొడుకు. వెధవ ముసల్రిప్రాణం పోవటానికి అధమం పదినిమిషములైనా పట్టింది. జమీందారట... జమిందారు" అంటూ చేతులు దులుపుకున్నాడు.

"పోన్లేరా. చచ్చినతరువాత వాణ్ణని ప్రయోజనమేముంది. మన పనేదో మనం చూసుకుపోవటం మంచిది"

"ఎల్లా అయినా గట్టిప్రాణంరా"

'ఊ. సర్లెద్దు. వాడిప్రాణాన్నేం పొగుడుతావ్. ముందర మనపని మనం చక్కపెట్టుకోకపోతే మరికొంతమంది వాటాలకు దిగుతారు...రా... యిల్లంతా వెదుకుదాం తొందరగా' అన్నాడు విసుగ్గా ముందుయోచనను తలచుకుంటూ.—ఇలా అనుకుంటూయిల్లంతా వెదకటం ప్రారంభించారు. బీరువా తాళం ఒకడు బ్రద్దలుకొడుతున్నాడు. ఈ చప్పుడువిని రత్నావతి పరుగెత్తుకొచ్చింది. ఒక్కక్షణం నిర్ఘాంతపోయి "దొంగ...దొంగ" అని కేకలు పెడ్తూంటే మరొకడువచ్చి మరొక గదిలోనికి తీసుకొని పోతోంటే, బీరువాపగులుగొడ్తూన్నవాడు 'ఆ పీనుగని చంపి అవతల పారేయరా... వెధవ్వేషాలు వేస్తోంది" అని తన పనిలో తాను నిమగ్నమయిపోయాడు.

ప్రాణాలంటే బహుశా వాడిదృష్టిలో గడ్డిపరక లేమో ! గడ్డిపరకను త్రుంచినట్లు తుంపిపారెయ్యాలన్నమాట! యిక అటువంటివారికి పాపభీతేమిటి ? అసలువారికి పాపంఅంటే తెలిసేవుండదు. వాడికి హృదయమే లేదన్నమాట. మానవజన్మఎత్తిన పశువు. కాలకూట విషం వెదజల్లే కాలనాగు, కనపడిన వారిని కాటెయ్యడమే పని. వారి కళ్ళకు ధనరాసులు తప్పించి మరేవీ ఈప్రపంచములో గోచరించవు. ఒకవేళ గోచరించినా వాటికెదురుగా నిలచి ప్రతిఘటించలేవు, ఆ ధనమదాంధులకు, ఆ తస్కరులకూ తామూ మానవులమేనన్న జ్ఞానం ఉండదు.

రత్నావతి నోరునొక్కి కదలకుండా తనదగ్గరగా చేతులతో బిగించాడు. అప్పుడే అతడిలో ఒకవిధమైన వాంఛబయలుదేరింది. ఆమె శరీరం తగలగానే దేహమంతా విద్యుత్ ప్రవహిస్తున్నట్లయింది, రత్నావతి వాడినుండి తప్పించుకోవాలని సాలెగూడులో పడ్డఈగవలె గిలగిలా తన్నుకొంటోంది. ఆమె అల్లా తన్నుకుంటూంటే ఆమెను వాడు మరింత దగ్గరకు తీసుకున్నాడు. అంతే అతడిలో కామపిశాచతలయెత్తింది! నిల్దొక్కుకోలేకపోయాడు. కండరాలు పొంగిపోతున్నాయి. ఒడలంతా చెమట్లుపోసేస్తున్నాయి. ఒక్కక్షణం ఎలాగో నిల్దొక్కుకుని 'కదిలేవంటే చంపేస్తా' అని చిన్నకత్తిచూపెట్టేడు. వణికిపోతూన్న ఆమె మరింత క్రుంగిపోయింది.

వాడు తనకర్తవ్యాన్ని మరచిపోయాడు. అసలుఈ ప్రపంచంలోలేడు. వాడిలో ఒకటేభావం. ఎదురుగా ఒకస్త్రీ. ఒంటరి. కామంరెచ్చిపోతోంది. గదితలుపులు బిగించాడు. పశువులా బుసలు కొడుతూ ఆమెవద్దకు వచ్చాడు. రత్నావతి ప్రాణ

మానాలమీద ఆశవదలుకొని విగ్రహంలా అచేతనంగా నిలబడిపోయింది. అంతులేని పిపాసతో ఆమెచెయ్యి పుచ్చుకొని మంచంవద్దకు లాక్కుపోయాడు ఆమె ఒక మరవలెనడిచింది. "ఊఁ, రా" అన్నాడు. రత్నావతి మాట్లాడలేదు. అసలు యిప్పుడు ఆమె ఆమెలో లేదు. ఆమె తెలివి పనిచెయ్యటం లేదు. వాడు యిక ఆగలేకపోయాడు. తుచ్ఛవాంఛ రెచ్చగొడ్తూంటే ఆమె మెడమీద చేయివేసి పిచ్చిబలంతో ఆమెను ఒక్కలాగు లాగేడు. యవ్వనం ఉట్టిపడ్తున్న ఆమె సౌష్ఠవాన్ని చూడగానే పిచ్చెక్కిపోయాడు. కసితో ఆమెను బిగియార కౌగిలించుకొని పశు బలాన్నంతా ఆమె అవయవాలపై ప్రయోగించాడు. ఆవేశం పెచ్చుపెరిగిపోయింది. లేతగులాబి వర్ణంగల ఆ చెక్కిళ్ళను కసితో కొరికేస్తున్నాడు. ఆకైపులో మానవత్వాన్ని మర్చిపోయాడు. ప్రస్తుతం అతడికి ఈ లోకమే లేదు. ఏదో తెలియని ఆనందం, యిక ఈజన్మలో దొరకని సౌఖ్యం. జన్మ సార్థకమైపోయిందేమో. అలా ఎంతసేపున్నాడో అతడికే తెలియదు.

ఆవేశం చచ్చిపోయింది. అంతంలేనికోరిక దరికిచేరింది. ఈ ప్రపంచంలో పడ్డాడు. ఇప్పుడిప్పుడే బాహ్యం అవగతమౌతోంది. నెమ్మదిగా లేచాడు. రత్నావతిని చూచేసరికి ఎందుకో అతడిలో భయం తలఎత్తింది. తను గావించిన ఘాతుక చర్యకు ఆమె చచ్చిపోయిందేమోననుకున్నాడు. ఇంక అక్కడ ఉండలేకపోయాడు. ఆమెనక్కడే వదిలేసి తిన్నగా హాల్లోకివెళ్ళి రెండవవాణ్ణి కలుసుకొన్నాడు.

"ఏరా యింత ఆలస్యమయిందేం ?" అన్నాడు వస్తూన్న వాణ్ణిచూస్తూ.

"అది చాలా గట్టిముండరా—చావటానికి చాలసేపు పట్టింది" అన్నాడు.

"ఏడిశావులే. వెధవ మొగతనం నువ్వూను. ఒక ఆడ దాన్ని చంపటానికి యింతసేపా" అని వాడివైపు కోపంగా చూస్తూ "అవున్లే అది పడుచు. ఒళ్ళుకొవ్వెక్కి గింజుకున్నా గింజుకుంటుంది. ముసలాడు వీడే గింజులాడితే అది గింజుకో దేమిటి ?" అని తనలోతానే సమాధానపడుతూ 'నడు పోదాం' అన్నాడు.

"అంతా సత్యమేనా ?"

"ఏంసత్యంరా ? ఇంత కొంప వుందన్నమాటేకాని సరి యైన కట్టుబాటేలేదు. వెధవది ఎన్నిగదులు వెదికినా కొయ్య మంచాలు...మాసినగోడలు శ్మశానం! అంతాచీకటి! పోనీలే దక్కింది దేదోదక్కింది. నడు పోదాం" అని వారిదారిని వారు వెళ్ళి పోయారు.

సునాయాసంగా ప్రాణాల్ని బలిగొన్న మానవులు!

ఇటువంటి సమయాల్లో మనసున్న ప్రతిమానవునకు అసలు దేముడనేవాడు ఒకడున్నాడా ? ఉన్నా వానికి ఎందు కాధిక్యతివ్వాలి? ఒకవేళ వాడు మనలను సృష్టించాడు. కనుక ఆధిక్యత యివ్వాలనుకుంటె...యిటువంటి రాక్షసకృత్యాలు చేసేవార్నెందుకు సృష్టించాడు. యిదంతా పైనుండి చూచి ఆనందించటానికి తోలుబొమ్మలాట అనుకున్నాడా ? ఒకళ్ళ నొకళ్ళు హింసించుకుంటూ, మానభంగం కావించుకుంటూ,

నరుక్కుంటూంటే చూసి ఆనందించేవాడు దేముడా ? మానవ పులకంటే అధికుడా? ఎన్నటికీ కాదు. రాక్షసుడు ! పాషాణి ! అంతే !—అదీ జరిగింది."

* * *

"నాకు తెలివివచ్చి చూసేసరికి అంతా అర్థమైంది. నీపడుపువిని పరుగెత్తుకొచ్చాను. నిన్ను తీసికొని నాన్నగారుగదిలో వున్నారేమోనని అక్కడకు వెళ్లాను. ఆయన కనుపించలేదు. గాఢ రాత్రి ఇల్లంతా "నాన్నా...నాన్నా" అంటూ వెతికాను. ఇల్లంతా శ్మశానంలా ఉంది బావురుబావురు మంటూ. నాన్నగార్ని చంపేశారేమోననే అనుమానం తలయెత్తింది. మరుక్షణంలోనే నాకు జరిగిన అవమానం గుర్తుకొచ్చింది. ఒణికిపోయాను, శరీర మంతా దహించుకపోతోంది. ఆత్మహత్య చేసుకోవాలను కున్నాను. కాని నువ్వు అడ్డువచ్చావు. నేను ఉండికూడ నిన్ను గతిలేనిదానిగాచేసి, చచ్చిమాత్రం ఏమిసాధించను ? అనేఆలోచన తలఎత్తింది. అయితే నా ఆత్మకు శాంతి లేదు. ''పగ! పగ!! కక్ష! కక్ష!!'' అని ఓ అరుస్తోంది ఆత్మ. నన్ను దహించేస్తోంది. పతితనైపోయాను. సంఘానికి తెలియదు. అయితేనేం ఆత్మ! పతితనని తలచుకునేసరికి ఉద్రేకం ఉబికింది. శరీరం వణికింది. కనపడిన ప్రతిపురుషుని కృళ్ళి కృళ్ళి పురుగును చెయ్యాలని అక్కసు బయలుదేరింది. ఆత్మ సంతృప్తి పొందింది.

అంతే – ఆరాత్రి మూటాముల్లాసర్ది నిన్ను తీసుకొని

ఆవూరు వదలిపెట్టేను. ఎక్కడికో ఏమో తెలియదు. అల్లా ఎంతో దూరం నడచిపోయా. మధ్యమార్గంలో "సింహాలు" కనిపించి నామీాద విరుచుకుపడ్డాడు. లోకంలో మానవుడు ఎక్కడచూచినా కామంతో పశువైపోతున్నాడు. అయితే వాడి నెదిరించలేను. వాంఛతీరేంతవరకూ వాడిష్టం వచ్చినట్లు ప్రవర్తించాడు.

తరువాత వాడే నాకు మార్గదర్శకుడయ్యాడు. ఈవూరు చేరుకున్నాం. నన్ను పెద్దలందరకూ పరిచయం చేశాడు. వాడి త్రాగుడికి కావలసినడబ్బు పారేసేదాన్ని. సోదరుడుగా చెలామణీ అయిపోయేవాడు. నేను చాలడబ్బు గడించాను. ఆ డబ్బుతో సంఘంలో పరపతికొన్నాను. "వ్యభిచారిణి అయితేనేం, బీదలపాలిటి పెన్నిధి" అని హృదయపూర్వకంగా అనుకుంటున్నారు. నాకు అదేశాంతి. నావలన అనేక సంసారాలు కూలిపోతున్నాయంటే నేను ఒప్పుకోను. వారి కామవాంఛే వారిసంసారాలను కూలదోస్తోంది. తరువాత వారు కళ్లు తెరచి నానావిధాలుగ తప్పుడుకూతలు కూస్తారు. మొదటే కన్నుకానకపోవటం వారితప్పు. కన్నుకానిన తరువాత వారి తప్పుకువారు ఫలం అనుభవిస్తారు. అందులో నా బాధ్యతేంలేదు, వారిని నేను రమ్మని పిలిచి నాశనం చెయ్యలేదు.

నాన్నగారు నన్ను ఏవిధంగాచేసి యింకా ఏవిధమైన అభివృద్ధిలోనికి తీసికొని వద్దామనుకున్నారో, అదేవిధంగా నిన్ను నేను పైకితీసికొనివచ్చి నాపట్ల నాన్నగారి ఆశయం నెరవేరక పోయినప్పటికీ నిన్ను ఆ విధంగాచేసి ఆయన ఆత్మకు సంతోషం చేకూరుద్దామని, నిన్ను యిప్పటివరకు యితరులకంట పడనీయక

కంటికి రెప్పవలె కాపాడుకొంస్తున్నా. కాని అంతకంతకు నీభారం మరీఎక్కువైపోతోంది. ఊళ్ళోవున్న పెద్దలు నిన్నుచూసి మీాదకు వస్తున్నారు. నేను మొదట ఈ విధమైన చులకన యివ్వడంవలననే వారు నిన్నుకూడ నా మాదిరిగనే తలుస్తు న్నారు. కాని నేను వారియెడల ఆ విధంగా ఉండకపోతే నేడు మనం ఈ విధంగా ఉండేవాళ్ళంకాదు. నాలోనేను దహించుకు పోయి ఆత్మశాంతిలేక, నామరూపాలు లేకుండా పోయేదాన్ని. ఈ ధనమే లేకపోతే నేడు నీవింత గౌరవం నలుగురిలో పొంది ఉండేదానవుకావు. నీలో నిద్రాణమైవున్న కళను ఈ ధనం తోనే మేల్కొలిపేను. నీకు ఏవిధమైన కష్టం, లోటు జరగ కుండ తల్లిదండ్రులను మర్చిపోయేటట్లు పెంచి పెద్దదాన్నిచేసి తల్లిదండ్రులకు ఆత్మశాంతి చేకూర్చాలని ప్రయత్నం చేశాను. కాని నాలో మరేస్వార్థంలేదు మంజూ! నీకేవిధమైన కష్టం కలి గించినా క్షమించు మంజులా...ఆ కష్టమును తొలగించటానికి ఈ తుచ్ఛశరీరాన్ని బలియిమ్మన్నా యిస్తాను" అని కమలం కన్నీరు పెట్టుకుంది.

అక్కను చూడగనే మంజుల హృదయం ద్రవించి పోయింది. కన్నీరు కారుస్తూ వెక్కి వెక్కి ఏడ్చింది. ఇది చూచి కమలం దుఃఖాన్ని దిగమింగుతూ మంజులను తనచేతుల్లోకి తీసి కొని, తలనిమురుతూ "ఎందుకు మంజూ ఏడుస్తున్నావు. నామాట విను. ఏడుస్తేమాత్రం యిప్పుడు ప్రయోజనమేముంది. నువ్వు వీటిని తట్టుకోలేవనే నీకు చెప్పలేదు. ఇప్పుడు నీకు నే చెప్పక పోయినా ఎప్పుడో ఒకప్పుడు చెప్పవలసి వస్తుంది" అంది నవ్వు తెచ్చిపెట్టుకుంటూ.

"అక్కా! నిన్ను అపార్థం చేసుకున్నాను. నన్ను క్షమిం చవూ" అని బూచాడినిచూచి తల్లి హృదయానికి అంటుకు పోయిన పసివానివలె కమలానికి అంటుకుపోయింది.

"ఛా...అదేమిటి మంజూ...యిప్పుడు నువ్వేం తప్పు చేశావు...లే...లే" అని అంటూంటే సారథివచ్చి "ఏమిటి మంజు అక్కదగ్గర గారాలు పోతున్నావు అన్నాడు.

మంజుల సిగ్గుతో ప్రక్కకు తప్పుకుంటూంటే "ఎందుకా సిగ్గు. అన్నయ్యదగ్గరే సిగ్గుపడుతూంటే యిక నేను నిన్ను పెంచడమే కష్టం. సిగ్గుతో అన్నంకూడ మానేసేటట్లు వున్నావు పాపం కలిపి ముద్దలుచేసి బాలచంద్రుణ్ణి చూపెడుతు గోము కోరు ముద్దలు నోటిలో కుక్కాలేమిటి" అన్నాడు నవ్వుతూ.

"అంతమంచి అన్నయ్య దొరికినప్పుడు ఎన్నిగారాలు అయినా చేస్తుంది, అందులో దాని తప్పేముంది!"

"అయితే అక్కచెల్లెళ్లిద్దరు అన్నయ్యను ఒంటరిగాచేసి తప్పుఅంతా మీదవేస్తున్నారన్నమాట. ఏంచేస్తాం ? ఇల్లాంటి వాళ్ళు చెల్లెళ్లు అయిన తరువాత" అన్నాడు నవ్వుతూ సారథి.

"సారథీ! నేను ఈరోజు వెళ్ళిపోతున్నాను. మంజులకు అక్కవైనా, అన్నవయినా, తల్లితండ్రివయినా నీవే. జీవిత పోరా టంలో నెగ్గుకురాలేక పిరికిదాన్నై భారమంతా నీమీద ఒదుల్తు న్నాను. యింతకుముందు మనయిద్దరిమధ్య ఏవిధమైన పరిచయం లేకపోయినప్పటికి మనలో నిన్నటి పరిచయంతో సోదర వాత్స ల్యం పెనవేసుకుపోయింది. ఆధారంలేక పడిపోవుటకు సిద్ధంగ వున్న తీగకు ఆశ్రయంగ నువ్వు దొరికేవు. నీఋణం ఈజన్మలో

తీర్చుకోలేను'' అని సారథిపై తన వాత్సల్యమును చూపుతూ మంజులభారం, తన అసహాయతను వెలిబుచ్చింది.

"నువ్వు అంత బాధపడవలసిన అవసరంలేదు. నాపోయిన చెల్లి మాధవి బ్రతికుంటే నేడు ఈభారమే మోయవలసిఉండేది. నేటివరకు నా జీవితగమనంలో మాధవిలేనివెలితి అడుగడుగునా కనిపిస్తూనే వుంది. అయితే నేటినుండి మంజుల ఆ వెలితిని పోగొట్టి మాధవి స్థానం ఆక్రమిస్తుందని నాతలంపు. అదే నేను పెట్టిపుట్టని అదృష్టం. ఏ మానవునకు ఈ విధంగ పోయినచెల్లెలు లభిస్తుందో చెప్పు కమలం" అన్నాడు సంతోషంతో.

"అవును, ఒకరి అదృష్టాలను మించాయి మరొకరి అదృష్టాలు. కలలోకూడ తలంచలేదు. యిటువంటి మంచి అన్నయ్య మాకు దొరుకుతాడు అని'' అంది కమలం.

చాల ఆశ్చర్యకరంగా ఉంటుంది లోకంలో. ఈ విధంగా ఒకరోజులో మనసులు విడివడి ఒకదానితో ఒకటి ఏవిధమైన అనుమానాలు లేకుండ పాలూనీళ్ళూ మాదిరిగ కలసిపోయూ యంటె మనపెద్దలు ఉట్టినే అనలేదనిపిస్తుంది. వీళ్ళను చూస్తూంటే ''ఏడడుగులు కలిసి నడచిన, ఏడుమాటలు కలసి మాటలాడినా వారు వీరవుతారని" బహుశా వీరందరూ పూర్వ జన్మలో ఒక తల్లికడుపునపుట్టి, ఈ జన్మలో విడిపోయారు, అయినా యిప్పుడు మరలా ఏకమయ్యారు.

కమలం సారథి చేతుల్లో మంజులను ఉంచి, ధర్మారావు వద్ద ఫణిబాబువద్ద శలవుతీసికొని నిశ్చింతగ వెళ్ళిపోయింది.

ఫణిబాబు మంజులకు కావలసిన ఏర్పాట్లు అన్నీ చేస్తు

న్నాడు. ఎప్పటికప్పుడు ఫణిబాబు కమలానికి మంజుల సమాచారం అందిస్తూనే ఉన్నాడు.

సారథి వాత్సల్యంలో ఆమె అక్కనే మరచిపోయిందంటే అతిశయోక్తికాదు.

# 10

ఫణిబాబు మంజులను తనవశం చేసుకోవాలని తాపత్రయ పడుతున్నాడు. ఆమెకు ఎంతో అనుకూలంగ నడచుకుంటు న్నాడు. తనను ఫణిబాబు ఎంతగా ఆరాధిస్తున్నాడో అని మంజులచేత మెప్పుపొంది, తనివి తీరని సౌఖ్యం పొందాలని అను క్షణం వీక్షిస్తున్నాడు. అతను మంజులకు ఎంతదగ్గరగ చేరాలను కుంటున్నాడో ఆమె అంత దూరం పోతోంది. అయితే మంజుల అతడిని తిరస్కార భావంతో చూడడంలేదు. అల్లాగని అతని వెన్నంటి తిరగటంలేదు. ఫణిబాబును ఒకసామాన్యపు వ్యక్తి గను, తనను ఆరాధించే ఒక కాముకగనూ తలుస్తోంది. కాని ఆభావన ఎప్పుడూ వ్యక్తం చెయ్యలేదు.

మంజుల మధు చిత్రించిన తన చిత్రాన్నిచూస్తూ తన్మయత్వంలో ఈ ప్రపంచాన్నే మరచిపోయింది. నయనాలు మాత్రం చిత్రాన్ని తదేకదృష్టితో చూస్తున్నాయన్న మాటే

కాని మనోనేత్రాలు తనమెదడులో నిర్మించుకున్న మధు చిత్రాన్నే చూస్తున్నాయి. ఆమె ఏవేవో ఊహలతో ఎక్కడో విహరిస్తోంది.

మధుని చూడగనే శరీరమంతా సిగ్గు తెరలు తెరలుగ కప్పేస్తుంది. మేను జలదరిస్తుంది. మాట ఒణుకుతుంది. తలయెత్తి మధును చూడాలని ప్రయత్నిస్తుంది కాని, ఆమె చేతనవలేదు. ముఖము ఎత్తకుండగనే ఆపాదమస్తకము కన్నులతో మధును తడుముతుంది. అతని కన్నులకు తనకన్నులు జోడుకాగానే ఎందుచేతనో ఆమె తత్తరపడిపోతుంది. ఒళ్ళంతా చెమటలు పోస్తాయి. మోము యెఱ్ఱబారి పెదిమలు అదురుతాయి. ఆవిధంగ పెదిమలు స్థంభించినప్పుడు ఆమె నోటినుండి ఒక వింత కాంతిని చూచి మధు మధురంగా ఒక చిన్నచిరునవ్వు విసరి "ఏమిటి ఫణిబాబు! ఈమధ్య మనభవనంలోనే ఉండిపోతున్నావు" అన్నాడు.

ఫణిబాబు యిదేమి గమనించకుండా మంజులనే చూస్తు న్నాడు. ఆమె మధును చూడగనే ఎందుకావిధంగ తత్తరపడి పోతుంది? అన్నప్రశ్న ఫణిబాబు బుఱ్ఱను తొలిచేస్తోంది, కాని సరి యైన సమాధానం దొరకటంలేదు.

"ఫణిబాబూ! బొత్తిగ గుడిపాముపై పోయావేమిటి?" మళ్లా అన్నాడు గట్టిగ ఫణిబాబు బుజంతడుతూ.

ఫణిబాబు ఖంగారుగా తేరుకుంటూ "ఆ ... ఆ ... " అన్నాడు.

అతడి ఖంగారునుచూచి మధు గట్టిగ నవ్వేశాడు.

మంజుల శ్రుతికలిపింది. తనఖంగారుకు తనే ఆశ్చర్యపడ్డాడు ఫణి బాబు. అయినా సర్దుకుంటూ "ఏమిటి?" అన్నాడు.

"ఏమీలేదు" అని సన్నగాఅంటూ మంజుల గట్టిగా నవ్వింది. ఈసారి ఆమెనవ్వుకు వంతపాడేదు మధు.

వీరి యిద్దరి నవ్వుచూచి నవ్వురాకపోయినా బలవంతాన తెప్పించుకున్నాడు ఫణిబాబు. అయితే అగ్నిలోపడ్డ శంఖంలా మాడిపోతోంది అతడి హృదయం. వారినవ్వులు అతడిలో ద్వేషాన్ని రెచ్చగొట్టాయి. శరీరం కుత కుతా ఉడికిపోతోంది. కనుబొమ్మలు అదురుతున్నాయి. వ్యక్తంకాకుండ ఉంచాలని ప్రయత్నించాడు. కాని కుదర లేదు. యిక అక్కడఉంటే లాభం లేదని విసురుగ బయటకు నడచాడు.

అతడి ప్రవర్తననుచూచి మంజుల, మధు తెల్లబోయి ఒకక్షణంలో తేరుకున్నారు.

కాని వారిమధ్య మౌనం గాఢంగా అలుముకుంది. ఒకరితో ఒకరు తనవితీరా మాటలాడుకోనవలె ననుకున్నారు. మనస్సునిండా మాటలు వున్నాయి. పైకిరావాలని ఉబలాట పడుతున్నాయి. అయితే అవి వ్యక్తం కాలేకపోతున్నాయి. యిద్దరూ తలలువంచుకొని సంభాషణ ఏవిధంగా ప్రారంభించాలా అని యోచిస్తున్నారు.

"ఏమిటి? రాతివిగ్రహాలు వలె మూతి బిడాయించు కొని మౌనధారులై కూర్చున్నారే" అంటూ సారధి నవ్వుతూ వచ్చి, మధుప్రక్కన కూర్చున్నాడు.

తీయని మనోవేదనతో హృదయాలు బరువెక్కి వ్యక్తం

చెయ్యలేని పరిస్థితిలో సారథి మాటలు వారి మౌనధారణను నెమ్మదిగ మీటాయి.

"ఆఁ... ఏంలేదు. ఫణిబాబు కోపంతో వెళ్ళిపోయాడు. అతడికి ఒకపాలు ఈర్ష్య జాస్తీయే" అన్నాడు మధు.

"ఒకపాలు ఏమిటి నూటికి నూరుపాళ్లు అయినా అసలు మీరు అతనితో కలసి తిరగడమేమిటి? నేను యిల్లాఅంటు న్నానని మీరుమరొకవిధంగా అనుకోకండి. అసలు ఫణిబాబులో సాత్వికగుణం వెతికిపట్టుకుందామన్నా కనుపించదు. తాను తన్ను గూర్చి బహుశా అతడు ఎప్పుడూ ఆలోచించియుండడు. మనిషి అయినతరువాత మానవధర్మాన్ని విడనాడటం మానవజాతికే కళంకం. నీతికే అప్రతిష్ట.

ఫణిబాబులో నీతి, ధర్మం అనేవి రెండూ కనిపించవు. అవి అతడిలో ఏమూలనైనా దాగియున్నాఅతడికాంక్షలో కలసి పోతాయి. బాహ్యంగానే అతడిలో అవిగోచరిస్తాయి. తనకాంక్ష తీరేవరకు పశువై ప్రవర్తిస్తాడు. ఎటువంటి నికృష్ట, సాహస కృత్యానికైనా పాల్పడుతాడు. అగ్ని శిఖలకు ఆహుతి అయిన శలభములవలె మాడిపోతారు. అతడికాంక్షకు గురిఅయిన వారు అందుకే దుష్టుడికి దూరంగ ఉండటం మంచిది. విషసర్పం అని తెలిసుండికూడ పాలుపోసి మచ్చికచేసికొందామని ఉబలాట పడ టం మూర్ఖత్వం.

కనుక నేచెప్పేది ఏమిటంటే ఫణిబాబుకు కాస్తంత దూరంలో వుండటం మనం మనకు మేలుచేసికొనడం అంటూ మంజులవైపు చూస్తూ, "నువ్వు ఏమాత్రం చనువిచ్చినా ఫలితం శూన్యమైపోతుంది. అక్క నిన్ను నాచేతులలో ఉంచింది.

నాగౌరవం కాపాడడం నీవిధి. అక్క ఆశయాలు నెరవేర్చి ఆమె ఆత్మకు తృప్తికలిగించి మా అందరకూ సంతోషం కలుగ చెయ్యి" అన్నాడు.

"మీ ఆశీర్వాద బలం వున్నంతవరకూ నాకేభయమూ లేదు. నిబ్బరంగ నిలబడతాను. ఫణిబాబు కాలనాగు అని నాకూ తెలుసు. అయితే అతనితో మంచిగ ఉండకపోతే మొత్తానికి చెడుతుంది. పగపడతాడు. సమయంకోసం పొంచి అమాంతంగ కాటువేస్తాడు. అందుకే అతని ఎదుట ఎదిర్చి నిలవడానికి భయం. ఏసమయంలో ఏంచేస్తాడో అనే అక్క భయపడేది. నేడు ఆమె నిశ్చింతగా ఉంది అంటే అది మీ చేతిచలువే" అంది మంజుల సారధివైపు చూస్తూ.

ధర్మారావు ప్రవేశిస్తూ "సమావేశమయ్యారే కళాకారులు" అన్నాడు.

"రా.. కూర్చో. అధ్యక్షుల రాకకొరకు యిప్పటి వరకూ వేచియున్నాం" అన్నాడు సారధి.

"అయితే వచ్చాం. సభ ప్రారంభింపవచ్చు" అన్నాడు ఠీవిగా కూర్చుంటూ ధర్మారావు.

"చర్చనీయాంశం అధ్యక్షులవారే నిర్ణయించాలి" అన్నాడు సారధి.

సరదాగ నడుస్తూన్న సంభాషణ ఒక్కసారిగ ఆగిపోయింది ధర్మారావు ముఖం గంభీరమైంది అతడిలో అనేక మార్పులు రాసాగినాయి. అతన్ని చూచి సారధి ఆశ్చర్యపోయాడు. మంజుల, మధు ధర్మారావువైపే చూస్తున్నారు. ధర్మారావు కండ్లలో ఏదో ఒక తేజస్సు గోచరిస్తోంది. ముఖము

వర్చస్సుతో వెలిగిపోతోంది. అతడి ఆలోచనలకు తుదిరూపం వచ్చినట్టుగ ఒకసారి తలను యిటునటు ఆడించాడు.

అప్పటివరకూ అతడివైపు చూస్తూన్న సారథి అతడు ఒక నిర్ణయమునకు వచ్చినట్లు గ్రహించి "ఏమిటి వున్నట్టుండి అతి దీర్ఘాలోచనలో పడిపోయావు" అన్నాడు.

"ఏమీ లేదు. కాళీగా కూర్చుంటే మనస్సులో అనేక కోరికలు పుడతాయి. అవి నెరవేరుతాయా లేదా, ఎల్లా నెర వేర్చుకోవాలి అని యోచిస్తూ వుంటాము" అన్నాడు.

"మీరు అనుకుంటే ఏదికాదు, అయినా దానినిగురించి మీరు అంతగ ఆలోచించివలసిన పనేముంది? మావల్ల మీకోరిక తీరేటట్లు అయితే మేమెప్పుడు సంసిద్ధమే" అన్నాడు మధు.

"ఒకరి మనస్సును బాధపెట్టడం అంటే నాకిష్టంవుండదు. అందుకే నేను యింతగా ఆలోచిస్తున్నా. అయినా మానవునకు అనేక కోరికలుంటాయి. అనేకవిధములైన ఆలోచనలు మాన వుడు తన కోరికలను తీర్చుకొనుటకు వివిధ మార్గాలగుండా యోచిస్తూ ఉంటాడు. అవన్నీ తీరుతాయి అనే అతడి ఆశ. అది అత్యాశ. కాని దానిని మానవుడు గ్రహించడు. అందువల్లే తను నిర్మించుకున్న ఊహాసౌధములు నెరవేరకపోతే మానవుడు నిరాశతో కృంగిపోతాడు. అప్పుడుకాని గ్రహించడు. తన కోరికలు, ఊహలు మానవునిలో ఉండతగ్గవుకావని, అందువలననే తనకు నిరాశ ఎదురైనదని.

"అందువల్లనే నాలోని ఆశలను చంపుకొని సాధ్యమైనంత వరకూ మాటలాడక ఊరుకుంటాను మధూ. అయినా నువ్వు తగిన సహాయం చేస్తావనే నాకు నమ్మకం ఉండటంచేత..."

అనిచెప్పబోతూంటే "మంచివారే. మీవంటివారికి సహాయం చెయ్యడంకన్న ఈ జీవితంలో గౌరవప్రదమైన దేముంది. అయినా మీకు సహాయం చేయగలశక్తి నాలో ఏముంది? మీరేమీ ఆలోచించనవసరం లేదు. నాలో శక్తివున్నంతవరకూ కృతజ్ఞతగ రక్తాన్నికూడ ధారపొయ్యడానికి సిద్ధం" అన్న మధు మాటలకు మరలా "నాకు మీ సహాయం లభిస్తుందనే యింత ధైర్యంగా వున్నాను. ఏమమ్మా మంజులా! నీవుకూడ నా అభ్యర్థనను త్రోసెయ్య వనుకుంటాను" అన్నాడు ధర్మా రావు.

"మీరింత యిదిగా అడగటం మాకే చిన్నతనంగా వుంది. ఒకగురువు తన శిష్యురాలిని, తండ్రి తనకూతుర్ని, సోద రుడు తన సోదరిని, స్నేహితుడిని ప్రాధేయపూర్వకంగా అర్థిం చడం శ్రేయస్కరంకాదు. పైగా వారిలో లేనిపోని గుణాలను రేకెత్తించినవారు అవుతారు, ఈ విధంగ అంటున్నానని మీరేం బాధపడకండి. ఎందువల్లనంటే మీరు నాకు ఆప్తులు, పెద్దవారు. మీ సహాయాన్ని పొందుతున్నదానిని. అటువంటి పరిస్థితిలో మీరు చెప్పటకు సంకోచించవలసిన అవసరం ఏముంది. కనుక దయవుంచి మీరు చెప్పదలచుకున్నదేదో చెప్పండి. శక్తివంచన లేకుండా పూర్తిచేస్తాను. అబలనైనా తలచుకుంటే పురుషుల కంటే కొన్నివేలరెట్లు అధికశక్తి కలదానినని నిరూపించుకునే అవకాశం కల్పించండి" అంది ప్రాధేయపూర్వకంగా మంజుల.

ఆమె మాటలకు చిన్న చిరునవ్వుని వెలయించాడు పెదిమలమీద సారథి. ధర్మారావు అడుగబోయేది ఏమిటో? అని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"నాకు నీవు, మధూ చెరిఒక కన్నువంటివారు. ఈ రెండు కన్నులను వినియోగించుకోవలయునని ఆతృత. నేనిర్మించుకున్న ఊహాప్రపంచంలో మీ యిద్దరే ముఖ్యపాత్రలు ధరిస్తారు. అప్పుడే నేకంటూన్న కలలు నిజమవుతాయి. ఈ రెండు కనులతో చూసి ఆనందించగలుగుతాను. దానికి మీరు యిద్దరూ అంగీకరించారు. అదే పరమసంతోషదాయకం.

"నేను ఒక విద్యాసంస్థను నిర్మించాలని అనుకుంటున్నా. అందులో మీ యిద్దరూ అధ్యాపకులు. అది దేశం నలుమూలలవారికి అనుకూలంగ ఉండాలని నా కోరిక.

"మధు తన భావాలను అతిసూక్ష్మంగ చిత్రాలలో జోడించి, ఆ భావాలను నలుగురిపైన ప్రసరింపచేయాలని కోరిక. యిందుకు తగిన ఖర్చులను నేనే భరిస్తాను. తన కళానైపుణ్యాతను విద్యార్థులకు వెల్లడిచేసి దేశం నలుమూలలా వ్యాప్తి చేయించాలని నా కోరిక.

"అదేవిధంగ ఆ పాఠశాలలో మంజులకూడ తన గాన, నృత్యాలను విద్యార్థులందరకూ నేర్పుతుందని ఆసిస్తున్నాను.

"మీలోవున్న కళను గుప్తపరచుకొనకుండా, స్వార్థరహితంగ పదిమందికి వెల్లడిచేసినపుడు ఆకళకు సార్థకత చేకూర్చినవారు అవుతారు. మీలో కళ ఒకటికి రెండింతలుగ యినుమడిస్తుంది.

"మనదేశంలో అనేకమంది పేదవారు అభ్యసించాలని కుతూహలంవున్నా పేదరికంవలన, తగిన అధ్యాపకుడు లేనందువల్ల నిరాశతో విముఖులౌతున్నారు. అటువంటివారి నందరను పైకి తీసికొనిరావటం మన విధి. అందులకే మనకు భగవంతుడు

యింత ధనాన్నికూడ ప్రసాదించాడు. అందువల్లనే నాకు ప్రసాదించబడిన ఈ పవిత్రమైనధనాన్ని పవిత్రకార్యాలకే వినియోగించాలంటున్నాను. అందులకు మీరు సమ్మతిస్తారుకదూ!" అన్నాడు ధర్మారావు, తనలోని చిరకాలవాంఛితమును వెలిబుచ్చుతూ.

"మీరు మాకు యిటువంటి సదవకాశం లభింపజేసినందులకు కృతజ్ఞులం. మాకు తెలిసున్నంతవరకూ వ్యక్తంచేయగలం. దేశంలో నిద్రాణమై, నిర్జీవమైపోతూన్న కళను వుద్ధరించటంకంటె గౌరవనీయమైనది ఈ జీవితంలో యింకేముంది. ఈ విషయమై మీరు యింతగా ఆలోచించారు. అనవసరంగ శ్రమపడ్డారు." అన్నాడు మధు.

"ఏం సారథీ! నువ్వు మాటలాడకుండ కూర్చుండిపోయావేం? నీకిది యిష్టంలేదా?" సారథివైపు చూస్తూ అన్నాడు.

"యిష్టంలేకపోవడమేమిటి? నువ్వు యిష్టంలేనిపని చెయ్యమన్నా చెయ్యవుగా" అన్నాడు.

"చాలసేపు అయిపోయింది వచ్చి. పోయివస్తాను" అంటూ ధర్మారావు వెళ్ళిపోయాడు.

అతని వెనుకనే సారథి తన యింటిదారి పట్టాడు.

"అబ్బ! ఎంత సున్నితమైన మనస్సు, నా జీవితంలో మొదటిమారుగ తటస్థపడ్డ కరుణార్ద్రహృదయుడు. ఆయనకు కళ అంటే ఎంత అభిమానం. మనదేశంలో యిటువంటి కళాభిమానులు అధమం నూటికి ఒక్కరున్నా కళాకారులు ఎంతో అభివృద్ధిచెంది ఉండేవారు. కాని యిప్పుడు నూటికికాదుకదా కోటికి ఒక్కరుకూడ ఉండటంలేదుఅంటే అతిశయోక్తికాదు."

అంది మంజుల ధర్మారావు కళాభిమానాన్ని మనస్సులో తల్చుకొంటూ మధుతో.

మంచి ఎక్కడుందో చెడుకూడ అక్కడేవుంటుంది, వెలుతురును వెన్నంటివచ్చే చీకటిమాదిరిగ. ప్రశాంతతను చెదరగొట్టుటకు ఎప్పుడూ ఏదోఒక భీభత్సం సిద్ధంగానేఉంటుంది. కరుణప్రక్కన కాఠిన్యం కదలాడుచునేవుంటుంది. యిది చాల విచిత్రం. భగవంతుడు మంచిప్రక్కన చెడు ఎందుకు సృష్టించాడో అర్థంకాదు. అయితే ఆదిలో చెడు ప్రారంభించి దానిని మాపుచేయుటకు ఈ మంచిని సృష్టించాడేమో ననిపిస్తుంది. ఏదేమైనప్పటికి చెడుతరువాత మంచి, మంచితరువాత చెడూ ఎప్పుడూ వెన్నంటి తిరుగుతూనేవుంటాయి. కాని ఏఒక్కటి కలకాలం నిలచిపోవు.

"అందువలననే మనం నేడు ధర్మారావుగారి కోరిక ప్రకారం దేశం నలుమూలల మనలోని కళను వెదజల్లి ప్రపంచమునే ఒక కళానిలయంగా చేద్దాం. అందుకుతగ్గ అవకాశం లభింపజేసిన ధర్మారావుగారికి మనమెంతో ఋణపడివున్నాము. నా మటుకు నేను యిటువంటి సదవకాశం ఎప్పుడు లభిస్తుందా యని వేయికళ్ళతో ఎదురుచూస్తున్నాను. నేటికి నా ఆశలు ఫలప్రదం కాబోతున్నాయి–" అన్న మధుమాటలకు మంజుల "ఏత్రోవ తెలియక నాలుగుగోడలమధ్య నలిగిపోతూ, ఎప్పుడు ఏ ప్రమాదం సంభవిస్తుందా అన్న భయంచే ప్రాణాలను గుప్పెట్లో వుంచుకొనివున్న నాకు, నేడు మీ అందరి పరిచయభాగ్యంవలన ఒక మార్గం ఏర్పడింది. దానికి మీరు అందరు తగువిధమైన సహాయం చేస్తారని ఆశిస్తున్నా" అంది.

"మా అందరి సహకారం నీకు ఎప్పుడూ వుంటుంది. మరి నే వెళ్ళివస్తాను" అంటూ వెళ్ళిపోయాడు మధు.

తన జీవితం యిక ఒకపంథాలో నడుస్తుంది. ఇన్నాళ్ళుగ చుక్కానిలేని నావవలె ఈ కఠోరప్రపంచంలో కొట్టుకు పోతోంది. ఇక భయంలేదు. నేటికి అక్క నిర్మించుకొన్న ఆశా సౌధాలు నిజరూపంతో ప్రతిబింబిస్తాయి. ఆమె కలలు ఫలి స్తాయి. అక్క ఎంతమంచిదో. తనకోసం రక్తాన్నికూడ ధార పోసింది—అని కమలమును తలచుకోగానే ఆమెలో నిగూఢమై యున్న వాత్సల్యం పెల్లుబికి నయనాలను తడిపేశాయి.

మంజుల ఆవిధంగా కన్నీటిని కారుస్తూనే నిద్రపోయింది.

సాయంత్రం నాలుగు గంటలయింది. ఫణిబాబు మంజుల కోసం భవనంలోని గదులన్నీ కలయద్రొక్కేస్తున్నాడు. శరీర మంతా చెమటతో తడసిపోయింది. అతనికి అంతకంతకు కోపం అధికమైపోతోంది. యింతలో సారథి కనిపించాడు.

"సారథీ, మంజుల కనిపించిందా" అన్నాడు ఖంగారుగా ఆయాసాన్ని అణచుకుంటూ.

"ఏం అంత ఆయాసపడిపోతున్నావు" అన్నాడు సారథి.

సూటిగా సమాధానం రాకపోయేసరికి ఫణిబాబుకు అరి కాలుమంట నెత్తికెక్కింది. కాని అణచుకుంటూ "మంజుల కని పించిందా" మరలా ప్రశ్నించాడు.

"గదిలో లేదా" అన్నాడు.

"లేదు"

"సాయంత్రం అయిందికదూ. అలా గాలిపీల్చుకునేందుకి వెళ్లుంటుంది."

"ఆమె ఒక్కతేనా ?"

"ఏం, వెళ్ళకూడదా !"

"అది నీ కనవసరం"

"అసలు నువ్వు నన్ను అడగడమే తప్పు"

"అడిగినదానికి సరిగా సమాధానం చెప్పు. ఎంగిలికూడు తిని ఒళ్ళు క్రొవ్వెక్కి తలబిరుసు సమాధానాలు చెప్పకు" అన్నాడు బుసలుకొడుతూ రెచ్చిపోతూన్న ఆయాసాన్ని అణగ ద్రొక్కుకుంటూ.

"ఫణిబాబు! మర్యాదనిచ్చి మర్యాద పుచ్చుకో. నీ చేతి కూడుతో నే బ్రతకటంలేదు. నాకూ రెక్కలువున్నాయి. అయినా నేను మంజులనుగూర్చి నీకు సమాధానం చెప్పవలసిన అవసరం లేదు. అదీకాకుండ మంజుల నా చెల్లెలు. ఆమెపేరు ఎత్తడానికైనా నీకు అర్హతలేదు. ఆమె బాధ్యతఅంతా కమలం నాకు అప్పజెప్పింది" అని అక్కడనుంచి కదలబోతూవుంటే, ఫణి బాబు అతడిచేయి నొక్కిపట్టాడు.

సారధి చేతులను విదలించుకున్నాడు.

"సారథీ... నువ్వు అనవసర విషయాలలో జోక్యం కలిగించుకొని, ముప్పు తెచ్చుకుంటున్నావు. త్రాచుపాముతో చలగాటాలు ఆడుతున్నావని గ్రహించు" అన్నాడు జేవురించిన ముఖముతో.

"ఓ... నాకూ తెలుసు ముంగిసవద్ద పాముప్రతాపం ఎంతో" అంటూ వెళ్ళిపోయాడు.

ఫణిబాబు కోపంతో పళ్ళు పటపటా కొరికాడు. చేతులు గట్టిగ నులిమాడు. "వీడి అంతేమిటో తెల్చుకుంటాను" అని అనుకుంటూ, హఠాత్తుగ ఏదో గుర్తుకువచ్చినవాడివలె మధు గదివద్దకు పరిగెత్తాడు.

# 11

ధర్మారావు మధుగీచిన చిత్రాలను అక్కడ చూస్తున్నాడు. అతడి చిత్రాలలో సింధూరవర్ణం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. చిత్రంలోని అతడి భావనలకు ఆ వర్ణమే ఒక రూపాన్నియిస్తుంది. అణగారిపోయిన మానవత్వాన్ని మేల్కొల్పుతుంది. ఆవర్ణం అటువంటిది. దానిని ఏవిధంగా తయారుచేసేడో అర్థంకాదు. ఎంతసేపుచూసినా చూడాలనేవుంటుంది. మనలోనిరక్తం ఉప్పొంగుతుంది. ఏదో సన్నిహిత సంబంధంకోసం ఆ చిత్రాన్ని చూచి వేగిరపడుతుంది. అందువలననే మధు వర్ణ చిత్రాలు అంటే ధర్మారావుకు ప్రాణం.

ఆ సమయంలో ఫణిబాబు అక్కడకు వచ్చాడు. అన్నను చూచి తెల్లబోయాడు. బయటనుండే చూచేడు మధు అక్కడ వున్నాడేమోఅని. కాని అతడు వున్నజాడలు ఏవీ గోచరించటం లేదు. ధర్మారావు చిత్రలోకంలో నిమగ్నమై యుండటంవలన తమ్ముడిరాకను చూడలేదు.

ఫణిబాబు వెనుతిరుగుతూంటే అతడి నీడ అన్నగారి మీాద పడింది. నెమ్మదిగ తలయెత్తి, వెళ్ళిపోతూన్న ఫణిబాబును చూచాడు ధర్మారావు.

"ఫణిబాబూ" అని కేకవేశాడు.

సమాధానం రాలేదు. లేచి ద్వారంవద్దకు వెళ్ళేడు. అప్పుడే ఫణిబాబు వరండాలోనుండి గబగబా మెట్లుదిగి పోతున్నాడు. కొంచెం గట్టిగా "ఫణిబాబూ" అని మరలా పిలచాడు. ఫణిబాబుకు వినపడిందో లేదో కాని, అప్పుడే మెట్లమీాదనుండి వరండాలోనికివస్తూన్న సారథి "యిక్కడున్నావా! అరగంట నుండి యిల్లంతా వెతికివస్తున్నా" అన్నాడు నవ్వుతూ.

"అవును. ఫణిబాబు అల్లా హడావిడిగా వెళ్ళిపోతున్నాడే" అన్నాడు.

"ఏం పిలిస్తే పలకలేదా ?" అన్నాడు చిన్నగ నవ్వుతూ సారథి.

"వినపడిందో లేదో"

"బహుశా వినపడివుండదులే. ఏదో పోయినవాడిలా ఖంగారుపడుతూ పరుగెత్తుతున్నాడు" అన్నాడు సారథి.

ఫణిబాబు గబగబా తోటఅంతా కలయతిరుగుతున్నాడు. అతడి మెదడులో అనేక ఆలోచనలు దొర్లుతున్నాయి. మంజుల ఏమయింది? మధు ఎక్కడా కనిపించడేం? వీరిద్దరూ కలసి ఎక్కడికైనా వెళ్ళిపోయారా? మంజుల మధును ప్రేమిస్తోందా? ఏమో, ఆరోజు వారిద్దరూకలసి తనను చిన్నబుచ్చారు. మధు ఎంత కృతఘ్నుడు. దిక్కులేనివానిని తీసికొచ్చి ఆదరిస్తూంటే ఇంటివాసాలే లెక్కపెడుతున్నాడు. అతడికి ఇంకా

నాసంగతి తెలియదు. ఒకసారి చూపెట్టాలి, మరలా మంజుల వైపు చూడకుండగ. జీవితంలో ఫణిబాబుఅంటే మరచిపోకుండ చిహ్నంగ ఒక మచ్చను ప్రసాదించాలి" అనుకుంటూ ఎదుటికి నడుస్తున్నాడు.

నడుస్తూన్న కాళ్ళు వున్నట్టుండి ఆగిపోయాయి. ఆశ్చర్య పోయాడు. తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు.

ఎందుకోమరి ఆ ఆశ్చర్యం. ఇందాకటినుండి తను వూహించుకుంటూన్న దేనా! అయితే ఇప్పుడు తనవూహా నిజ మయింది.

జాజిపందిరివద్ద మంజుల ఒక రాతిమీద కూర్చొనిఉంది. మధు ఆమెకు ఎదురుగుండా కూర్చొని, మాటిమాటికి ఆమెను చూస్తూ చిత్రం గీస్తున్నాడు.

ఇదిచూచి ఫణిబాబు అక్కడ నిలబడలేకపోయాడు. అతనిలో విచక్షణాజ్ఞానం నశించిపోతోంది. కోపంతో శరీరం ఒణికిపోతోంది.

మధులేచి మంజులవద్దకువెళ్ళి ఆమె నేత్రాలను కొలు స్తున్నాడు. ఆమె సిగ్గుతో తలవంచుకొంది. మధు నవ్వుతూ ఆమె గడ్డమును పుచ్చుకొని తల పైకిఎత్తుతూ ఏదో అంటు న్నాడు.

ఫణిబాబు ఉద్రేకంతో ఊగిపోయాడు. అసలు దయా దాక్షిణ్యాలు వీడి, మధుమీద పడవలసినవాడేకాని, చడీ చప్పుడూచెయ్యకుండ అక్కడనుండి వెళ్ళిపోయాడు.

చీకటిపడేవరకు మంజుల, మధూ అక్కడేవున్నారు. తరు వాత నెమ్మదిగా తమతమ గదులలోనికి వెళ్లిపోయారు.

భోజనం ముగించి వెన్నెలలోకూర్చుంది మంజుల. అక్కనుచూసి చాలకాలమైపోయింది. మరలా రాలేదు. తను ఇప్పుడు అధ్యాపకురాలు అవుతోంది. తన విద్యను ఇప్పుడు నలుగురికి నేర్పుతుంది. అదేకదా అక్క ఆశయం. తననుగూర్చి ఆలోచించక స్వార్థాన్నివిడచి అక్క ఎంతో శ్రమతో, రక్త మాంసాలను కామాంధులకు బలిచేసి, జీవచ్ఛవంలా జీవితాన్ని గడుపుతూ, తనను యింతటిదాన్ని చేసింది. ఆమె పంచప్రాణాలు నామీదనేపెట్టుకొని జీవిస్తోంది. అటువంటి పరిస్థితిలో నేను నా విధిని మరచిపోవటం కృతఘ్నత. అల్లా ఎన్నటికి జరగదు' అని అనుకుంటూ చంద్రునివైపు చూచింది, సాక్షి నీవు అన్నట్లుగా. కాని ఇంతలో ఒక కారుమేఘం చంద్రుడ్ని కబళించింది.

"మంజూ... మంజూ" బుజంతట్టి గట్టిగ కుదిపేడు అప్పుడేవచ్చిన ఫణిబాబు.

మంజుల ఉలిక్కిపడింది. నెమ్మదిగ అక్కడనుంచిలేచి గదిలోనికివచ్చి సోఫాలో మౌనంగా కూర్చుంది.

ఆమెకు ఎదురుగా ఫణిబాబువచ్చి కూర్చున్నాడు.

సంభాషణ ఏవిధంగా ప్రారంభించవలెనాయని యోచిస్తున్నాడు. సౌమ్యంగ అడిగి అసలు మంజుల ఆంతర్యం గ్రహించాలనుకున్నాడు. కాని ఏవిధంగ సంభాషణకు ఉపక్రమించాలన్న సమస్య తేలక —

"మంజూ ఈమధ్య అక్క యిక్కడకు వచ్చినట్లు లేదే" అన్నాడు.

"అవును" అంది మంజుల.

"అక్కను విడచి నువ్వు యెప్పుడూ యింతకాలం ఉండ లేదనుకుంట. అయినా నీకు యిక్కడ ఏలోటూ లేదుకదూ?"

"ఊ" అంది ముభావంగా.

"నువ్వు అందరికీ చనువుయిచ్చేస్తే ఎల్లాగ? ఆసారథి నోటికి వచ్చినట్లు పేలుతున్నాడు. అయినా అక్కకు బుద్ధిఉండ క్కర్లేదు. ఏవో మంచిమాటలుచెప్పి కమలాన్ని ఉబ్బేస్తాడు. యికనేం, ఆవిడ నీబాధ్యత అంతా వాడినెత్తిమీద పెట్టింది. ఆకులు నాకేవాడు తగుదునమ్మా అని మరొకరికి సహాయంచేయ బయల్దేరేడు. వాడుఆకులునాకుతూంటే వాడికి తోడు మూతులు నాకేవాడు మధు ఒకడు. వాడి గీత బాగాలేదు. కాని, ఏవో పెద్ద గీతలు గీస్తాడట..." అంటూ మంజులవైపు చూచాడు తన ధోరణికి కొంత విశ్రాంతిని యిస్తూ. కానిమంజుల అక్కడలేదు. మంజుల తనను ఒకసామాన్యునిగ జమకట్టింది. అందువలనే తను చెప్పేదివినకుండ లేచిపోయింది... అని అనుకునేసరికి అతడి అభి మానం దెబ్బతింది. అవమానంతో పౌరుషం పుంజుకొచ్చింది. ఆమెను అసలు యింతగ వేడుకొనడమేతప్పు అనుకున్నాడు.

"మంజూ...మంజూ" అంటూ కోపంతో అరుస్తూ వరం డాలోనికి వెళ్ళాడు.

మంజుల అప్పుడే మేఘాలను దాటుకుంటూ వస్తూన్న చంద్రుని తదేక ధ్యానంతో చూస్తోంది.

"మంజులా! మర్యాద మరచిపోతున్నావు. నేను ఫణిబాబు నన్న మాటేమరచి ఏదో యోచిస్తున్నావు. చిన్నచూపు చూస్తున్నావు. అయినా నాకుయిబ్బందిలేదు. నిన్ను నేను మన సారా ఆరాధిస్తున్నాను. కాని నువ్వు నన్ను ప్రేమతో ఎంత

నీచాతి నీచంగా చూసినా భరిస్తాను. నాహృదయమును ఈ జీవితంలో నీకే అంకితంచేశాను. యిప్పటివరకు కామాంధుడనై యెన్నోతప్పులు ఒనర్చాను. కాని నేడు నిన్నుఆరాధిస్తున్నాను. నన్ను నీవు అనుగ్రహించాలి. మంజులా! ఇప్పటివరకు ఈ నోటితో ఏ ఒక్కరినీ అర్థించలేదు. నిన్నే మొదటిసారిగ అర్థిస్తున్నా. ఏమంటావు మంజూ!"

"ఏమనేందుకు ఏముంది? నేనూ నిన్ను ఒకటి అర్థిస్తున్నా. ఆడది హృదయంలో ఒకరికి చోటిచ్చిందంటే తనజీవితంలో మరొకరికి ఆ హృదయంలో స్థానంలభించదు. కనుక నన్ను క్షమించు ఫణిబాబు."

"లేనిపోని ఆశలుకల్పించి కడకు ద్రోహంచేస్తావన్న మాట. నువ్వుఇక్కడకు వస్తే మనిద్దరంహాయిగ ఉండవచ్చనుకున్నా. నాలో కోరికలు లేపావు."

"దానికి నేను బాధ్యురాలనుకాను."

"అంతేనన్న మాట" అన్నాడు గంభీరంగా.

మాటలాడకుండ లేచి నిలుచుంది.

"ఇదేనా నీ ఆఖరి నిర్ణయం" దీనంగా చూచాడు ఫణిబాబు.

"క్షమించాలి ఫణిబాబు. నేను ఒకరికి ద్రోహంచెయ్యలేను. నన్ను నేను వంచించుకోలేను." అంది పచారులుచేస్తూ మంజుల.

"నిజంగానా?"

"దైవసాక్షిగ ఫణిబాబూ!"

ఫక్కున నవ్వేడు. అదిరిపోయింది మంజుల. ఆ నవ్వులో

ఏదో కుత్సితం కనిపిస్తోంది. వికటంగా ఉంది. భయపడిపోయింది. ఫణిబాబు యింకా అలానవ్వుతోనే ఉన్నాడు. అతడిని చూస్తూ రాతి విగ్రహం మాదిరిగ నిలబడిపోయింది.

కొంతతడవైన తరువాత, "ఫణిబాబూ" గట్టిగ అరచింది.

ఒక్కసారిగ ఆగిపోయింది, ఫణిబాబు వికటాట్టహాసం. సూర్యగోళంవలె నిప్పులు కక్కుతూన్నట్లు ఎర్రగ వున్నాయి, ఆతడి తీక్షణమైన కళ్ళు. అతడిచూపుల్లో అగ్నికణాలు రాలుతున్నాయా అనిపిస్తోంది. అటువంటి భయంకర ఆకారాన్ని తన జీవితంలో చూసి ఎరుగక పోవటంవలననే నేడు అతణ్ణిచూచి సాధుజంతువువైన ఆవు పులినిచూచి బెదరిపోయినట్లు బెదరిపోతోంది మంజుల.

"ఏం భయపడుతున్నావా? భయానికి నీహృదయంలో చోటువుందా?" అంటూ హేళనగ మరల నవ్వేడు.

పశువై చరిస్తాడు ఏమోనని భయపడుతోంది, కాని ఆమె రక్షణకై భగవంతుడు పంపించాడా అన్నట్లుగ సారథి, ధర్మారావు ప్రవేశించారు.

వస్తూనే ఫణిబాబు వింతనవ్వును, బిత్తరిచూపులు చూస్తూవున్న మంజులనుచూస్తూ విగ్రహాలుగ నిలబడిపోయారు.

"మంజులా! నామాటకాదని నిలబడినవారు ఇప్పటివరకూ ఎవ్వరూలేరు. నీమనస్సు ఎవరిమీద లగ్నమైనదో నాకుతెలుసు. వాడు ఈభూమిమీద నిలబడాలని నువ్వుతలుస్తే, నువ్వు నాచెప్పు చేతలలో నిలబడాలి. అందులకు వ్యతిరేకించావో ఫణిబాబు పడగవిప్పుతాడు. అంతే, అంతాసర్వనాశనం, భస్మమయం, నీప్రేమ ఒక ఎడారి. నీమనసుగాడు ఒకఎండినమోడు. మరి

జాగ్రత్త. ఆలోచించుకుని తుది నిర్ణయం త్వరగా తెలియ పరచు. మర్యాదనిచ్చి మర్యాదపుచ్చుకో. నాహృదయ ఫలకంపై నీవు ముద్రితమై పోయావు. నన్ను అర్థంచేసుకొని అనుమతించు నేను అర్థించిన ప్రేమను" అన్నాడు.

"అవును! నీ హృదయఫలకంపై ముద్రించుకున్నావు. నీవొక శిలవు. నీ పాషాణహృదయానికి అసలు ప్రేమ అంటే ఏమిటో తెలుస్తేనా. నీది పశువాంఛ. ఆడదాన్ని చెరచటమే నీవృత్తి. నీలో కనుక ప్రేమఉంటే ఏనాటికీ బలవంతంతో ఏస్త్రీని కామవాంఛతో చెరచి ఉండేవాడవుకావు. నీ పశు వాంఛకుబలిఅయి ఎంతమంది స్త్రీలు అధోగతిపాలు అయ్యారో యోచించు. ఆడదానికి పవిత్రతే పెట్టని ఆభరణం. కనుక నా హృదయాన్ని, నా వ్యక్తిత్వాన్ని కాపాడుమని ప్రార్థిస్తున్నా" అంది.

రౌద్రుడై పోయాడు. అమాంతంగ లేచి నిలబడుతూ "ఇదేనా నీ ఆఖరినిర్ణయం, జాగ్రత్తగ ఆలోచించుకో..." అంటూ౦టే ధర్మారావు, సారథి వచ్చి కూర్చున్నారు.

వారిని చూడగనే ఫణిబాబు వేగంగా బయటకు నడ చాడు.

మంజుల మాట్లాడకుండగ నిలబడిపోయింది.

మంజులస్థితిని, ఫణిబాబు చర్యలనుగాంచి ధర్మారావు చాల బాధపడ్డాడు మనస్సులో. తన తమ్ముని చర్యలు తనకే సిగ్గు అన్నట్లుగా ముఖందించుకొని మౌనంగా కూర్చుండి పోయాడు.

ప్రతిరోజురాత్రి సారథి, ధర్మారావులు కలసివచ్చి, మంజు

లతో కబుర్లు చెప్పటం అలవాటు. ఆమెకు ఏవిధమైన లోటు లేకుండ యిక్కడ సవ్యంగా జరుగుతోందో లేదోయని అతడి బాధ. ఈరోజు ఫణిబాబు పశుత్వం కళ్ళార చూచాడు, అయితే ఏంచెయ్యలేకపోయాడు.

"ఏమిటి ధర్మారావు...ఫణిబాబునుగూర్చి ఆలోచిస్తున్నావా?"

వంచినతల యెత్తేడు. కాంతివిహీనమైపోయింది ముఖం. కాని ఏమీ మాట్లాడలేదు.

అతడు బాధతో కృంగిపోతున్నాడని గ్రహించి సారథి- "ఫణిబాబునుగూర్చి తెలియనిదేముంది? ఎప్పటివలెనే ఈరోజున ప్రవర్తించాడు. అయితే అతడినిగూర్చి నువ్వు వినటమేకాని కళ్ళారా చూడలేదు. ఇప్పుడు చూశావు కనుక యింతగా బాధపడుతున్నావు. అతడి ప్రవర్తన మాకేమీ కొత్తకాదు. బాధపడకు" అన్నాడు.

"అదికాదు సారథీ! నేను ఒకరిబాధ్యత తలమీద పెట్టుకున్నందుకు దానిలో ఏలోపంవచ్చినా నాదేకదా తప్పు. ఆ అమాయకురాలు మనమీద నమ్మకంకొద్దీ ఈమెను యిక్కడ ఉంచింది. ఆ నమ్మకంకూడ ఆమెకు మనమే కలిగించాము. అందువల్ల ఈస్థితిలో ఏచిన్నలోపం కలిగినా నా మనస్సు బాధ పడకమానదు. అందులోను స్వయానా తమ్ముడు, కళ్ళయెదుట, ఆశ్రయమిచ్చిన అబలను అనుభవించాలనే తుచ్ఛవాంఛతో బాధపడుతున్నాడంటే యింతకంటె తలవంపేముంది. యిటువంటివి చూడటం, వినటం కంటె ఈ ప్రదేశాన్ని విడచి పారిపోవడమే మేలు అనిపిస్తుంది. తోటిస్త్రీని సోదరిభావంతో

చూడని మానవుడూ ఒక మానవుడేనా? అయినా నాదే పొరపాటు. ఇటువంటి కిరాతకుడు ఇంటిలో ఉండగా ఆమెను ఇక్కడ ఉండమనటం మూర్ఖత్వం" అని బాధతో యింకా ఏదో అనబోతుంటే'' అదేమిటి ధర్మా? ఇందులో నీబాధ్యత ఏముంది? ఆమెకు ఏమాత్రం కీడుకలిగినా సంజాయిషీ చెప్పుకోవలసిన వాడిని నేను. ఆ పాపపుణ్యాలు నావి" అన్నాడు సారథి.

"ఏదిఏమైనప్పటికి మంజుల యిప్పుడు నా ఆశ్రయంలో ఉందికదా? ఛీ...ఛీ.. ఒక ఆడదానిశీలం కాపాడలేని నా బ్రతుకూ ఒకబ్రతుకేనా ?" అని వాపోతూంటే మంజుల ఒణుకుతూన్న గొంతుకతో "ఎందుకల్లా బాధపడతారు, ధర్మారావుగారూ? మానవునకు అనేకరకాల కాంక్షలు ఉంటాయి. అనేకం చెయ్యాలని అనుకుంటాడు. లోపం లేకుండా చెయ్యడానికి ప్రయత్నిస్తాడు. అయితే దైవం అనుకూలించవద్దా? వాడినుదుట భగవంతుడు ఎలావ్రాస్తే అలా జరుగుతుంది. విధినికాదని మానవుడు చేయగల్గినదేముంది చెప్పండి. అందువల్ల మీరేమీ బాధపడకండి. నా నుదుట అదృష్టంవుంటే బ్రతికి బయటపడతాను శీలంతో. లేదా అప్పుడు జరగవలసిందేదో జరిగిపోతుంది, ఒకరికర్మకు ఒకరు కర్తలుకారుగా" అంది మంజుల కళ్ళనీళ్ళను తుడుచుకుంటూ.

"అదేమిటమ్మా మంజూ! అల్లాఅని చూస్తూ ఊరుకోమంటావా? ఇందుకేనా కమలం నిన్ను మాదగ్గర ఉంచింది. చేతులుకాలిన తరువాత ఆకులు పట్టుకుంటే లాభం ఏముంది చెప్పు? అందువలన ముందర మనజాగ్రత్తలో మనం ఉండటం మంచిది. అదేకాకుండ నువ్వింత దిగాలుపడిపోతే ఎల్లాగ?"

అంటూ ధర్మారావు వైపుచూస్తూ, "బాగుందిధర్మా! ఆమెకు ధైర్యం చెప్పవలసిందిపోయి ఇల్లా బేలవైపోతే మంజుల ఎల్లా నిలువకలదు? ఇటువంటి చర్యలు జరుగకుండ వేయికళ్ళతో కని పెడుతూ తగుచర్య తీసికోవటం ఉత్తమం" అన్నాడు సారధి మంజులకు ధైర్యం చెబుతూ.

"నువ్వు ఎన్ని చెప్పు, అప్రతిష్ట అప్రతిష్టే. వస్త్రం కాలి మచ్చపడితే మచ్చ మచ్చే. అతుకువేస్తే అతుకే. కానిపూర్వపు అందం ఆ వస్త్రానికి రమ్మంటే వస్తుందా సారధీ?" అన్నాడు.

"అలా అని బాధపడితే కలిగే ప్రయోజనం?"

"ప్రయోజన మేముంది, కొంత హృదయభారం తగ్గటం. అంతకంటే మానవుడు చెయ్యగలిగిం దేముంటుంది?"

"యిప్పుడు చెయ్యిమించిపోలేదు కాబట్టి మన జాగ్ర త్తలో మనం ఉండటం మంచిది."

ధర్మారావు ఏదో అనబోతుంటే మంజుల ఎదుట యిటు వంటి సంఘటనలు చర్చించటం ఏమంత మంచిదికాదని "నడు. చాల ప్రొద్దుపోయింది." అంటూ సారధి బయటకు నడచాడు.

ధర్మారావు లేస్తూ "అమ్మా మంజూ! నీకేంభయవాలేదు. ధైర్యంగ ఉండు. ఆ దౌర్భాగ్యుడు ఏవేవో తప్పుకూతలు కూశాడు. నే ఉండగా నీకేకష్టంరాదు." అంటూ బయటకు నడచాడు.

"వెళ్ళివస్తా మంజులా! నిద్రపో, చాలా రాత్రిగడిచింది. ఆరోగ్యం దెబ్బతింటుంది. తలుపులువేసుకుని జాగ్రత్తగ పడుకో. ఉదయంవచ్చి తగిన ఏర్పాట్లు చేస్తాము" అన్నాడు సారధి.

వారు వెళ్ళిపోగానే తలుపులువేసివచ్చి సోఫాలో కూల బడింది. తలదిమ్మెక్కిపోయింది. తెగని ఆలోచనలు మెదడులో పరిభ్రమిస్తున్నాయి. అలసట ఎక్కువగా వుంది. ఒళ్ళంతా చెమ టలుపోసినాయి. నాలికదప్పికచే పిడచకట్టుకుపోతోంది. జీవితంలో ఎప్పుడూ అంతదాహం ఎరుగదు. నెమ్మదిగా వెళ్ళి కడుపున పట్టి నన్ని మంచినీళ్లు త్రాగేసింది. అయినా దాహం తీరలేదు. యిక తీరదు. అవయవాలు పట్లుతప్పాయి. దృక్కులు శూన్యంలోకి పోతున్నాయి. బ్రతుకంతా ఒక భయంకర సముద్రంలా ఉంది. ఫణిబాబు ఆ సముద్రంలో బడబాగ్ని అయ్యాడు. హృదయం తాపంతో ఉడికిపోతోంది. చల్లటిమాటలుచెప్పి ఓదార్చుటకు కమలమైనాలేదు. కళ్ళు అరమోడ్పు లయ్యాయి. పూర్తిగ తెరు ద్దామని ప్రయత్నించి విఫలురాలు అయింది.ఆ అరమోడ్పుకన్ను లతో ఎటుచూచిన భయంకరమైన ఫణిబాబునవ్వు వినిపిస్తోంది. ఆ నవ్వులో విషవాయువులు వెలువడుతున్నాయి. అతడినాలుక పొడుగుగా ఎదరకువచ్చి ఎప్పుడు మ్రింగేద్దామా అని ఎదురు చూస్తోంది. అతడికండ్లు రెండు అగ్నిగోళాలు మాదిరిగ నిప్పులు గ్రక్కుతున్నాయి. అతడిశ్వాస విషసర్పం బుసలువలె ఉంది. ఎటు చూచినా ఆ తలే, ఆ నవ్వే, ఆ బుసలే, ఆకన్నులే. కళ్లు మూసుకున్నా తెరచినా అదేరూపం. భయంతో వణికిపోయింది. "అక్కా"—ఒక్క కేక అరచి అచేతనంగా పడిపోయింది.

# 12

ధర్మారావును, సారథిని చూడగనే ఫణిబాబు మంజుల వద్దనుండి తోటలోనికి వెళ్ళిపోయాడు.

అతడు చీకటికి జతగాడు. కీచురాళ్ళ రణగొణ ధ్వనులు చక్కటి కోకిల గానాలు. మద్యం అమృతం. నిశాచరుడ. పయోముఖ విషకుంభం.

సారథిమీద తగనికోపంవచ్చింది. అతడిని నమిలి మ్రింగెయ్యాలనుకున్నాడు. అన్నయ్యట ! బాధ్యత అతగాడిదట ! ! ఏమిటో ఆ బాధ్యత. విర్రవీగుతాడు. "గుడ్డివాడికి కుంటివాడు సాయమన్నట్లు' ఆసారథిగాడికి ఈ ధర్మం తప్పని ధర్మారావుగారు సాయం బాగుంది! కాలం మూడేసరికి అందరూ ఒకచోట చేరారు. అడుక్కుతిని, బలసి మేకపోతుగాంభీర్యం మనవద్ద ప్రదర్శిస్తున్నాడు.

అయినా వీడికి బుద్ధి ఉండొద్దు, పైగా జమీందారట! ధర్మారావట ! ! అడ్డమయినవాళ్ళకూ ఆశ్రయంయిచ్చి నెత్తికెక్కించుకోవటం. ఖజానా గుల్ల చేయటం, కళాసేవ అంటూ వాళ్ళనుమేపి, అడ్డమైన అధికారాలు యివ్వడం ఆ సారథిగాడు. ఆ కుక్కయెదుట నన్నుతిడుతూంటే చూస్తు ఊరుకుంటాడా ? ఊరుకోనియ్... ఎంతకాలం ఊరుకుంటాడో. కాలం తనకే చేతుల్లోకి వచ్చిందని తెలియదుకాబోలు.

ఉన్నట్లుండి అతడి దృష్టి మధుమీదకు మళ్ళింది. అంతే, రోమాలు నిక్క పొడిచాయి. భ్రుకిటిలు అదురుతున్నాయి. పెదిమలు వణుకుతున్నాయి. భుజాలు వణకసాగాయి. ఆ చీకటికి ఆ కళ్ళు వెలుగునిచ్చాయి. ఆ చూపులకు ఎదుటనున్న సన్నజాజి పూలు మాడిపోతున్నాయేమో అనిపిస్తోంది. పందిట్రక్రింద వాడి పోయినపూలు మధువు యింకిపోయి అందవికారంగ పడి వున్నాయి. గాలి స్థంభించిపోయింది.

అసలు నాత్రోవకు వీడే అడ్డునిలచాడు. నాహృదయ రాణిని దొంగిలించాడు. ఎంత గుండెధైర్యం. ఒకరి పంచనుచేరి వారియింటికే నిప్పుముట్టిస్తాడా? కృతఘ్నుడు. దుర్మార్గుడు. అయినా నన్ను ఎదిరించి ఎంతకాలం నిలుస్తాడు. అసలు ఈ మంజుల మూర్ఖురాలు. తినడానికి తిండిలేక కట్టుకుందికి బట్టలేక కాగితాలమీద నాలుగు బొమ్మలువేసి అమ్ముకునే తుచ్ఛుడితోనా దీనికి సరసం. అయినా పాపందానికేం తెలుసు, కుర్రది. వాడేదో ఎరచూపెట్టేడు. అది గాలానికి తగులుకుంది. ఆ మాయలాడి కమలం దానికి మరింతప్రోత్సాహ మిచ్చింది. అర్థంలేని నీతులతో ఉపన్యాసాలు యిస్తుంది. 'దొమ్మరి గుడిశలలో దూరటం, గంగాస్నానాలుచెయ్యటం!' ఎవరికి తెలియవు దీనివేషాలు? "వినాశకాలే విపరీతబుద్ధిః" అన్నట్లు నన్నుకాదని వీరందరూ ఎవరికి తోచినట్లు వారుచేస్తున్నారు. ఈ కాలనాగును కాదని తప్పించుకపోయే వారెవరో చూస్తాను. సింహాలు బలితో ప్రారంభమైంది. యింకా ఎంతమంది బలికావలసిన వారు వున్నారో, అని తనలోతాను తలపోస్తూ తనగదిలోనికి వెళ్ళి పోయాడు.

# 13

స్పృహతప్పి పడివున్న మంజులకు అర్ధరాత్రి గడచిన తరువాత తెలివివచ్చింది. మెల్లగ మేల్కొంది. చెమటతో బట్టలన్నీ తడిసిపోయాయి. దీపం కొడికట్టి కాంతివిహీనమై నీడలు ఏవేవో వికారాకృతులతో గోడమీద నాట్యమాడుతూన్నట్లు గోచరించాయి మంజులకు. ఆమెలో భయం మరలా తలయెత్తింది. ఆ నీడలలో మరల ఫణిబాబుఆకృతి ప్రత్యక్షమైంది. యింక అక్కడ ఒక క్షణంకూడ నిలువలేకపోయింది. గబగబ తలుపు తెఱచింది. చంద్రుడు మబ్బులకు భయపడి ఇంటిలో దాక్కున్నట్లున్నాడు. లేకపోతే కారుమబ్బులతో పోరాడి కడకు వాటిచే కబళించబడియుండవచ్చు. ఏమయితేనేం. అంతా చీకటి. భయంకర నిశీథి. కన్ను పొడుచుకొన్నా కానని చీకటి. గాఢాంధకారంలో మిణుగురుపురుగులు యిట్టేమెరసి అట్టే ఆరిపోయి హృదయానికి మరింత భీతికొలుపుతున్నాయి. కీచురాళ్ళ రొద, కర్ణభేరులను రంపంతో కోస్తూన్నట్లుగా వుంది. చీకటి ముసుగువేసుకున్న చెట్లు, దెయ్యాలు జుట్లు విరగమోసుకొని నిల్చున్నట్లు ఉన్నాయి. గాలికి కదలితే అవి నాట్యాలుచేసినట్లు భీతికొలుపుతున్నాయి. ప్రకృతే ఆ బేలహృదయానికి ఒక బీభత్సమును కలిగించింది. మంజుల తట్టుకోలేకపోయింది.

మంజుల పరుగుపరుగున ఆ అంతస్థుపైనే చివరనఉన్న

గదివైపు పరుగుతీసింది. ఆ గదిలోనుండి సన్నటి వెలుతురు ప్రకాశవంతంగా బయటపడుతోంది, దట్టమైన అరణ్యంలో కాలి బాట అన్నట్లుగా.

మంజులవెనుకే ఒక ఆకారం వడివడిగా వస్తోంది. ఇప్పుడు ఆమె యివన్నీ గ్రహించేపరిస్థితిలో లేదు.

తూల్తూ...తూల్తూ... ఆ గది తలుపులను త్రోసుకుంటు చిత్రాన్ని చిత్రిస్తూన్న మధుమీద వెళ్ళి పడింది. స్పృహ తప్పింది. మధు ఆశ్చర్యపోయాడు. ఎంతోఓపికతో గీస్తూన్న చిత్రం విచిత్రంగా మారిపోయింది.

మంజులను వెంటాడిన ఆకారం ఆ ద్వారంవద్ద మాయమైపోయింది. మధు వరండాలోకివచ్చి చూచాడు. ఎవరూ లేరు. నెమ్మదిగ మంజులను పరుండబెట్టి గదితలుపులు వేసి మంచంవద్దకు వస్తూంటే, వరండాలో బరువుగా, వడివడిగా అడుగులచప్పుడు వినిపించింది. ఆశ్చర్యంతో మరలా తలుపులు తెరచి చూచాడు. కాని ఎవరూ కనిపించలేదు. అతడు లోపలకివచ్చి తలుపులు వేసి, మంజులముఖంపై చల్లటి నీళ్ళుజల్లి విసురుతూ కూర్చున్నాడు. కొంతసేపటికి ఆమెకు తెలివివచ్చింది. ఫరవాలేదనుకున్నాడు. ఆమె ఏమీ మాట్లాడకుండ ప్రక్కకు వత్తిగిలి పడుకుంది. అతడికి ఇదంతా అయోమయంగాఉంది. ఆమె నిద్రపోతోందేమోనని, నిద్రాభంగంచెయ్యటం ఇష్టంలేక తను గీస్తూన్న చిత్రంవద్దకువెళ్ళి నిల్చున్నాడు.

చిత్రానికి వింతాకృతివచ్చింది. ఆశ్చర్యపోయాడు. అతడికి గుర్తువచ్చింది. మంజుల తూలుతూ, తను చిత్రంగీస్తుంటే వచ్చి చేతిమీద పడింది. అందువల్లనే ఆ చిత్రంలో అంత

మార్పువచ్చింది. చిత్రం చెడిపోలేదు. కాని అనుకొన్న భావా నికి పూర్తి వ్యతిరేకత కనపడుతోంది.

అదొక రోడ్డు. చాల పెద్దది. జనం చాలమంది నడుస్తు న్నారు ఆ రోడ్డుమీాద. ఆ నడుస్తూన్నవా రందరూ మంచి విలువైనదుస్తులే ధరించియున్నారు. ఎవరుమటుకు వారు పోతు న్నారు.

ఆరోడ్డు అంచుమీాద ఒక గూనివాడు, చింకిరిగుడ్డలు, బక్కచిక్కిఉన్నాడు. చిన్నగడ్డం. మాసిపోయి, దుమ్ము రేగిన జుత్తు, పీచుజుత్తు. కాని వీపుమీాంచి రక్తం ధారలుధారలుగా ప్రవహిస్తోంది. ఆ గూనివాడు చేతులను కొద్దిగ ఎదరకుచాచి నిలబడివున్నాడు.

అతడి ఎదురుగుండ భారీయెత్తునఉన్న ఒక సిల్కులాల్చీ వ్యక్తి నిలపడ్డాడు. ఖరీదైన ధోవతి ధరించాడు. కాని ఆ బట్ట లన్నీ రక్తసిక్తమైపోయాయి. ఎత్తినచేతికి అయిదువేళ్ళకు అయిదు ఉంగరాలు ధగధగ మెరుస్తున్నాయి. అయితే వాటిపై రక్తంపడటంవల్ల వాటిమెరపు హృదయానికి భీతికొలుపు తోంది. అతడిచేతిలో చిన్న బాకువుంది. అది రక్తంలో తడిసి, ఆ బాకునుండి రక్తంఓడుతోంది.

రోడ్డుమీాద అంతమందిప్రజలు నడుస్తున్నారన్నమాటే కాని ఏఒక్కరూ యీవిషయం పట్టించుకున్నవారు లేరు.

మానవత్వం మంటకలసిపోయింది.

మానవుడే దానవుడు.

మానవరక్తమే మానవునకమృతం.

ప్రపంచం ఎంత నీచస్థితి కొడికట్టింది.

ఎంత భీకరదృశ్యం.

మానవలోకం...నరకం...మానవుడే...యముడు!

ఇదీ ఆ చిత్రం. దీన్ని చూచేసరికి మధుకు దుఃఖం పొంగిపొరలింది. 'ఎంత భయంకరదృశ్యం...! ఎంత భయంకర దృశ్యం...!!' రెండుమూడుసార్లు మనస్సులోనే అనుకున్నాడు. ఆ చిత్రాన్నిచూచి గుండె బేజారెత్తిపోయింది. కుర్చీలో కూల పడ్డాడు.

మధు చిత్రాన్ని పూర్తిగ గీసేశాడు. అతడి భావనలో ఆ భాగ్యవంతుడు ఆ గూనివానికి డబ్బువేయటం.

కాని అనుకున్నదొకటి. అయినది వేరొకటి.

అతడి సిల్కులాల్చీకి సింధూరపువర్ణం వేద్దామని కుంచె చేతిలోనికి తీసుకొని బొమ్మవద్దకు పోనిచ్చాడు.

చిత్రంలోని భాగ్యవంతుడు చెయ్యి పైకెత్తినట్లు మధు గీచాడు.

మంజుల చేతిమీాద ఎప్పుడైతేపడిందో ఆకుంచె, రెండవ చేతిలోఉన్న సింధురవర్ణం ఆ చిత్రంమీాద ఒలికిపోయి, ఆఖరకు అతడు గీచినచిత్రం అంత భయంకరరూపం దాల్చింది.

ఆచిత్రాన్ని చూచేసరికి అతడిలో ఏదో భీతి బయలు దేరింది. అతడి హృదయంలో శంక తలయెత్తింది. ఏదో ఆపద వస్తోందని మనస్సు నొక్కి-నొక్కి చెపుతూన్నట్లుగఉంది. అత డిలో ఉద్రేకం హెచ్చింది. రక్తం వడివడిగ ప్రవహిస్తోంది.

దండభాగంనుండి రక్తం కారిపోతోంది. అది అతడికి ఏమీా తెలియటంలేదు. కందిరీగ దొలచినట్లు ఒకచిన్న రంధ్రం

వుంది దండెమీద. అతడి నేత్రాలలో ఆ చిత్రమే నిలచి పోయింది.

మంజుల కలతనిద్రలోనుండి మేల్కొంది. ఎదురుగా కుర్చీలో మధు కూర్చొనిఉన్నాడు. అతడు చలనం లేకుండ కూర్చున్నాడు. నిద్రపోతున్నాడాఅంటే అదీలేదు. కళ్లు ఎదురుగాఉన్న చిత్రాన్నే చూస్తున్నాయి.

మంజులవచ్చి ఆ చిత్రాన్ని చూసింది. ఆ ఎరుపురంగు ఆమెకు భీతిగొలిపింది. అది రక్తంగా గోచరించింది. ఆ చిత్రం మీద చేతితో రాసింది. అప్పుడే ఆరుతూఆరుతూవున్న రక్తం ఆమె చేతినిండా అంటుకొంది. ఇప్పుడాచిత్రం మరింత భయంకరాకారం దాల్చింది. బహుశా ఏ చిత్రకారుడు వెయ్యాలన్నా తలంపుతో ఆ చిత్రాన్ని అంత సహజంగ, అంత భయంకరంగా చిత్రించలేడేమో. చేతికంటుకున్న రంగునుచూచి మధువద్దకు వచ్చింది. అతడుకూర్చున్న కుర్చీఅంతా ఆ రంగుతో నిండి పోయింది. ద్రవం ఏకధారగ కారడంచూచి అతనిని మరింతదగ్గరగ పరిశీలించి, అతడి చేతినుండి రక్తంపడటం గ్రహించింది.

మధు చిత్రాలలోని ఎఱ్ఱటివర్ణం మానవరక్తాన్ని ఎందుకు తన సన్నిహితం చేసికుంటుందో. మానవునిలో ఎందుకు ఉద్రేకంకొలుపుతుందో తెలుసుకొని మధు కళాపిపాసకు ఆశ్చర్యపోయింది. కళకోసం రక్తాన్నికూడ ధారపోస్తాడన్న మాట! రంగు కావలసివచ్చినప్పుడల్లా చేతినుండి రక్తం గ్రహిస్తాడన్న మాట! ఎంత గొప్ప చిత్రకారుడు ! తను... తనకు వచ్చిన ఈ నాట్యం ఈ సంగీతం ఆతడికాలి కొనగోటికిగూడ సరిపోలదు. ఎంతటి కళాకారుడైనా కించిత్ మాత్రంకూడ గర్వండండదు.

ఎప్పుడూ చిరునవ్వు చిందులాడుతూనేవుంటుంది అతని పెదిమల మీద.

అతడిరూపం మదిలోనికి రాగానే మేను పులకరించింది. సిగ్గుపొడసూపింది. కన్నులు వాలిపోయాయి. దొంగచూపులు మధుమీదకు ప్రసరించింది.

అంతే, భయంతో ఒణికిపోయింది. గాభరాతో మధును తట్టిలేపింది. అతడు ఉలిక్కిపడుతూ లేచాడు. మంజులను చూచి చిరునవ్వు నవ్వేడు. "ఏంమంజులా! ఏమిటి అసలుకథ. అర్ధరాత్రి ఇల్లా పరుగెత్తుకువచ్చావు. ఎవరో తరుముకొచ్చినట్లున్నారే. అంత హడలిపోయి ఇక్కడకువచ్చి సోలిపోయావే. నీ సంగతి చూస్తే అంతా అగమ్యగోచరంగా ఉంది నాకు. ఇంతకూ అసలు కథేమిటి?" అన్నాడు.

అతడి మాటలు మంజులకు నిజంగానే కోపం తెప్పించాయి. అవతల చేతినుండి రక్తం కారిపోతూంటే తనస్థితి ఎల్లా వుందో తెలుసుకోలేనివాడు ఎదుటివారి స్థితిగతులను యోచిస్తున్నాడని ఆమెకోపం.

మౌనంగా ఉండిపోయింది.

"ఏమిటి? కోపమా? అలుకా?"

"బాగుంది. ఎవరిమీద కోపం."

"అయితే అలుకా?"

"తీర్చే వారెవరున్నారు ?"

"అంటే – ?"

"అది సరేకాని ఆ చేతినుండి చూడండి ఎంతరక్తం కారుతోందో. నేలంతా మడుగు అయిపోయింది. నా స్థితినిగూర్చి తరు

వాత ఆలోచించవచ్చును కాని, ముందర కట్టుకట్టండి. ఇల్లా రక్తం ధారపోసి ఆ చిత్రాలను చిత్రించకపోతేనేం. ఇదేనా మీ కళాసేవ. ఈ విధంగా కళాసేవచేస్తూ ఎంతకాలం బ్రతుకుతారు?" అంటూ ఒకగుడ్డను తడిపి చేతికికడుతూ "అరువది సంవత్సరాలు బ్రతికేవారు పదిసంవత్సరాలు బ్రతకటంకూడ కష్టమే యిల్లా రక్తం ధారపోసి. బాగుంది! మంచి కళాకారులే! ఈ విషయం పాపం ధర్మారావుగారికి, సారధి అన్నయ్యకు తెలియదనుకుంట. ధర్మారావుగారికి తెలిస్తే ఎంత బాధపడతారు. అయినా మీకు యింత మొండితనం తగదు'- కట్టుకట్టడం పూర్తిచేస్తూ అంది.

మధు ఈమె ధోరణినిచూచి ఏమనుకున్నాడోకాని ఒక చిరునవ్వు నవ్వేడు.

"రేపు ఈ సంగతి వాళ్ళతో చెబితేకాని లాభంలేదు" అంది అతడి నవ్వునుచూస్తూ.

ఉలిక్కిపడ్డాడు.

"ఏం అల్లా గాభరాపడతారు. మీకేం ఫరవాలేదు. మొండిగా ఇప్పటిలాగే ఉండండి. వాళ్ళేంచేస్తారు మిమ్మల్ని."

"అదేమిటి మంజూ! అల్లా అంటావేమిటి? వాళ్ళు ఎంత బాధపడతారు?"

"అయితే యీ పనేమిటి?" కుఱ్ఱవాణ్ణి గదమాయించి నట్లు గదమాయించింది.

మధు ఏం మాట్లాడకుండా ఉండిపోయాడు.

చాలసేపు ఇద్దరిమధ్య నిశ్శబ్దం ఆవరించింది. తెల్లవారటం వల్ల పక్షుల కిలకిలారావములు, ఆవులు-దూడల అంబారావ

ములు వినిపిస్తున్నాయి. కోళ్ళు కొంకురో...కోయని అరుస్తు న్నాయి.

మంజుల తెల్లవారిందని గమనించి లేచి నిలబడుతూ "చూడండి మధుగారు! మీరు ఇటుపైన రక్తమును ఈ విధంగా కళకని ధారపోసి, చిత్రాలకు రంగులు వేసినట్లయితే నేను చచ్చి పోయినంత ఒట్టు. నామీద అభిమానం, హృదయపూర్వకమైన ప్రేమే మీలోవుంటే ఆ విధంగా చెయ్యకండి" అంటూ గదితలు పులు తీసుకొని మధు పిలుస్తూన్నా వినిపించుకోకుండ వెళ్ళి పోయింది.

మధుకు మంజుల మాటలు పదేపదే వినిపిస్తున్నాయి.

"నామీద అభిమానం...హృదయపూర్వకమైన ప్రేమ మీలోవుంటే ఆ విధంగా చెయ్యకండి."

ఈ మాటలనే పలుమారులు తలచుకొంటూ తీయతీయని కలలుకంటూ తేలికపడిన హృదయంతో ఆ కుర్చీలోనే ఒక కునుకుతీశాడు.

గబగబా వెళ్ళిపోయిన మంజుల తనగదిలో మంచంమీద కూలపడింది. ఆమెకు మధువద్ద అన్నమాటలు గుర్తుకువచ్చాయి. ఆ మాటలను పలుమార్లు మననంచేసికొంది. తనకుతనే ఆశ్చర్య పడిపోయింది. హృదయం ఉత్సాహంతో కేరింతలు కొట్తోంది. తనకు అంతచొరవ, ధైర్యం ఎల్లావచ్చాయా అని అనుకొంది. ఆమెకు తెలియకుండానే మృదుమధురమైన గానం కూని రాగంగా వెలువడుతోంది. కళ్ళనుండి సంతోషం ప్రకాశిస్తోంది. గానానికి తగ్గట్టుగానే కాళ్లూ, చేతులూ, కళ్ళూ నెమ్మదిగా అభినయం ప్రారంభించాయి.

మంజుల యథాస్థానంలో కూర్చుంది. మధు మిగిలి పోయిన ఆమె చిత్రాన్ని పూర్తిచెయ్యటానికి ఉపక్రమించాడు.

చల్లటిగాలి వీస్తోంది. నీరెండలతాకిడి శరీరానికి గగుర్పాటు కలుగచేస్తున్నాయి. ప్రకృతి వింతవర్ణంతో శోభాయమానంగా ఉంది.

మంజుల యేవో ఆలోచనలతో విగ్రహం మాదిరిగ కూర్చుండిపోయింది. చెట్లలోనుండి దూసుకొనివచ్చిన సూర్య కిరణాలు ఆమె బుగ్గలమీాదపడి మేలిమిఛాయను లేతగులాబి రంగుగా మార్చాయి. ఉంగరాలు తిరిగిన ముంగురులు పిల్ల వాయులకు మెల్లమెల్లన ఆమె మోముపై నాట్యం చేస్తున్నాయి.

మంజుల అందాన్ని జీర్ణింపచేసుకొని ఆమె చిత్రంలో సహజత్వం గోచరించే విధంగా ఇమడ్చాలని తాపత్రపడుతున్నాడు.

ఆమె సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ ముగ్ధుడైపోయాడు. అతడికి ఇప్పుడు ప్రపంచమంతా మంజులమయం. మంజులలో తను, తనలో మంజుల. మంజులలో ప్రకృతి, ప్రకృతిలో తను.

మంజుల ఫణిబాబునుగూర్చి ఆలోచిస్తోంది ఆమె హృదయాన్ని శంక ఆవరించింది. అయితే ఈ సంగతి మధుకు తెలియదు. తెలిస్తే ఏంచేసి ఉండేవాడో? మంజుల ఈ విషయాలు అతడికి తెలియపర్చటం ఇష్టంలేదు. తను ఎల్లాగూ బాధపడుతోంది. ఇతరులనుకూడ ఈ రొంపిలోనికిదింపి తపింపచేయటం ఎందుకని ఆమె తలంపు.

మధు తనచిత్రం చిత్రిస్తున్నాడన్న మాటే మర్చిపోయింది మంజుల.

మంజులచిత్రం తను చిత్రించాలి అన్నమాటే మర్చిపోయి నిలబడిపోయాడు మధు.

ఒకేపరిస్థితిలో ఇమిడిపోయారు ఇద్దరు. అయితే భావనలు ఎవరివి వారివే.

నెమ్మదిగా చీకటులు అలుముకుంటున్నాయి. నిశాచరుడు-ఫణిబాబు నెమ్మదిగావస్తూ వీరినిచూచి నిలబడిపోయాడు. ఎండుటాకులమీద నడవటం మూలమున కొంచం గట్టిచప్పుడే అయింది. అంతలో హఠాత్తుగా ఆగిపోయాడు.

ఈ సందడికి మంజుల తేరుకొని నలువైపులకు ఆశ్చర్యంగా చూస్తోంది. ఫణిబాబు దగ్గరలోనేవున్న చెట్టువెనుక నిలబడ్డాడు. మధు తనను వింతగా చూడ్డంచూచి ముఖం దించేసుకొంది. అతడు విగ్రహంవలె నిలబడిపోవటం గ్రహించి కొన్ని క్షణాలు మాట్లాడకుండ ఊరుకుంది. చీకటి దట్టంగా అలుముకొనిపోయింది. ఇక లాభంలేదని "ఏమండీ మధూ! చీకటిపడిపోయింది, ఇక వెడదామా" అంది.

మంజుల మాటలతో తేరుకున్నాడు మధు. "ఏమిటంటారూ? అరె! అప్పుడే చీకటిపడిందే" అన్నాడు, బల్లకు గ్రుచ్చివున్న మంజుల చిత్రాన్ని గీస్తూన్న కాగితాన్ని తీస్తూ.

"అంటే ?"

"అంటే ఏముంది? మనంవచ్చి కొద్దినిముషాలేకదా అయింది! ఈరోజు చాల విచిత్రంగా గడిచిపోయిందే! ఏమైనా నీచిత్రాన్ని ఈరోజు పూర్తిచెయ్యాలనుకున్నాను కాని..."

"కాని..."

"కాని కాలమంతా నాకు తెలియకుండానే గడచి పోయింది." గడచినరాత్రి గుర్తుకువచ్చి మధురస్మృతులను తలచు కుంటూ "నిన్న అంత అర్ధరాత్రి అల్లా తూలుతూవచ్చావే. అసలు ఏంజరిగిందో చెప్పమంటే చెప్పేవుకావు. పైగా పోయే టప్పుడు నన్ను ఆజ్ఞాపించి మరీవెళ్ళావు. నీ ఆజ్ఞ నా రెండు చేతులు కట్టేసింది తెలుసా ?" అన్నాడు.

"అంత బాధపడుతున్నావా ?"

"ఎందుకు బాధ మంజూ, నీమీద నాకు హృదయపూర్వక మైన, మధురాతి మధురమైన ప్రేమ వున్నప్పుడు నే నెందుకు బాధపడుతాను. నిన్నారాధిస్తాను. నీఆజ్ఞను శిరసావహిస్తాను. నీమీద ప్రేమఉంటే మానమన్నావు" అంటూ మంజులను తన ఒడిలోనికి తీసుకుంటూ ముద్దుపెట్టుకుని "యిప్పుడు నా ఆజ్ఞకు నువ్వు కట్టుబడాలి" అన్నాడు మధు

చెట్టుచాటునుండి నిశాచరుడు యిదిచూచి ఓర్వలేక పోయాడు. తను కామించిన స్త్రీ తన్ను కాదని పరాయివాని హస్తాల్లో పడ్డం తలతీసేసినట్లయింది. సహనం చచ్చిపోయింది. కర్కశుడైపోయాడు. గబగబా వెళ్ళి మధు ఒడిలోనున్న మంజు లను ఒక్కలాగు లాగేడు. మంజుల హడలిపోయింది. మధు నిర్ఘాంతపోయాడు.

అప్పటివరకు కీచురాళ్లు గిజగిజలు, మిణుగురుపురుగుల కాంతి, చల్లటిగాలి ఇతడి పైశాచిక ప్రవృత్తిని చూచి భయంతో స్థంభించిపోయాయి.

అయితే మరుక్షణంలోనే ఏమనుకున్నాడో ఏమోకాని మంజులను మధువద్దేవదలి, గబగబా వెళ్ళిపోయాడు.

మంజులకు దుఃఖం పొర్లుకొచ్చింది. మధు మండిపడ్డాడు. అతడి రాక్షస ప్రవృత్తినిచూచి అసహ్యపడ్డాడు. ఏడుస్తూ కూలబడ్డ మంజులను బుజ్జగిస్తూ గతరాత్రి జరిగిన సంఘటనను ఈ పరిస్థితికి జతపర్చి ఊహించుకున్నాడు. మంజులను వెంబడించింది ఫణిబాబు అనే నిర్ణయించుకున్నాడు. ఆమె తనగదిలోనికి వచ్చినపుడు తను గదితలుపులు తీసివస్తూంటే వినిపించిన బరువైన అడుగులచప్పుడు ఫణిబాబుదే అనుకున్నాడు.

"ఏడవకు మంజూ. యిప్పుడేంజరిగిందని ?" అన్నాడు నెమ్మదిగ. అతడి మాటలువిని ఆమెలోని దుఃఖం మరింత ఉబికింది. "నేను ఇంక బ్రతకటం కష్టం మధూ" అంటూ ఏడుస్తూ అతడిమీద వాలిపోయింది.

"మరేం భయంలేదు. నేనుఉండగా యిటువంటి ఫణిబాబులు వేయిమంది ఏకమ్మడిగావచ్చినా జంకవలసిన అవసరం లేదు. బాగాచీకటి పడిపోయింది...లే..."అంటూ ఆమెను లేవతీసి నెమ్మదిగ మేడమీదకు చేరుకున్నాడు.

మంజులను ఫణిబాబు మధువద్ద వదలివచ్చేస్తున్నాడు. ఆ చీకటిలో అతడికళ్లు అగ్నిగోళాలువలె ఉన్నాయి. చీకటి దట్టమైన పొగమాదిరిగ ఉంది. అతడిలోనికోపం విషజ్వాలై ప్రకృతినే భీభత్సం చేసేలాగుంది. వడివడిగా వస్తూంటే కాలికి ఒక పెద్ద బండరాయి తగిలి క్రిందపడ్డాడు. పెద్దగాయమే తగిలింది, రక్తం ప్రవాహంగా కారుతోంది. కళ్ళు బైర్లుగమ్మాయి. కొంతసేపు

నిలకడగా కూర్చుండిపోయాడు. తేరుకొని పోయినప్రాణం లేచివచ్చింది.

తనకోపానికి, తనమూర్ఖత్వానికి తనే విసుక్కున్నాడు. మంజుల తనది. అయితే తనదాన్ని చేసుకోవాలి. తను మొదట నుండీ మూర్ఖంగానే ప్రవర్తించాననుకొన్నాడు, గతాన్ని ఒకసారి కదల్చి. అయితేయిప్పుడు తనప్రవర్తనలో మార్పువస్తే?-మార్పువచ్చినా ఎవరూ నమ్మరు. తనను నమ్మేవారే లేకపోయారు. నమ్మేటట్లుచేసికోవాలంటే చాలాకాలం పడుతుంది. అంతకాలం తనుఆగలేడు. ఒకవేళ ఆగినా మంజుల తనది కాకుండా పోతుంది అది భరించలేడు. అందువల్ల మంజులను తనదానినిగా చేసికోవాలంటే ఏవిధమైన దారిత్రొక్కవలెనా యని ఆలోచించ సాగేడు.

అతడి ఆలోచనలో కమలం మెరుపులా మెరసింది. కాని యింతలోనే నిరాశ ఆవరించింది, కమలం తనను అంగీకరించిందని. అయితే అన్నయ్యచే చెప్పిస్తే తప్పక ఒప్పుకుంటుందనుకున్నాడు. అవును ఎందుకు ఒప్పుకోదు? మంజులను తను భార్యగా స్వీకరిస్తాడు. ప్రేమిస్తాడు. ఆరాధిస్తాడు. హృదయాన నిలుపుకుంటాడు. కామప్రవృత్తితో ఆమెను స్వీకరించటం లేదుగా, అనుకున్నాడు. అయితే ఈమాటలను నమ్మేదెవరు? తనుపూర్వం ఆ విధంగానే ప్రవర్తించాడు. అందరి విషయంలోనే కాదు మంజులవిషయంలో కూడ ఆవిధమైన భావననే చూపేడు. ఆమెకోసం క్షణక్షణానికి ధనరాసులు గ్రుమ్మరిస్తానన్నాడు. కమలం యిల్లుఅంతా ఒక రాత్రిలో బంగారమయం చేస్తానన్నాడు. అలాకాగా యిప్పుడు తనమాటలను నమ్మేదెవరు? ఈవిధంగా తనలో తానే చాలసేపు

తర్కించుకున్నాడు ఫణిబాబు. ఎంతకీ ఆలోచనలకు అంతం కనిపించలేదు. తను ఈ ప్రపంచానికి మానవుడుగా కాకుండ పోయాడు. తన్ను ఎవరూ నమ్మరు. తనవాంఛలు ఎవరూతీర్చరు? ఈవిధంగా అతడిలో ప్రశ్నలు లేవనెత్తసాగాయి. అతడి హృదయం పరివర్తన చెందసాగింది. గతాన్ని గుర్తుకుతెచ్చి మానవత్వాన్ని అతనికి తెలుప ప్రయత్నించేస్తోంది. అతడి హృదయం బేలఅయిపోయింది. "నువ్వు ఈ ప్రపంచానికి మనిషివికావు. మనిషిగ ఉండటానికి ప్రయత్నించు. నలుగురిలో గౌరవం తెచ్చుకో. మనిషివన్నమాట మర్చిపోకు, కామాన్ని ప్రక్కకు నెట్టి కళ్ళు తెరువు. కాంక్షనువీడి జీవితగమనం సాగించు. నిన్ని ప్రపంచం ఒకమృగాన్ని చూసినట్లు చూస్తోంది. అస్యహించుకుంటోంది. బెదరిపోతోంది. నువ్వొక నయవంచకుడువంటోంది" ఈ భావనలు అతడిలో రేకెత్తగనే చీకటిలోకూడ చూడగల అతడి కళ్ళను అంధకారం ఆవరించింది. భయపడి పోయాడు. పిరికితనం మనిషిని కృంగతీసింది. ఎప్పుడైతే భయం, పిరికితనం అతడిలో ఆవరించాయో అప్పుడే అతడిలో మొండిధైర్యం తల యెత్తింది. భయాన్ని, పిరికితనాన్ని అతడిలోని కోపం తన విష జ్వాలచే మాడ్చేసింది. రౌద్రుడై పోయాడు. మొఖం నల్లబడి పోయింది. కోడ్రెత్తాచై పోయాడు. ఉచ్ఛ్వాశ నిశ్వాసాలు ఎగసివచ్చాయి. వాటిశబ్దం త్రాచు బుసలా ఉంది. యిదే అతడిలోని హృదయ దౌర్బల్యం. హృదయ దౌర్బల్యాన్ని అణచుటకు మొండిధైర్యం ఉపయోగిస్తాడు. ఈ మొండిధైర్యాన్ని అవలంబించనపుడు అతడిలోని యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం నశించిపోతుంది. అటువంటప్పుడు అతడిప్రవర్తన ఎల్లాంటిదో

అతడికే తెలియదు. మనిషిని బాహాటంగా క్రుంగదీసే గుణాలు అతన్ని దుర్గతికి పాలుచేస్తాయి. ఏంచేస్తాం? విధి ఒక్కొక్కర్ని ఒక్కొక్క విధంగ నిర్మిస్తుంది. ఆ విధిని దాటి మానవుడు నెగ్గుకురాలేడు

అతడిని ఆవరించిన మొండిధైర్యం తిన్నగా కమలం వద్దకు తీసికొని పోయింది.

# 14

కమలం భగవద్గీతను చదువుతోంది దేవుని మందిరం ఉన్న గదిలో. బహుశా రాత్రి తొమ్మిదిగంటలయి వుంటుంది. ఆమె మనస్సు నిర్మలంగా వుంది. భగవధ్యానంలోనే ఆమె చాల కాలం గడిపేస్తోంది. సర్వసాధారణంగ వీధివైపే చూడటం లేదు. ఈమధ్య ఆరోగ్యంకూడ దెబ్బతింది. అయితే ఆమె నిత్య కార్యాలు నిర్విఘ్నంగానే కొనసాగిస్తోంది. ఆమె పట్టుదల అటు వంటిది. ఆమె ఆశయాలు అటువంటివి. ఆమె ఆశయం ఈ జీవితానికి తీరదు తీర్చుకోలేదు. ఆమె దాహం అటువంటిది. నాశనం అయిపోనీ, కుళ్ళికుళ్ళి చావనీ— అవేం ఆమెకు అక్కర లేదు. తనపట్ల తనకు పాపపుణ్యాలతో నిమిత్తంలేదు. ఈ ప్రపంచంలో తను ఒకర్తె. అంతే. ఆమెను ఎవరేంచేసినా

ఇబ్బందిలేదు. నాశనమైపోయినా ఫరవాలేదు తను కోరుకుం టూన్నది నాశనమే. అదే ఆమె ఆశయం. నాశనంతో నే ఆశయం నాశనంఅవుతుంది. కాని ఆ ఆశయాన్ని జయించటమంటే కన్నీ టితో సముద్రాన్ని ఈ భూమిపై నిర్మించటం. కాలచక్రాన్ని తిరగకుండ పట్టుకోవటం. సముద్రంలోని నీటినంతా త్రాగటం. విచిత్రాన్ని నిర్వచించటం.

శారీరకంగా ఆమె నీచపడిపోయింది. అయితే ఆమెఆత్మ ప్రకాశవంతమైంది. ఆ ప్రకాశమే ఆ శరీరానికి తేజస్సునిచ్చి, ఒక వింత ఆకర్షణను కలుగజేస్తుంది. అంతే. కమలాన్ని ఆస్వా దించటానికి అనేక తుమ్మెదలు వస్తున్నాయి. ఆమె వాడిపోదు. ఒకటికాదు, రెండుకాదు, అనేకం. క్రొత్తవి, పాతవి. ఇప్పుడు, అప్పుడు, ఎప్పుడైనా. అటువంటిది ఆమె ఆకర్షణ!

ఆమె హృదయం నిర్మలం.

బుద్ధి 'పగ పగ' అని ఆక్రోసిస్తూనేఉంటుంది.

ఫణిబాబు లోపలకు వస్తూనే 'కమలం, కమలం!'— కేకలువేశాడు. భగవద్గీతాపఠనంలోఉన్న ఆమె ఈ అరుపులు విని అదిరిపడింది.

మరలా 'కమలం... కమలం'—

ఈమారు గ్రహించింది ఫణిబాబు వచ్చాడని. అతడు కోపంతో మండిపడుతున్నాడని ఆ కేకలే చెబుతున్నాయి. ఏదో కొంపమునిగిందని పుస్తకాన్నిమూసి బయటకువచ్చింది. ఫణిబాబునుచూచి అదరిపోయింది. త్రాగివచ్చాడు. తూలు తున్నాడు. కాలివెంట రక్తం ఏకధారగా కారుతోంది. బట్ట లన్నీ మాసిపోయి జుత్తు చిందరవందరగ ఉంది. వగురుస్తు

న్నాడు. నోటివెంబడి చొంగ కారుతోంది. 'మస్తుగా త్రాగేశా' డని అనుకుంది. ఏదో ప్రళయం ముంచుకొచ్చిందని తలచింది. మంజుల గుర్తుకువచ్చింది.

మంజులను సారథిచేతులలో ఉంచినప్పటినుండి ఆమె హృదయం కొంత తేలికపడింది.

ఆమెహృదయం యిప్పుడు శంకిస్తోంది.

ఫణిబాబును అడగాలనుకుంది. కాని యిప్పుడు అతడు చెప్పేస్థితిలో లేడు. కాని హృదయం వేగిరపడుతోంది. ఏం చేయటానికి తోచటంలేదు. ఫణిబాబు నిలబడేఉన్నాడు ఆమెలో ఆరాటం పెరిగింది. ఆమెకు ఫణిబాబు యిప్పుడొక రాక్షసుడిలా గోచరిస్తున్నాడు. మానవరక్తం కాంక్షించే రాక్షసునిమాదిరిగ కనిపిస్తున్నాడు.

"కమలం... కమలం" అతడి అరుపులకు యిల్లు దద్దరిల్లి పోయింది. కమలం ఆ అరుపులకు తెప్పరిల్లింది.

ఫణిబాబు సోఫాలో కూలబడ్డాడు.

మనోధైర్యాన్ని చిక్కబట్టుకుంటూ "కూర్చో ఫణిబాబు. ఏమిటి హడావిడి" అని నెమ్మదిగ అడిగింది కమలం.

ఫణిబాబు నిలకడగ కూర్చోలేకపోతున్నాడు.

యిల్లంతా దుర్గంధంతో నిండిపోయింది.

చీరచెంగుతో కమలం ముక్కుమూసుకుంది. ఆ వాసన నాసికాపుటాల్ని చీల్చేస్తోంది.

అతడు తెలివిలోవున్నాడు కాని అవయవాలు పట్టు తప్పాయి. మాటలు ముద్దగా వస్తున్నాయి— "కమలం మర్యాద... మర్యాదఅంటూ ఏడుస్తావు. ఎక్కడుందా

మర్యాద? నీలోవుందా, నీ చెల్లెలులోఉందా? ఏం మాట్లాడవే? కమలం సమాధానంచెప్పు. ఊ తొందరగాచెప్పు. నే మంజులను కోరేను. ప్రేమిస్తున్నాను. పెళ్ళిచేసుకుంటానంటున్నాను... బుద్ధుందా. నీకు బుద్ధుందా? లేదు. నీకూలేదు దానికీలేదు. నన్ను కాదంటున్నారు. ఆ బికారివాడితో పోతానంటోంది. సిగ్గువిడచి వాడితో తిరుగుతానంటోంది. తిరుగుతోంది. ధర్మాలు, నీతులు బోధిస్తావు. ఆడదానికి శీలంఅంటావు. ఏదా శీలం నీలో. ఊ. చెప్పు. పోనీలే... నీ చెల్లెలలో ఏదాశీలం... చెప్పుకమలం... చెప్పు. అది తెలుసుకుందామనే వచ్చేను. ఏదా శీలం? ఏదా ధర్మం? ఏదా మర్యాద? ఊ చెప్పు. తొందరగా చెప్పు. నాకు తొందరపనివుంది... పోవాలి" అన్నాడు ఫణిబాబు.

ఫణిబాబుమాటలు కమలానికేం అర్థంకాలేదు. ఆమెలో అనేకప్రశ్నలు తలఎత్తాయి. మంజులకు ఏదిశీలం? అంటాడు. ఎవరితోనో బికారితో తిరుగుతోందట. ఏమిటీ మాటలు?

బుర్ర తిరిగిపోతోంది. తను మంజులను ఏ ఆశయాలతో పెంచి పెద్దచేసిందో ఆ ఆశయాలన్నీ నాశనం అయిపోయాయా? తన మంజుల తనకు ద్రోహంతలపెట్టిందా? మంజులశీలం మట్టి అయిపోయిందా? తన ఆశయాలన్నీ బూడిదలోపోసిన పన్నీరేనా? ఆమె ఇక అక్కడ నిలువలేక వెనుతిరిగింది.

రెండడుగులు వేసేసరికి మరలా యిల్లు దద్దరిల్లింది. 'కమలం' అన్న ఫణిబాబు కేకతో—

"అడుగు ముందుకువేయక వెనుతిరుగు. త్రాగివున్నాడు ఏదో ప్రేలుతున్నాడు, ఒళ్ళుతెలియక అని అనుకుంటున్నా

వేమో? కాని నేనిప్పుడా పరిస్థితిలో లేను. నాకు నీనుండి సరి అయిన సమాధానం కావాలి. ఏం చీరచెంగుతో ముక్కు మూసుకుంటున్నావు? వాసంగా ఉందా? అసహ్యంగా ఉందా? ఉంటుందిలే. ఫరవాలేదు. కొంచెం ఓపికపట్టు. నీ రోగభోగాల సువాసనలకు ఈవాసన ఏపాటిలే. అయినా వెళ్ళిపోతాను నాకు కావలసింది నీనుండి సరిఅయిన సమాధానం. ఈ వేళ కడసారి రోజు.

నీ సమాధానంతో నన్ను రాక్షసుణ్ణి చేయకు. నాలో నున్న మానవత్వాన్ని చంపకు. ముందరే హెచ్చరిస్తున్నా. తరువాత ఏంజరిగినా ప్రయోజనం ఉండదు.

నిర్విణ్ణురాలైపోయి ఫణిబాబుమాటలను వింటోంది కమలం. అతడిమాటలు ఆమెకు అంతుపట్టటం లేదు. కాని ఎదట ఏదో ఘోరం జరుగుతోంది ఎటువంటిఘోరమో. ఊహ మెదులుతోంది. కాని తృంచివేసింది. ఎందుకొచ్చింది? అర్థం లేని ఊహలతో మనస్సును కల్లోలపరచి, హృదయాన్ని తునాతునకలు చేయటం చిత్రవధకంటే ఒకేసారి ఆత్మహత్యచేసికొని చనిపోవటం ఎంతో మేలు, మంచిది, సులువైనది; అని తలచి మాట్లాడకుండ నిలబడిపోయింది.

"నన్నునువ్వు ఎప్పటినుండో ఎరుగుదువు. నా మనః ప్రవృత్తి నీకు బాగ తెలుసు. అందుకే నన్నుచూసి నువ్వు భయపడుతున్నావు. నేను అనుకున్నది చేసితీరుతా! నాది అంత మొండిపట్టుదల. ఎన్ని అడ్డంకులువచ్చినా విడువను. అయితే మంజులవిషయంలో మాత్రం నేను ఓడిపోయాను. నువ్వేనెగ్గావు. అయితే నేనింతకాలం ఏవిధంగా నడచానో నీకే తెలుసు.

"నేను కొంత ప్రతిఫలం ఆశించాను. దానికి నేడిప్పుడు భిన్నంగా జరిగింది. ఇందులో నా ఓటమిని అంగీకరించను. శీలం శీలంఅంటూ నువ్వుయిక్కడ ఎగబ్రాకటానికి తావులేదు. శీలం బూడిదైపోయింది. కడసారి నావాంఛ మిగిలింది. అయినా నీ కొకటి మనసువిప్పి చెబుదామని వచ్చాను.

"మంజులను మనసార ప్రేమించాను. పెళ్ళిచేసికోవాలను కున్నాను. కాని నేను తొందరపడి తప్పుదారి త్రొక్కాను. అందు వల్లనే నాప్రవర్తన మీకు అనుమాన హేతుభూతమైపోయింది. ఆ అనుమానాన్ని పూర్తిగ మీనుండి వెడలగొట్టాలని ప్రయ త్నించాను. ఎంతవరకు నెగ్గుకొచ్చానో తెలియదుకాని, కొంత వరకూ విజయంసాధించాను.

"మంజులను మాయింటికి తీసికొనివెళ్ళాను. ఇక మంజుల నాదేఅనుకొన్నాను. నాలోని భ్రమ తలయెత్తింది. కాంక్షిం చాను. సమయంకోసం వేచియున్నాను. సమయం దొరికింది. తిరస్కృతుణ్ణి అయినాను. అందుకు నువ్వు కొంత బాధ్యురా లవు. మొదటినుండి ఎంతగానో నిన్ను ఆదరించిన నన్నుకాదని, నువ్వు మంజులను సారథికి అప్పజెప్పావు. అప్పుడే నాకు అర్థ మయింది నీ నీచబుద్ధి. ఊరుకున్నాను. కాని మంజులను మధుని చేరమని ప్రోత్సహించావు. నాయెడల నీకుగల తృణీకారభావం అవగతమైయింది. ఎప్పుడూ వెన్నంటి సదా నీక్షేమంకోరే నన్ను ఒక గడ్డిపరకమాదిరి యెంచావు. నేననేవాడిని ఒకడిని ఉన్నా ననేమాటే మరచిపోయావు.

"దీనికితగ్గట్టు మంజుల అదేవిధంగా ప్రవర్తిస్తోంది. ఆ మధు గాడితో షికారులు కొడుతోంది. ముద్దులు పెట్టించుకుంటోంది.

శీలం...శీలం అని నక్కకూతలు కూశావు. నీలో శీలంవుందా? నీకు లేదుకాని నీ చెల్లెలుశీలంకోసం ప్రాకులాడేవు. ఆ మధు గాడు దాని శీలాన్నికూడ భక్షించాడు రాత్రిలేదు పగలులేదు. ఎప్పుడూ వాడే. దీనిబొమ్మ వాడు గీస్తున్నాడట.

"అప్పుడు నువ్వు నమ్మిన సారథి వారిప్రేమకు సారథ్యం నెఱపుతున్నాడు. అన్నయ్య ఒక గ్రుడ్డివాడు. సారథి ఎంతంటే అంత!

"అయినా నాకు అవన్నీ అనవసరం. మంజులను ప్రేమించాను. పెళ్ళిచేసికుంటాను. ఇది చెప్పడానికి వచ్చావా అని నువ్వు నన్ను ఒక అనామకుడిగా చూడవచ్చు. అయినా ఫరవా లేదు. మొరిగేకుక్క కరవదనుకుంటావు. నేను మొరగడానికి రాలేదు. అయితే ఉసికొలిపేవో కరిచేస్తాను.

"నీమీదవుండే గురివల్ల నేను యిక్కడకు వచ్చాను. మర్యాద పాటించాను. నువ్వు తిరిగి మర్యాద యివ్వు. మంజులను నాదానినిగ చెయ్యి. ఆలోచించుకో." అన్నాడు ఫణిబాబు నిషా తగ్గుముఖం పడుతూంటే.

అయితే యిప్పుడు పరిస్థితి విషమించింది. అడకత్తెరలో పడిన పోకవలె తయారయింది మంజుల జీవితం. ప్రేమించిన ప్రియుడు. తన జీవితానికి అంకితం చేసింది. అతడికి మొదటిసారిగ తనహృదయంలో స్థానం యిచ్చింది. దానిని తుడిచెయ్యలేదు. మంజులేకాదు. ఏస్త్రీ అయినా తన హృదయంలో ఒక్కరికే స్థానం యిస్తుంది. వారినే ఆరాధిస్తారు. అప్పుడే వారిమనస్సుకు సంతోషం. ఆఖరకు వ్యభిచారిణి అయినా అంతే. జీవిత గమనం కొఱకు వ్యభిచరిస్తారు. శరీరాన్ని అమ్ముకుంటారు. నలగకొట్టు

కొంటారు. వారికి ఏవిధమైన శాంతీవుండదు. అయితే హృదయంలో నిలుపుకొని ఆరాధిస్తున్న వారివలన ఆ శాంతిని ఆనందాన్ని పొందుతారు.

అయితే ఫణిబాబు ఆమెను వాంఛిస్తున్నాడు. ఫణిబాబే కాదు అనేకమంది వాంఛిస్తున్నారు. అటువంటివారందరకూ స్త్రీ స్థానం యివ్వకలదా ? స్త్రీజాతి ఈ ప్రపంచంలో ఉండగా అటువంటిది జరగదు. హృదయపూర్వకంగానే వాంఛించవచ్చు. అయినా ఆమెచే తిరస్కృతులు అవుతారు.

పశుబలం ఉపయోగిస్తారు. కత్తుకడతారు... అని ఊహ మనసులో మరలగనే తనరూపం తనకండ్లఎదుట ప్రత్యక్షమయింది. హడలిపోయింది. భయంతో కంపించిపోయింది. ఎంత నీచంగా వుంది తనరూపం. అబ్బ చూడలేను 'ఫో...ఫో' అని తన రూపాన్ని చూస్తూ అరచింది.

"సరిగ్గా ఆలోచించావా ? పోతున్నా...తరువాత బాధపడి ప్రయోజనంలేదు. కసాయివాడిచేతికి కత్తినిస్తున్నావు తెలుసుండికూడ" అన్నాడు ఫణిబాబు, మంజుల "పో...పో..." అన్న మాటలనువిని.

"ఆ...ఫరవాలేదు. స్త్రీ ఒకే పురుషుడికి హృదయంలో స్థానం ఇస్తుందని నీకు నేను అనేకసారులు చెప్పేను. ఆమె అతడినే ప్రేమిస్తోంది. నీకు ఆమె హృదయంలో స్థానంలేదు. అటువంటప్పుడు నీకెందుకు ఆ తాపత్రయం. నావంటివారిని వినియోగించుకో. నీకు కావలసిన తృప్తినిస్తాను. ధనంకొద్దీ తృప్తి

లభిస్తుంది. అంతేకాని అమాయకులమీద నీ పశువాంఛను ప్రసరించనీయకు. మానవత్వం కోల్పోకు.

"నువ్వు ఆమెను ఏవిధంగా ప్రేమిస్తున్నావో ఆమె మరొక రిని ఆ విధంగా ప్రేమిస్తోంది. ఆమె ప్రియుడుకూడ ఆమెను ఆ విధంగానే ప్రేమిస్తున్నాడు. ఒకరికొకరు యిష్టపడ్డారు. ఆతడు అదృష్టవంతుడు. అతడికంటె ఆమెను శతధా మరింత ప్రేమించ వచ్చు నువ్వు. కాని అదృష్టహీనుడవు. నీ విధివ్రాత అక్కడితో ఆఖరు.

"ప్రేమించినవారిని పెళ్ళిచేసికొనేహక్కు మగవాడికిమల్లే స్త్రీకి ఉంది. కనుక ఆమె అతడ్ని పెళ్ళిచేసుకొంటుంది.

"దీనిని కాదనడం ఎవరితరంకాదు. విధి వారిద్దరినుదుట భార్యాభర్తలు అని వ్రాసింది.

"నీ నుదుట భగ్నప్రేమికుడు" అని వ్రాసింది.

కమలం మాటలు అతడిని రెచ్చగొట్టాయి. కోపం ఆపుకోలేక "నీనుదుటన కుక్కబ్రతుకు బ్రతకమని వ్రాసేడుకదూ" అన్నాడు.

"నా బ్రతుకు నీకు కుక్కవలె గోచరిస్తే" ఆ విధంగానే వ్రాశాడు.

"మాటలతో కాలం వ్యర్థంచెయ్యకు. మరొకసారి ఆలోచించిచెప్పు" అన్నాడు సహనాన్ని కూడగట్టుకుంటూ.

"ఆలోచించనవసరంలేదు. ఒక కామాంధుడికి, నీచుడికి నా చెల్లెల్నిచ్చి వివాహం చెయ్యను. వారిద్దరూ ప్రేమించుకున్నారు. పెళ్ళిచేసికొంటారు. ఇందులో నా ప్రమేయమేమీ

లేదు. విధి వక్రించిందంటే వారే అనుభవిస్తారు" అంది నిశ్చింతగా.

"మరి అయితే వెళ్ళివస్తాను. జరగవలసిందేదో జరగక మానదు. నీవద్దకు వచ్చినందుకు కామాంధుడు, నీచుడు-బాగానే బిరుదులు ఇచ్చావు. కాళ్ళవద్దకు వచ్చాను కాబట్టి కుక్క మాదిరిగ ఏహ్యంగా చూశావు. తగినవిధంగా నాకు బుద్ధి చెప్పేవు. వారినుదుట ఏవిధంగా లిఖించివుందో నేనూ చూస్తాను. నువ్వూ చూస్తావు. ఈ శరీరంలో ప్రాణం ఉండగ మంజులను మరొకరికి దక్కనివ్వను. ఈ మాటలు విధి నాచేత అనిపించాడు కమలం అనిపించాడు. జాగ్రత్తగ చూసుకో, నీచిన్నారి చిట్టిచెల్లెలను, ఆమె ప్రియుడిని" అంటూ తూలుకుంటూ వెళ్ళి పోయాడు ఫణిబాబు.

కమలానికి ఏం పాలుపోటంలేదు. నిద్రపోదామనుకుంది కాని నిద్ర దూరమయింది, ఆలోచించకూడదనుకుంది. కాని ఆలోచనలు ఆమెను ఆవరించాయి. ఫణిబాబును మరవాలనుకుంది. అతడిరూపం వికృతంగా తనని పలకరిస్తోంది కూర్చోవాలని కూర్చుంది, కాని నిలబడలేకపోయింది. ఇప్పుడు తను తననుండి వేరుపడిపోయింది. పూర్తిగా తనకుతాను వ్యతిరేకమైపోయింది. అనుకున్నదొక్కటీ చెయ్యలేకపోయింది.

భావిలో జరిగే ప్రళయం, కండ్లయెదుట వికృతంగా తాండవనృత్యం చేస్తోంది. తన ఆశయాలన్నీ అడుగుల క్రిందపడి నాశనమైపోతున్నాయి. తనూలేదు, తన మంజులాలేదు, ఫణి బాబులేదు, మధూలేదు, తన ఆశయాలులేవు. ఆ సత్యం మృగ్య

మైంది. తనకీ ప్రపంచమే లేదు. తామే లేనప్పుడు తమకీ ప్రపంచమేమిటి?—

ఇవి ఆమె ఆలోచనలు. తన ఆలోచనలకు తనే నవ్వు కుంది. తిన్నగా దేవుడి మందిరంలోకి వెళ్ళి భగవద్గీతమీద దృష్టి మరల్చింది. కాని మనస్సు స్వాధీనపరచుకోలేక పోయింది

ఇక లాభంలేదనుకొని మరలా మంచంవద్దకు చేరింది. కాని ఆలోచనలు ఏంచెయ్యటానికి ఏమీ తోచలేదు.

ఎందుకీభయం తనమంజులను సారధిచేతుల్లో ఉంచింది. అతడు తనచెల్లెలుగ మంజులను స్వీకరించాడు. తనకు, తన మంజు లకు ఎటువంటి అన్యాయం చేయడు. అతడే మధుకు మంజుల నిచ్చి చేయాలనుకొని వుంటాడు. తనకు అంతకంటే కావలసిన దేముంది తనచెల్లెలను ఏవిధంగా చూడాలో తనబాధ్యత ఎంత వరకో ఒకఅన్న గుర్తుంచుకోలేడా? చూచిచూచి తనచెల్లెలి కంఠానికి ఉరిత్రాడు బిగిస్తాడా? ఎప్పుడూ బిగించడు. ధర్మా రావుగారుకూడ హామీ యిచ్చారు.

కలం కాగితం తీసింది.

"సారధి అన్నయ్యగారికి కమలం నమస్కరించి వ్రాయు నది:—

"మీరు క్షేమంగా ఉన్నారని తలుస్తాను. మీ చెల్లెలు ఏవిధంగా ఉంది. మీ యిద్దరూ కలసి నన్ను మరచిపోయినట్లు న్నారు. నన్నుగూర్చి మంజులకు ఒకసారి గుర్తుచేయండి. మీకు అంతస్వార్థం అయితే లాభంలేదు. నాకుకూడా కొద్ది సోదరిప్రేమను పంచాలి.

"మధు బాగా చిత్రాలు గీస్తున్నారనుకుంటా. ఆయన

చిత్రాలు పశువులకు సహితం మానవత్వాన్ని యిస్తాయి. ఆయన చిత్రములు కళ్ళకు కట్టినట్టుగా ఉంటాయి. అద్భుతంగా వేస్తారు.

"మంజుల తననాట్యాలను, గానాలను మీకు వినుపిస్తోంది అని తలుస్తాను. నాకే అవిచూచే భాగ్యం లేదు. అయినా ఫరవా లేదు. ఆమె సుఖమునే నేను ఎల్లప్పుడూ వాంఛిస్తాను.

"నాకు ఎందుకో భయంగా ఉంది. యిన్నాళ్లుగా మంజులను హృదయంలో ఉంచుకున్నాను. కాని యిప్పుడు ఆమెను చేతులారా వదలేను. మీచేతులలో మంజులను ఉంచినప్పటి నుండి నాకు ఆత్మశాంతి లభించింది, సరిఅయిన మగదిక్కు అంటూ ఒకటి లభించిందని. కాని యిప్పుడు నాలో మరల ఒక శంక తలయెత్తింది. మరొక విధంగా తలచవద్దు. 'మిమ్మల్ని అనుమానిస్తున్నాను అనుకుంటారేమో, అదేమీ కాదు. మిమ్మల్ని అనుమానిస్తే నన్ను నేను అనుమానించుకున్నట్లు, అవమానించుకొన్నట్టు.

"ఈరాత్రి భీకరస్వరూపంతో ఫణిబాబు బుసలుకొడుతూ నాదగ్గరకువచ్చి నానామాటలాడాడు. వళ్లు తెలియనంతగా త్రాగేను నాకు భయంవేసింది. కాని నాలోని మొండితనం నన్ను నిలబెట్టింది. యిప్పటివరకూ జీవించి వున్నానంటే అది నా మొండితనంవల్ల ననే చెప్పాలి. అతడు మంజులను వాంఛిస్తు న్నాడు. యిది మీకు బహుశా తెలిసి ఉండవచ్చు. కాని నాకుమంజులను ఈ రొంపిలో దింపటం యిష్టంలేదు. అతడుఅనేక సార్లు అడిగాడు. కావలసినంతధనం యిస్తానన్నాడు. శీలానికి ఈధనంతో వెలగట్టగలమా ?

"పెండ్లి చేసుకుంటాననన్నాడు. ప్రేమించాననన్నాడు. కాముకుల ప్రేమ ఎటువంటిదో మీకూ తెలిసివుంటుంది. వాంఛ తీరగనే ఒక గడ్డిపరక మాదిరిగ వారు స్త్రీని చూస్తారు.

"అటువంటివాడే ఈ ఫణిబాబు. అందుకనే నాకిష్టంలేదు. అయినా చెల్లెలి బాధ్యత మీమీద ఉంచినప్పుడు నాయిష్టంతో నిమిత్తంలేదు. అది నాఅభిప్రాయం మాత్రమే.

"మంజుల తనహృదయంలో ఫణిబాబుకు స్థానం యివ్వలేదు. ఆస్థానాన్ని మధు దొంగిలించాడు ఆమాట ఫణిబాబే చెప్పాడు. దానికిమీకు దోహదకారి అన్నాడు ఎన్నోమాటలు అన్నాడు.

"యిప్పటికి మంజులపట్ల నాఆశయం నెఱవేరింది. అందుకు మీరు చేయూతనిచ్చినందుకు ధన్యవాదాలు. రక్తం పంచుకున్నంత మాత్రాన సోదరుడు అవడు.

"మీసోదర బాధ్యత మీరు నిర్వర్తించారు. తనసోదరుల పట్ల తనబాధ్యత ఎవరు నెఱవేరుస్తారో వారేసోదరులు. అందుకే మీకు హృదయపూర్వకమైన నమస్కారముల నందజేస్తున్నాను. నేనుఎప్పుడూ మంజులను ఒక కళాకారునకుగాని, కళాభిమానికిగాని యిచ్చి వివాహం చెయ్యాలనుకున్నాను.

"ఆవిధంగ తలచినప్పుడలా నాజీవితగమనం, ఆశయం భావిజీవితానికి అడ్డుఅన్నటు తోచేది. కాని నేడు మీవలన నాఆశయం తీరింది. యింతకంటె మాకు సోదరతుల్యుడు ఎవరున్నారు ?

"మనకు భగవంతుడు తోడుపడుతున్నాడు. ఫణిబాబును ఒక కంట కనిపెడుతూ ఉండండి. అతడు

పగపట్టాడు. అతడి దృష్టి ఎక్కడ కేంద్రీకృతమైతే అక్కడ నాశనమై పోతుంది. అతడు అటువంటివాడు. అందుకనే నాకు భయంగా ఉంది. అతడికి కోపంవచ్చిందంటే విచక్షణా జ్ఞానం నశించిపోతుంది. 'మంజులను తను వాంఛిస్తున్నాడు కనుక తనుజీవించి ఉండగా మరొకరికి దక్కనివ్వ'నని కోపంతో ప్రతిజ్ఞపట్టి వెళ్ళిపోయాడు. అతని తత్వం అన్నంతా చేసితీరుతుంది, అదే నాఆందోళన. అదీకాకుండా ఈ పరిస్థితుల్లో నేను అక్కడకు రావటం శ్రేయస్కరంకాదు.

"కనుక మేయికళ్ళతో ఈ అనాధసోదరిని కాపాడుతారని భావిస్తాను. మంజులను తొందరగ ఒకదరికి చేర్చమని ప్రార్థిస్తున్నా.

మీ ప్రియసోదరి,
కమలం."

పుత్తరమును పూర్తిగా ఒకసారి చదువుకుంది. మనస్సుకు ఒకవిధమైన తృప్తి చేకూరింది. ఆ తృప్తితో నే నిద్రపోయింది.

## 15

కాలం దొర్లుతోంది. కాని సుఖసంతోషాలు ఎవరికీ లేవు. కాని ఎవరికి వారే హాయిగ ఉన్నా మన్నట్లు జీవితగమనాన్ని యీడుస్తున్నారు. ఆ గమనమే ఒకగడ్డుసమస్య అయిపోయింది. ఎవరిజీవితాలు ఎక్కడ గుటుక్కుమంటాయో అని భయం,

అయితే పుట్టినవాడు చావకమానడు. అటువంటప్పుడు యిక భయం దేనికి ?— వీరిజీవితాలు దినదినగండాలే. అందుకే ఆ భయం.

అందరి హృదయాల్లోను దుమారం చెలరేగింది.

తను మాటయిచ్చాడు. మంజుల తనచెల్లెలు ఆమె బాధ్యత తనది. ఆమెకు ఏవిధమైన కష్టంకలిగినా తనమాట పోతుంది. తను నలుగురిలో తలయెత్తుకు తిరగలేడు తనకు యిక మనశ్శాంతి లభించదు తనబ్రతుకు నవ్వులపాలు అయిపోతుంది. మాటనిలుపుకోలేని నీచుడంటుంది లోకం. లోకం అనటం దేనికి ? తనకు తెలియదా? మాటతప్పాడంటే ఆత్మ ఎంతగా క్షోభించిపోతుందో. చెల్లెలను రక్షించలేని సోదరుడూ ఒకసోదరుడేనా? 'సోదరుడు' అన్నపదానికే కళంకం తెచ్చిన వాడనౌతాను. తనమీద యెన్నో ఆశలు పెట్టుకుని తనకుమంజులను అప్పజెప్పింది కమలం. మంజులకూడ తనమీదయెన్నో ఆశలు పెట్టుకుంది. అవును, ఏ అన్నగారిమీద ఏ చెల్లెలు ఆశపెట్టుకోదు! చెల్లెలు శోభయే తనశోభ. నిజంగా మాధవియే కనుక బ్రతికుండి ఇటువంటి కష్టాలలో కొట్టుమిట్టాడుతూంటే తను చూస్తూ ఊరుకోగలడా ? ఎన్నటికీ ఊరుకోలేడు.

మంజులలోనే మాధవిని చూస్తున్నాడు. అందుకనే ఆతడి హృదయం ఆవిధంగ తల్లడిల్లిపోతోంది. మంజులయే మాధవి, ఆమె తన చెల్లెలు. తన చెల్లెలిబాధ్యత తనమీద వుంది.

కాలనాగుమాదిరి బుసకొడుతున్నాడు ఫణిబాబు. పగ పట్టేడు మంజులమీద. సమయంకోసం పొంచి చూస్తున్నాడు కాటువేయటానికి.

ఈసంగతి తనకు తెలుసు. అతడు కాటువెయ్యకముందే మంజులను మరొకరిచేతుల్లో పెట్టాలి. ఆమెకు తగినవాడు కావాలి. ఆమె కళామూర్తి. గానకోకిల. నాట్యసుందరి. ఆమెకు తగ్గవాడు ఎవరు?... ఎవరు? అతడి మెదడులో మధు మెదలాడు. అవును. మధు ఆమెకు తగ్గవాడు. అతడికికూడ ఆమె తగ్గది. యిద్దరూకలసి కళకు జీవంపోస్తారు. తనకు ఎంత గౌరవం. తన చెల్లెలు తన... అవును, ఒప్పుకుంటాడు. తనుచెబితే కాదనడు.

అయినా మంజులలో అందంలేదా? గుణం తక్కువా? అజ్ఞానా? అనామకురాలా?

ఏదీకాదు. తనచెల్లి సంపూర్ణ శోభాయమాన. ఆమె కోసం అనేకమంది పడిగాపులుపడి కూర్చున్నా.

గొప్ప అందగాళ్లున్నా, లక్షలకు పేరుమోసిన ధనవంతులున్నారు. 'ఊఁ...' అంటే వచ్చి పడతారు.

అతడిలో ఒకవిధమైన అతిశయం పెల్లుబికింది. తనచెల్లి యిటువంటిదికదా అని.

అందువల్ల మధు తప్పక ఒప్పుకుతీరుతాడని, దానికి మంజుల, కమలం అంగీకరించితీరుతారని నమ్మకం ఏర్పడింది. అప్పుడు తనబాధ్యత తీరుతుంది. ఫణిబాబుపీడ విరగడౌతుంది. లోకం సంతోషిస్తుంది కళ మూడుపూవులు ఆరు కాయలుగ దేశంఅంతటా వర్ధిల్లుతుంది అనుకున్నాడు సారధి.

ప్రతి స్త్రీకి ఈలోకంలో సారధివంటి సోదరులు దొరికితే స్త్రీలోకమే పవిత్రమయమయిపోను. వారి జీవితగమనమే అమృ

తాంబుధిని బంగరునావగును. వారి ప్రాణాలే మగజాతి, సోదర కోటికి పూలమాలలగును.

ఫణిబాబు నైచ్యబుద్ధి గమనించినప్పటినుండి ధర్మారావు హృదయతాపం పెచ్చుపెరిగిపోయింది. అతడికి ఈలోకం అధోగతిపాలు అయినట్లుగ గోచరిస్తోంది. అది తనవలనే అయిందని తన బాధ అవును, లోకం తమ్ముడిని అదుపులో పెట్టలేని అనామకునిగ తనను చేస్తుంది. యింట గెలువనివాడు రచ్చ గెలువ కలడా? తను ఒకప్రాంతానికి జమిందారు. ఆ ప్రాంతప్రజలను ధర్మపరులను చేయాలి. వారి మంచిచెడ్డలు యోచించాలి. కాని యిప్పుడు తనకు ఆ యోగ్యత లేదు. చెడ్డవారెని దండించ లేదు. తన సోదరుణ్ణే దండించలేనివాడు పైవారి నేవిధంగా దండించకలడు?

కామం మనిషిలో తలయెత్తిందంటే ఈ లోకంలో ధర్మాధర్మాలకు తావేలేదు. ఎంత నైచ్యం! మానవుడు పశు వన్నమాట!

ఆడది అంత చులకనైపోయిందన్నమాట. బజారులో దొరికే ఒక వస్తువు. ధనంతో తను కొన్నాడుకాబట్టి తన ఇష్టం వచ్చినట్లు చేసుకొనవచ్చునన్నమాట. స్త్రీ ఒక భోగవస్తువు. అనుభవించాలి. ఆనందించాలి. కోరికను తీర్చుకోవాలి, భగవంతుడు స్త్రీని యిందుకే సృష్టించాడు. కనుక స్త్రీ అందరిదీను. ఆమెను పొందగలగడమే కావాలి. భగవంతుని సృష్టిమీద అందరికీ హక్కువుంది అనుభవించటానికి. కనుక 'స్త్రీ' నాది అని నొక్కి వక్కాణించటానికి వీలులేదు. ఆమె అందరిదీను. ఎవరిక్కావాలంటే వారిది. ఆమె యిష్టాయిష్టాలతో పనిలేదు. అసలు స్త్రీకి శీలంఏమిటె? అర్థంలేని వ్యర్థపుమాట. ఈ శీలం

స్త్రీని చావకుండ కాపాడుతుందా? లేక కోరిన కోరికలిస్తుందా? ఈ శీలంఅనే పదాన్ని మానవుడే స్త్రీకి ఏర్పరచాడు. పవిత్రత అంటాడు. ఏమిటా పవిత్రత? ఏమో దానిని నిర్వచించలేము. అది అంత గొప్పపదం. ఈ శీలం, పవిత్రత ఎవరో స్త్రీవిలువ తెలియని, అనుభవించలేని మూర్ఖుడు ఏర్పరచి ఆమెను మూల కూర్చోపెట్టేడు. ఈ మూకప్రజకూడా స్త్రీవిలువను తెలుసుకోలేక అరచేతనున్న స్వర్గసౌఖ్యాన్ని చేజేతులా జారవిడచుకుంటున్నారు. ఆపని మావల్లకాదు అంటారు గొప్ప నీతిపరులు, సృష్టి రహస్యం తెలుసున్న జ్ఞానులు.

యిటువంటి అజ్ఞానంలో పడిపోయింది ఆఖరుకు ఈ మగజాతి. స్త్రీని పీల్చి పిప్పిచేయటంకంటె మరేమీ తెలియని మూర్ఖత్వంతో పిపాశతో ఎదురుచూస్తోంది. స్త్రీ భగవంతుని సృష్టిట. ఆమెను అందువలన అందరూ అనుభవించవచ్చుట.

అయితే ఈ మొగజాతి భగవంతుని సృష్టేగా. తమను తాము ఏవిధంగా చూసుకొంటున్నారో, వారిని ఆవిధంగానే చూడాలే. తన చెల్లెలను, తల్లిని ఏవిధంగా చూసుకుంటున్నారో యితర స్త్రీజాతిని ఆవిధంగానే చూడాలి. కాని పరస్త్రీలను వాంఛించినట్లు ఈ మగజాతి తన తల్లిని. అక్కచెల్లెండ్రను ఎందుకు వాంఛించదు. వారూ స్త్రీలే, వీరూ స్త్రీలే. యిద్దరూ భగవంతుని సృష్టేకదా?

ధర్మారావులో ఈవిధమైన ప్రశ్న తలయెత్తింది. ఫణిబాబువంటి మూర్ఖులవాదన అర్థమయింది. ఆ మూర్ఖులు తన తల్లి, సోదరీమణులశీలం, పవిత్రత నిలుపుటకు ఎలా తాపత్రయపడతారో అదేవిధంగా పరస్త్రీల శీలం, పవిత్రతను నిలుపుటకు

ప్రయత్నించరు. వారిలోని కామప్రవృత్తి వారిని ఆవిధంగ చేస్తుంది.

అబ్బ! కామం ఎంత దుర్గుణం? అనుకున్నాడు ధర్మారావు.

మంజు, మధులకు ఈ ప్రపంచం ఒక ప్రేమమయం. ఎక్కడైనా కర్కశం తలయెత్తిందంటే వారిద్దరూకలసి ఆ కర్కశత్వాన్ని తుడిచెయ్యాలి. ఒక్కొక్కరుగ తాము చెయ్య లేరు. అంత బలంవుంటుందికాని అంత ధైర్యంలేదు. అందుకనే వారిద్దరూ ఏకమవ్వాలనుకుంటున్నారు.

తమ ప్రేమను తమవారు తృణీకరించరనుకున్నారు. కాంక్షతో ఒకరినొకరు కోరుకోలేదు. పవిత్రమైన ప్రేమ, నిర్మల మయిన ప్రేమ. మానసవికాసం, ప్రేమమయం.

కాని ఫణిబాబు పడగవిప్పి దండితాడిన భుజంగమువలె బుసలుకొడుతూ ఎప్పుడు కాటేద్దామాఅని ఎదురుచూస్తు న్నాడు. అది కాలనాగు. కాలాన్ని ఆపలేరు. కాలంతోపాటు జీవితగమనంలో మార్పువస్తుంది. మిట్టపల్లాలలో పడుతూలేస్తూ వుంటుంది ఈ జీవితం. కాని దీన్ని సమమట్టంచేయడానికి మానవుడు సదా ప్రయత్నిస్తూనేఉంటాడు. అనేక ఉపాయాలు ఆలోచిస్తూనేఉంటాడు. ఈ ఉపాయాలు విధిని అతిక్రమించలేవు. అయితే యిది మానవప్రయత్నం. మానవప్రయత్నానికి అనేక అడ్డంకులొస్తాయి. కష్టనష్టాలు కలుగుతాయి.

మధు, మంజుల జీవితాలలోనికి ఫణిబాబు ప్రవేశించాడు. తను ఆమెను కోరేడు. అంతే, అతనికి కావలసింది. తరువాత పరిణామం ఏవిధంగాఉన్నా చింతించ నవసరంలేదనుకున్నాడు.

ఫణిబాబు గుర్తుకురాగానే మంజులకు ఈ ప్రపంచము అంధకారబంధురమైపోతుంది. ఆమెలో భయం తలఎత్తుతుంది. తట్టుకోలేదు. చెదిరిపోతుంది. అంతా అగమ్యగోచరమైపోతుంది. జీవితం స్థభించిపోయింది. నాశనమైపోయిం దనుకుంటుంది ఆశలన్నీ అడియాశలయ్యాయని కుంచించుకుపోతుంది.

యివే ఆలోచనలు. ఫణిబాబు వికృతరూపం, తను. ఇంతే ప్రపంచం. మరొకరు లేరు. తన మధు లేడు. తన అక్క లేదు తన సారథి లేడు. ఫణిబాబు వికటాట్టహాసాలే.

తలచుకున్నప్పుడల్లా వణికిపోతుంది. ప్రేమమయజీవితం భగ్గుమంటుంది.

జీవిత పురోగమనమునకు మార్గం ఎవరికీ గోచరించటం లేదు. అంధకారపు తెరలవెనుక ఆశయాలు దాగుడుమూతలు ఆడుతున్నాయి. మంజులభారం ప్రతివారికి ఎక్కువై పోయింది. ఆ భారమును మోయుటలో ఎక్కడ ఒడుదుడుకులువచ్చి తమ మార్గాలనుండి తప్పిపోతారో అన్న భయంకొద్ది వారి ఊహలను స్థభింపజేసుకున్నారు. సత్యపథంనుండి ఎక్కడ తప్పుకోవలసి నలుగురిలో నవ్వులపాలు అవుతామోఅని భయపడ్డారు. అందువల్ల మంజుల హితవుకోరే ప్రతివ్యక్తి ఆమెను ఒక యింటి దానిని చెయ్యాలని కోరుకున్నారు.

అందంగాఉండే ఒక కన్నెపడుచును యింతమందికలసి ఆమె శీలం కాపాడుటకు ఇంత హృదయక్షోభ, ఆవేదన పొందుతున్నారు. నలుగురు మనుష్యులు ఒక పవిత్రకార్యమును చేయుటకు ఎంత బాధపడుతున్నారో. అంటే దుర్భరమైనశక్తులు వారిని ఎదుర్కొంటున్నాయి.

ఫణిబాబు గమనంమాత్రం స్థంభించిపోలేదు. అతడి ఆశయాలు అతడిని వేగిరపరుస్తున్నాయి. మనసు ఉవ్విళ్ళూరుతోంది. 'ఆలస్యం అమృతం విషం' అని బుద్ధి అతన్ని ముందుకు త్రోస్తోంది. సమయంకోసం వేచియున్నాడు.

# 16

బహుశా రాత్రి పదకొండుగంటలయి ఉంటుంది. నక్షత్రాలుమాత్రం ఆకాశమును అలముకున్న అంధకారాన్ని చీల్చుకొని ప్రకాశిస్తున్నాయి.

సారథి అప్పుడేవచ్చాడు.

ధర్మారావు ఏదో ఆలోచిస్తూ పడుకున్నాడు. సారథి వచ్చినట్లుఅయినా గమనించలేదు.

ఆరోజంతా సారథి ధర్మారావును కలుసుకోలేదు. కాని ప్రతిరోజు సారథి ఈ సమయానికి నెమ్మదిగ యింటికి చేరుకునేవాడు. యీరోజు ప్రతిరోజూ వెళ్ళేవేళ అతడికి వచ్చేవేళ అయింది.అతడిముఖంలో ఏదో ఆతృత అలసట గోచరిస్తున్నాయి.

ధర్మారావుప్రక్కన కూర్చుంటూ "ఏం ధర్మా, ఈరోజు యింకా నిద్రపోలేదేం ?" అన్నాడు.

ఆలోచనలలోనుండి తేరుకుంటూ సారథిమాటలు

వింటూ "ఈరోజంతా ఎక్కడ మాయమైపోయావు ?" తిరుగు ప్రశ్న వేశాడు.

"నువ్వు ఎప్పుడూ యిల్లా ఆలోచనలలో పడిపో. అవతల ప్రళయంవచ్చినా పట్టదు. నీబాధ్యతను నువ్వు గుర్తించి దయార్ద్రహృదయుడవైనా బయటకు కఠినత్వంచూపాలి. అదీకాకుండ నీదయకు తుది మొదలు ఎక్కడున్నాయి. దేనికైనా ఒక హద్దుఅంటూ ఉండాలికదా?... అంటూంటే ధర్మారావు అదిరిపడిపోయాడు సారథిధోరణి అర్థంకాక.

"ఏమిటి సారథీ నువ్వనేది ?"

"అనేందుకేముంది? నలుగురిచేత నాలుగుచీవాట్లు తినవలసినకాలం వస్తోంది. ఇంకొంతకాలంపోతే చివాట్లతో ఆగదు, ప్రజలు ప్రాణాల్నే బలిగొంటారు."

"అంటే ?"

"అంటే ఏమిటి? మాటనిలుపుకోలేని వెఱ్ఱివాళ్ళము, ఆడదాన్ని రక్షించలేని అనామకులం."

"సారథీ...అసలు విషయం చెప్పక నన్నిల్లా క్షోభింపచేస్తావెందుకు? నాకు తెలుసున్నంతవరకూ ఈ జన్మలో నేను మాటతప్పలేదు అని ఘంటాపథంగా చెప్పగలను. ఇటుపైనంటావా? ఆ దేముడిదయ. ఇంతకూ, అసలు విషయమేమిటో నువ్వు చెప్పలేదు."

"చెప్పకోనేందుకుకూడ సిగ్గువేస్తోంది. ఊరుఊరంతా మనమీద ఉమ్మివేయటానికి సిద్ధంగా ఉంది. దీనికంతకూ ఫణిబాబు ప్రతాపం కారణం. త్రాగుతున్నాడట...తందనాలు ఆడు

తున్నాడట. ఆడది కనిపిస్తే అడ్డగిస్తున్నాడు. ప్రజలువచ్చి నీతో చెప్పుకోలేరు. కారణం ఫణిబాబు భయమే."

"ఈ విధంగా ఎంతమంది స్త్రీల శీలాన్ని బలిగొన్నాడో.

"ఈ విషయాలు నీవరకూరావు. నువ్వు వాటిని చూడ లేవు. ప్రజల హృదయాలు విలవిలలాడిపోతున్నాయి.

"ఫణిబాబు దుండగాలను నువ్వణచకపోతే, ఈరోజు ప్రజల యెడల ఎలా మూర్ఖత చూపించాడో అదేవిధంగా రేపు మన యెడలా అగౌరవం చూపుతాడు.

"ఫణిబాబు కమలంవద్దకు వెళ్ళి మనలను నానామాటలూ అన్నాడట. పోనీ మనలను అంటే ఫరవాలేదనుకొంటే మధును, మంజులను తిట్టాడు. కమలాన్ని అనేక విధాలుగా అన్నాడట. మస్తుగా త్రాగేసి ఉన్నాడు. మంజులను తను ప్రేమించాడట. పెళ్ళిచేసికుంటాడట. మంజుల మధు ఒకరునొకరు ప్రేమించు కొన్నారని అతడే చెప్పాడట కమలంతో.

"అతడి మాటలకు కమలం వారిద్దరకు వివాహం చేస్తా నందిట. ఫణిబాబు తోకత్రొక్కిన త్రాచులాలేచి "ఈ జన్మలో జరిగే విషయంకాదని, ఒకవేళ ఎవరైనా వారిద్దరిని కలపడానికి ప్రయత్నిస్తే ప్రాణాలమీద ఆశ వదలుకొని ప్రయత్నం చెయ్యా లని, మంజులను మొదట తను వాంఛించాడు కనుక మంజుల తనదేనని" అంటూ ప్రళయకాలరుద్రు డయిపోయాడట.

"ఫణిబాబు మంజులమీాద ఒకకన్ను వేసి ఉంచాడు. అతడి దానికి మనం అడ్డుగా ఉన్నాము. అయితే ఫణిబాబు మంజుల కోసం పొంచియున్నాడు. ఎప్పుడో ఒకప్పుడు మనమీాద దెబ్బ తియ్యకపోడు. నీ తమ్ముడిని ఈ విధంగా అంటున్నానని బాధపడతా

వేమో. మా దృష్టిలో అతడు ఒక యమకింకరుడు. మానవరక్తం త్రాగే పిశాచం. అతడిమాట ఎత్తేసరికి ప్రతిఒక్కరి హృదయం భయంతో కంపించిపోతోంది. అతడిని అడ్డుకొనే నాథుడు లేడు.

"నువ్వు ఏవో ఆశయాలతో కలలుకంటూ కూర్చుంటావు. ఒక్కసారిగా నువ్వు వూహించి నిర్మించుకున్న ఆశయాలు కూలి పోతాయి. అధఃపాతాళానికి అంటుకుపోతాయి. హృదయ భారంతో కృంగిపోతావు. జీవితంమీదే విరక్తి కలుగుతుంది. అసలే నీది సున్నితమైన హృదయం. ఇటువంటి ఘాతుకాలను తట్టుకోలేవు. కనుక ఫణిబాబు చర్యలను ఏదో ఒక విధంగా కట్టి పెట్టాలి.

"నేను అతడిమీద ద్వేషంతోనూ, మరేయితర భావాల తోను అనటంలేదు. అతడిని ప్రజలు ఆ విధంగా భావిస్తు న్నారు. మరిగే పాలల్లో ఒక్క ఉప్పురవ్వచాలు పాలన్నీ ధ్వంసం కావటానికి. ఎన్నో మంచిపనులుచేసి అనేక శ్రమలకు ఓర్చి ఒక్క గొప్పకార్యమును నెరవేరుస్తూ వుంటే, అనుకోకుండా ఒకచిన్న తప్పుపనివల్ల మనలను ప్రజలు 'ఛీ' అని నిరసిస్తారు. ఆ విధంగానే తయారయినాయి నేడు మన బ్రతుకులు. ఇంకా సమయం మించిపోలేదు. ఏదో విధంగా మనం మంజులకు మధునిచ్చి వివాహం చేసెయ్యాలి. అప్పుడు నువ్వు కనినకలలు నీ ఊహాసౌధాలు నిజరూపం దాలుస్తాయి. వారిద్దరు కళామతల్లి సేవకు వారిజీవితాలు నీ ఊతంతో అర్పిస్తారు. నీ ఆశ యాలను దేశం నలుమూలలా వెదజల్లుతారు. మనబ్రతుకులు వారిబ్రతుకులు తెరిపినపడుతవి. ఇక లాభంలేదని ఫణిబాబూ

ఒకదారికి వస్తాడు. నీవు కలుగజేసికొనందే ఈపని త్వరితగతిని జరుగదు సరికదా జాప్యంవల్ల సర్వనాశం కావచ్చు. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొనటంవలన ప్రయోజనముండదు" అన్నాడు సారథి.

మంజులపై తను పెట్టుకున్న ఆశలు నెరవేరుతవో లేదో అని భయపడ్డాడు ధర్మారావు, సారథి ఆవేదనను అర్థంచేసి కొంటూ.

"సారథీ! పరిస్థితి శృతిమించిపోకుండానే మనం కార్య సాధనలోనికి దిగాలి. నాకు నువ్వు చెప్పేవరకు ఈ క్లిష్టపరి స్థితులు తెలియవు. అయినా యిప్పుడు మించిపోయిందేముంది? నడు మధువద్దకు వెడదాం" అంటూంటే మధు ఖంగారుగా ఆయాసపడుతూ ఒగరుస్తూ పరుగెత్తుకు వచ్చాడు.

"ఇక్కడే...ఉన్నారా" వాళ్ళను చూచి ఒగరుస్తూ, ఆయాసాన్ని అణగద్రొక్కుకుంటూ అన్నాడు మధు.

ఒక్కసారిగా హోరున గాలివీచింది. భీకరశబ్దంతో ఉరు ములు, నిశ్శబ్ద వాతావరణాన్ని ఒక్కమారుగా బీభత్సం చేసి వేశాయి. ఎక్కడో పిడుగుపడినశబ్దం కర్ణభేరులను అదరకొట్టింది. చూస్తూ ఉండగానే వాతావరణం ప్రళయరూపాన్ని దాల్చింది.

ఈ పెనుగాలికి అసలే ఆయాసంతో అవయవాలు పట్టు తప్పివున్న మధు సారథిమీద పడబోయి నిలద్రొక్కుకొన్నాడు. నిర్మలాకాశాన్ని ఆవరించిన మేఘాలవలె అతడి మొఖమున ఏదో అవ్యక్త ఆందోళన అలుముకున్నట్లు గ్రహించాడు సారథి.

"అల్లా ఖంగారుపడిపోతున్నావు, ఏంజరిగింది మధూ" అన్నాడు ధర్మారావు అతడివైపు చూస్తూ.

మధు ఏదీ చెప్పలేకపోయాడు. అతడు ఆందోళనను అణచుకోలేకపోతున్నాడు.

ఏదో జరగకూడనిదే జరిగిపోయుంటుందని, "ఏమిటి జరిగింది మధూ? మంజుల ఏది?" అన్నాడు సారథి మరింత ఆతృత కనపరుస్తూ.

"ఏమో" అన్నాడు గొంతుకను పెగలదీసికొంటూ మధు.

అంధకారం అలుముకున్న ఆకాశంలో ఒక మెరపుమెరసి మరుక్షణంలోనే అంతరించింది. ఆ మెరుపు ప్రపంచం అంతా ఒక్కసారిగా వెలుగు ఆవరించిందికాని మరుక్షణంలో సకల జీవ రాసులను భయకంపితం ఒనరించే శబ్దంతో అంతరించింది.

ఈ భీకరశబ్దానికి ముగ్గురూ హడలిపోయారు. తక్షణం మంజుల గదివద్దకు పరుగుదీశారు.

అది ప్రళయనిశీధి. జీవులు అరచేతిలో ప్రాణాలను పెట్టుకొని సురక్షితమార్గంకోసం అన్వేషణ సాగిస్తున్నాయి.

తలుపులు పెనుగాలికి దబదబా కొట్టుకొంటున్నాయి. ఈ గాలికి తట్టుకోలేక దీపం నాట్యమాడుతోంది. ఏక్షణంలో అంతరించిపోతుందో భగవంతునకు కూడ తెలయనిస్థితి అది. గదిలోని వస్తువులు వాటిస్థానాన్ని తప్పాయి. చిందరవందరగా పడి ఉన్నాయి.

ముగ్గురూ లోపలకువస్తూ 'మంజూ...మంజూ' అని

కేకలువేశారు. కాని హోరుగాలి ఆ కేకలను తనతో తీసికొని పోయింది.

సారథి తలుపులుమూశాడు. గాలిఒత్తిడి తగ్గింది. నాట్యమాడుతూన్న దీపం నిదానించి తనకాంతిని ప్రసరింపజేస్తోంది.

మధు, మంజుల లోపలిగదిలో ఉండేమోనని దీపంతీసి చూడబోదామనుకుంటూంటే సారథి, దీపంక్రిందవున్న రెండు కాగితాలను తీశాడు.

వాటిమీద, 'మధు' అని, మరొకదానిమీద 'అక్కకు' అని వ్రాసివుంది. వాటినిచూచి సారథి హడలిపోయాడు. ఒణుకుతూన్న చేతులతో మధుకు కాగితం అందిచ్చాడు. చదవమన్నట్లు అతడికిమాట్లాడుటకు కంఠంకూడా పెగలలేదు.

మధు గబగబ కాగితం మడతలు విప్పి చదువుతూ "మంజూ" అంటూ కొయ్యబారిపొయ్యాడు.

"ఏమిటి మధూ" అంటూ ధర్మారావు మధు చేతిలోనుండి ఆ కాగితాన్ని తీసుకొని చదవ నారంభించాడు.

"మధు... మధూ..." అంటూ గట్టిగా తట్టాడు సారథి.

సారథిలో చైతన్యం కలిగింది.

"మధుకు నమస్కరించి వ్రాయు అభాగ్యురాలు—

బహుశా నావంటి స్త్రీని మీరు జీవితంలో చూసియుండరు.

అసలు నన్ను భగవంతుడు ఎందుకు సృష్టించాడో తెలియదు. నావలన ప్రయోజనము ఏమిలేదు కదా, పైగా మీ అందరకు నష్టం, కష్టం కలిగించాను.

మీలో ఎన్నో ఆశలు రేకెత్తించాను. నాలో ఎన్నో నిలుపుకున్నాను. కాని కడకు నా జీవితంతో పాటు మీ ఆశలను కూల్చివేశాను. క్షమించాలి. నా బ్రతుకు నడియేటి నావ. దుమారంలో చిక్కుకుంది. యిక యిప్పుడో మునిగిపోతుంది. అది తథ్యం.

ధర్మారావు గారికి, సారధి అన్నయ్యకు ఈ అభాగ్యరాలి నమస్కారము లందజేయ ప్రార్థిస్తున్నాను.

సోదర ప్రేమ ఎటువంటిదో తెలియని నాకు, సారధి అన్నయ్యకంటె మంచి అన్నయ్య ఈ ప్రపంచములో మరొక సోదరికి ఉండడని, సారధి అన్నయ్య ప్రేమ పంచుకున్న తరువాత చెపుతున్నాను.

ధర్మారావుగారు, సారధి అన్నయ్య ఎన్నో ఆశయాలు నావలన నిర్మించుకున్నారు. వాటినన్నిటిని కూల ద్రోయక తప్పిందికాదు.

శీలం, మానం పోయినతరువాత ఏ హిందూ యువతి అయినా, అభిమానమున్నదైనా ఈ లోకంలో నిలువకలదా?

నాశరీరం కలుషితమైపోయింది. అందువల్ల ఈ పాపిష్టి శరీరమును మీకు చూపలేక పోతున్నాను. నేనుమీకు తగను.

మీరు వేయికండ్లతో నన్ను కాపాడు కొస్తున్నారు. అయితే విధి వక్రించింది. నన్ను ఆహుతి చేసింది.

ఆహుతైపోతున్నా. క్షమించాలి. మీయెడల తీరని అపచారం చేశాను.

కామక్రోధాలులేని తావుకు పోతున్నా... ఈ నరపిశాచములు లేని తావుకు పోతున్నా...!

మీఅందరకు హృదయపూర్వక నమస్కారములు.

అభాగిని,

మంజుల."

ధర్మారావు వుత్తరం చదివి "ఎంతపని చేశావు మంజులా" అంటు విచారంగా "మధూ" అని పిలువబోయి, మధు అక్కడ లేకపోవటంచూచి, తెల్లబోతూ "సారథీ మధు ఏడి?" అన్నాడు.

ధర్మారావు ఉత్తరం చదువుతూంటే తల వంచుకొని వింటూన్న సారథి అతడి మాటలకు తలయెత్తాడు.

"సారథీ! నువ్వే ఈవిధంగ కృంగిపోతే ఎల్లాగ? నలుగురికి ధైర్యం నూరిపోయవలసిన వాడవు" అన్నాడు సారథి బుజం నిమురుతూ.

"ఏం చెయ్యను ధర్మా. కమలానికి ఏవిధంగ ఈ మొఖం చూపను, ఆమెకు వాగ్దానం చేశాను. కడకా పర్యవసానం యీ విధంగ తేలింది" అన్నాడు విచారంతో కృంగిపోతూ.

"అలా అని విచారిస్తూ కూర్చుంటే ప్రయోజనం లేదు సరికదా, కాలం కలసిరాకుండా పోతుంది. కనుక మొదట నువ్వు మంజులను వెదకే ప్రయత్నంచెయ్యి. ఫణిబాబు ఎక్కడున్నాడో మాజులా ఆ ప్రాంతంలోనే ఉంటుంది. మొదట మంజుల, కమలం వద్దకు అసలువెళ్లిందో లేదో కనుక్కో. నేను మధుకోసం వెడతాను" అంటూ సారథిని లేవతీసి నలుగురు పనివాళ్ళను తోడు

యిచ్చి, తనో నలుగురిని సహాయంగా తీసుకొని చెరొకత్రోవ పట్టారు.

కన్ను పొడుచుకున్నా కానని కారుచీకటి. పెద్దవర్షం లేదు, తుంపర పడుతోంది. కారుమేఘాలు ఆకాశాన్ని కప్పేశాయి. చల్లటి గాలివీస్తోంది. చలి ఎముకల్ని కొరికేస్తోంది. చేతులుకొం కర్లుపోయి, శరీరం గడగడా వణికిపోతోంది.

శ్మశానంలో మంటలు కనిపిస్తున్నాయి. రెండు మూడు ఆకారాలు ఇటునటు తచ్చాడుతున్నాయి. దయ్యాలు మంటలు వేసుకుంటున్నా యేమోనని భయం కలగక మానదు. నక్కల అరుపులు హృదయంలో భీతిని రెచ్చగొడ్తున్నాయి.

అతడితో వచ్చే పనివాళ్ళకు మంటలు దగ్గరైన కొలది భీతి తొలగి పోతోంది. ఆమంటలు వేసుకునేవి దయ్యాలు కావు మానవులేనని.

చాల దగ్గరకు వచ్చేశారు. అక్కడ కూర్చున్నవారి మాటలు వినిపిస్తున్నాయి.

ఒకడు "అదెవత్తిరా! బాబూ! ఒంటరిగ చినిగిన బట్ట లతో సగం ఒళ్ళు కనిపిస్తూంటే సిగ్గైనలేకుండా పిచ్చిదానిలా పోతోంది ?" అంటున్నాడు ఒక సిగ్గుల సింగారి.

మరొకడు "ఓరి నీ తెలివి మంటలో పొయ్యా ! అది మనిషికాదోయ్ ! ఆడదెయ్యం. లేకపోతే పిశాచం! నువ్వుదాన్ని చూడగనే భయపళ్ళా" అన్నాడు పిశాచాలు నెరుగున్న పిచ్చితాత.

యింకొకడు "ఎందుకు భయబడ్డా..." 'అమ్మబాబో... దెయ్యం' అని హడలకొట్టి పారేస్తే ... అయినా అదిదెయ్యం

కాదోయ్. కామిని! చూచావా యింతక్రితం ఆడదెవ్వతైనా కని పించిందా అని ఒక మొగాడువచ్చాడు. వాణ్ణి వల్లో వేసికొని తొక్కెళ్ళి పోతోంది. వాడు చూడు. మనం ఎంతచెప్పినా యిన కుండగ వెతుక్కుంటూ దాని ఎంబడ్ని పడిపోయాడు. వాడి ఖర్మవాళిది. మనమేం చేస్తాం? అన్నాడు కామినీ గ్రహంపట్టిన వేదాంతి.

ఆ మంటలుచూస్తూ, భయపడుతూ వారినోటివెంట ఎటు వంటి మాటలు వినవలసి వస్తాయోనని శంకిస్తూ వచ్చిన ధర్మా రావుకు వారి సంభాషణలు కొంచెం హృదయానికి తేలికనే చేశాయి.

వీళ్ళను చూడగనే మంటలదగ్గర కూర్చున్న ముగ్గురు వ్యక్తులు లేచి సవినయంతో చేతులు కట్టుకొని, గంపెడాశతో వీరి దగ్గరకు వచ్చారు. ఏదైన కిరాయిదొరుకుతుం దేమోనని వాళ్ళను చూచేసరికి వారి ఆశ నిరాశే అయింది. వీరందరూ బ్రతికి ఉండటం చూచి తెల్ల మొఖాలు వేశారు.

అవును పాపం ! వారు కాటికాపరులు. నాలుగు శవాలు వస్తే నాలుగు డబ్బులు కిట్టుబాటు అవుతాయి. ఆ డబ్బులతో గుక్కెడు... గుక్కెడు సారా నీళ్లేనా త్రాగుదామని వారి ఆశ! పాపం చలి ! !

ధర్మారావు వారిచేతుల్లో ఒకరూపాయి పెట్టి "యీ దారి వెంట ఆ ఆడుది వెళ్ళి ఎంతసేపు అయింది"-అడిగాడు.

"అది ఆడది కాదండీ, కామినీ" అన్నాడు కామినీగ్రహం పట్టినవాడు.

"సరే లెద్దూ! తొందరగా చెప్పు. అదే ... ఎంతసేపయింది" అన్నాడు ఖంగారుగ ధర్మారావు.

"ఒకగంట అయిందండి" అన్నారు ముగ్గురూ ఒకేసారి.

"ఎల్లా వెళ్ళింది?"

"ఆ సముద్రపు కొండలకేసి పోయింది.... మీచేదస్తం కాని అది ఆడ దేంటి, పిశాచం" అన్నాడు పిశాచాల నెరుగున్న పెద్దతాత.

"మగవాడు వెళ్ళి ఎంతసేపు అయింది?"

"ఎంతోనా ఒకపావుగంట అయిందేమో. మమ్మల్ని యిల్లా అడిగి అల్లా పరుగెత్తుకు పోయాఁ ఒగుర్చుకుంటూ. ఆ కామినీగ్రహం పాపం ఆతడ్ని వల్లో వేసుకుందయ్యగారు" అన్నాడు కామినీ గ్రహం పట్టినవాడు.

వాడిమాటలు వింటూనే ధర్మారావు "నడవండి ఆ కొండలమీదకు మన మధు కాని...మంజుల, కాని కనిపిస్తే పట్టుకోండి" అని వేగంగా నడవసాగాడు.

స్మశానం... గోతులూ గొప్పులూ...పుర్రెలు ఎముకలు... ముళ్ళ పొదలు, ముళ్ళూ ... నడుస్తూంటే కాళ్ళలో గ్రుచ్చుకుంటున్నాయి. రక్తంకూడ కారుతున్నది. తూలి పడుతున్నాడు. లేస్తున్నాడు. యికలాభం లేదని పరుగు మొదలు పెట్టాడు. స్మశానందాటి కొండ లెక్కడం ప్రారంభించాడు. మంజుల జాడ కనిపించటంలేదు. "మంజూ...మంజూ" అంటూ విధి విరామంలేకుండా అరుస్తున్నాడు. నోరు ఆర్చుకుపోతోంది. కొండ చాల భాగం ఎక్కాడు. ఆశ కనిపించటంలేదు వెనుక నుండి "మధూ... మధూ..." అన్న కేకలు అస్పష్టంగ విని

పిసున్నాయి. ఎవరో ? ఏమో ? అతడికి తెలియదు. తెలుసుకోవలసిన ధ్యాసాలేదు. కొండ చివరికి వెళ్ళిపోయాడు "మంజూ ... మంజూ..." అంతే కంఠం పెగలలేదు. ఒళ్లు తిరిగిపోతోంది. నిలద్రొక్కుకొన లేకపోయాడు. అచేతనుడై పోయాడు. ప్రపంచమంతా తిరిగి పోతోంది. ఎత్తైన శిఖరాలు పాతాళంలోనికి కృంగిపోతున్నాయి.

మనస్సు మంజులకొరకు ఉరకలు వేస్తోంది. కాని అంతా అంధకారం. కంఠం పెగలటంలేదు. శక్తినంతా కూడదీసి కొంటూ "మంజులా..." అని కేకవేశాడు. దిశలు పిక్కటిల్లాయి. నిర్జన నిశ్శబ్ద కొండప్రదేశం కావటంవలన "మంజులా." అని అతడి కేకకు మారుశబ్దంవచ్చి, శూన్యంలో కలసిపోయింది.

'మంజుల' అన్న కేకతోనే మధుశక్తి ఉడిగిపోయింది. అంతే. ఆ ఎత్తయిన శిఖరాలనుండి క్రిందకు దొర్లిపోయాడు.

ధర్మారావు పట్టుకొన్నాడు. కాని ప్రయోజనం లేకపోయింది. అతడి ఆశయాలు భగ్నమైపోయాయి.

"మధూ..." అంటూ ఒక కేకవేశాడు.

## 17

హోరుగాలి. చలి ఎముకల్ని కొరికేస్తోంది. తుంపర పడుతోంది. వీధిదీపాలు కొన్ని ఆ గాలికి ఆరిపోయాయి. మరి కొన్ని 'మృత్యువు ఆవహిస్తూన్న జీవిలా' గాలితాకిడికి యిటు

నటు నాట్యంచేస్తూ, నిలకడలేక ఇకనో ఇప్పుడో అన్నట్లు వాటి కాంతినిఉడిగి అంధకారంలో కలసిపోవటానికి సన్నద్ధమైఉన్నట్లు గోచరిస్తున్నాయి.

వీధిఅంతా నిర్మానుష్యంగాఉంది. ఈ నిశి అటువంటిది. దొంగలుకూడ బయటకు రావటానికి భయపడ్తారు.

ఈ వాతావరణ సంక్షోభానికి తట్టుకోలేక ఎప్పుడూ అరచే వీధిగాయక శునకాలుకూడ వాటి అరుపులను, గానాలను మాని ఏమూలనో నక్కాయి.

అటువంటి నిశాసమయంలో ఒకేఒకవ్యక్తి ఆ వీధివెంట తూలుతూ, తనలోతాను ఏదో గొణుక్కొంటూ వస్తున్నాడు.

బాగా త్రాగివున్నాడు. అతడివాలకంచూసి పగటిపూట కూడ భయపడతారు ఆర్రాత్రి అతడిని చూసినవారు. జుత్తు అంతా చిందరవందరగఉంది. తెల్లనిబట్టలేకాని వాటినిండా రక్తంమరకలు గోచరిస్తున్నాయి. మొఖంమీాద, చేతులమీాద రక్కులుకనిపిస్తున్నాయి. వాటినుండి రక్తంకారుతోంది. అంత చలిలోను అతని శరీరమంతా స్వేదంతో నిండిపోయింది. ధరించిన బట్టలు ఖరీదువైనా అడ్డదిడ్డంగా చినిగిఉన్నాయి. పిచ్చివానివలె గోచరిస్తాడు. కాని, నిశితంగాచూస్తే మానవరక్తాన్ని త్రాగే పిశాచంవలె గోచరిస్తాడు.

"కమలం...కమలం" అంటూ ఆగంతకుడు తలుపు తట్టాడు. అతడి భయంకరస్వరూపంలో, స్వరంలో ఏదో వేదన గోచరిస్తోంది.

సమాధానం రాలేదు.

మరింతగట్టిగ "కమలం... కమలం" అన్నాడు.

కొంతసేపటిలో తలుపులు తెరచుకున్నాయి.

లోపలకు చొరబడి తలుపులు మూసేసాడు.

"ఏమిటిది ఫణిబాబు ?" అంది కమలం అతడి వాలకాన్ని చూస్తూ.

కమలం ఫణిబాబును ఈవిధమైన వికృతాకృతిలో చూడటం రెండవసారి.

ఈమారు అతడిరూపం క్రితంకంటె వికృతిగఉన్నది. అతడి శరీరముమీది రక్కులుఅవీ చూచి కమలం మనస్సులో ఆందోళనపడిపోయింది. క్రిందటిసారి అతడువచ్చి అన్నమాటలు గుర్తుకువచ్చి మరింత ఆందోళనపడిపోతూ, "మంజుల ఎల్లాఉంది ఫణిబాబు ?" అంది.

ఫణిబాబు నవ్వేడు.. "మంజుల..." అన్నాడు నెమ్మదిగ.

"అవును... మంజుల" అంది కమలం.

"మంజుల" అన్నాడు వెఱ్ఱిగ ఫణిబాబు.

"అవును... ఏంజరిగింది ?" కమలం మరలా ప్రశ్నించింది.

"జరిగిపోయింది" మరలా చిన్నగ నవ్వేడు.

"అంటే ?"

సమాధానంలేకుండ దొడ్డివేపు దారితీశాడు.

కమలం నిలువలేకపోయింది. గుండె దడదడలాడిపోతోంది. కాళ్ళూచేతులు ఆడటంలేదు. అతడుచెప్పే సమాధానాలు ఆమెను ఆవిధంగ చేస్తున్నాయి.

నెమ్మదిగ అతడిని వెంబడించింది.

పూర్వం మంజులనివసించే గదిలోనికి వెళ్ళాడు. అతడి హృదయం వేదనతో నిండిపోయింది. అతడి పాపాలు పరిపక్వమైపోయాయి. నిద్రాకూడా లేకపోయాడు. అందువల్లే మనశ్శాంతికై మందుత్రాగేడు. కాని ఫలితం శూన్యం.

ప్రపంచమంతా ఒక నరకంవలె గోచరిస్తోంది. ఎక్కడ చూచినా రాక్షసచర్యలే. ఎటుచూచినా తనే. అంతటా తన్ను తరుముకొస్తున్నారు.

అతడు చెయ్యరానిపని చేశాడు. అనేకులు అనేకవిధాలుగ సంరక్షిస్తున్నదానిని తను రాక్షసతత్వంతో, కామాంధతతో కన్నుకానక నీచపరచాడు. అది నీచమైనదని అతనికి తెలుసు. అయినా అతడికోరిక అతడిని అంత నీచస్థితికి ఒడికట్టించింది. కోరికను అణచుకోనలేకపోవటం అతడి హృదయదౌర్బల్యం. కాని ఆవాంఛ హృదయ దౌర్బల్యాన్ని కప్పి ముందుకు పురికొలిపింది. పర్యవసానం కోరికతీరింది. వెనువెంటనే హృదయదౌర్బల్యం బయటపడింది.

ఫణిబాబుకు మైకం కమ్మేస్తోంది.

"ఫణిబాబూ; అసలు ఏంజరిగిందో చెప్పవేం" అంది అతడిని తడుతూ.

"నువ్వు యిక్కడున్నావా? యిక్కడికెల్లా వచ్చావు. నిన్ను నేను అక్కడవుంచివస్తే! యిదిగో మంజులా క్షమిస్తావు కదూ. అయినా ప్రేమికులకు క్షమాపణలేమిటి? కాని నీయెడ చాల అమానుషంగ ప్రవర్తించానుకదూ. బాధపడుతున్నావా?

"అవును, నువ్వు అతిసుకుమారివి. అందుకే నీకంత ఆతృత. అణచుకోలేకపోయాను. దురదృష్టవంతుణ్ణి.

"పడిపోయినదానవు మరలా ఎల్లాలేచావు? ఆ మధు వచ్చాడా? వాడంటే నీకిష్టమా? నేను నీ కిష్టంకాదా? చెప్పు మంజూ? చెప్పవూ?

"నువ్వు యిల్లాచెపుతావా? నీకు ఆ కమలం మంచిశిక్షణ యిచ్చింది. అయినా ఆశిక్షణ నావద్ద ఏమీ వినియోగపడదు తెలుసా.

"నేను నిన్ను వాంఛించాను. రా... నిన్నే... రా... రావూ..."అంటూ కమలాన్ని గట్టిగా పట్టుకున్నాడు. ఆమె తప్పించుకోవాలని గిలగిల తన్నుకుంది. అతడు గట్టిగ గుండెలకు అదిమిపట్టుకున్నాడు. ఆ యినుప కౌగిళ్ళనుండి విశిపించుకోలేక పోయింది.

"ఏ, పారిపోదామనుకుంటున్నావా? మంజులా యివి ఫణి బాబు చేతులు. ఇప్పుడు నీ ప్రియమైన కమలంవచ్చి అడ్డుకుం టుందో లేక నీప్రియుడు మధుగాడువచ్చి అడ్డుపడ్తాడో చూస్తాను. లేకపోతే నీఅన్న సారథిగారువచ్చి రక్షిస్తాడో చూస్తాను" అంటూ కమలాన్ని మరింతబిగియార కౌగలించు కున్నాడు.

ఆమెకు ఊపిరితిరగక అతడి ఇనుపకౌగిలిలో గిలగిల తన్నుకొంటోంది.

అమానుషంగ ప్రవర్తించసాగేడు. మరలా అతడిలో వాంఛ తలఎత్తింది. అవయవాలు పట్లుతప్పాయి. నిలువలేక పోయాడు.

అతడిని మైకం పూర్తిగ కమ్మేసింది. కమలం అతడిచేతు లను గట్టిగ కరచేసింది. అతడి చేతులలోనుండి బయటపడింది.

ఫణిబాబు స్పృహతప్పి క్రిందపడ్డాడు.

కమలానికి అవగతమైపోయింది. ఇక తనకు మంజుల లేదు. తను మంజులను ఏ శీలంకొరకు యింతవరకూ రక్షించిందో ఆ శీలం పోయింది. ఏఆశయాలతో ఆమెను పెంచి పెద్దచేసిందో ఆ ఆశయాలన్నీ ఈ కిరాతకునిచర్యలచే వమ్ముఅయిపోయాయి. ఇక ఈ ప్రపంచములో తను ఎవరికోసం బ్రతకాలి? తనకొరకు తాను బ్రతకనక్కరలేదు. తను ఆనాడే చచ్చిపోవలసింది. కాని మంజులకొరకు తన హృదయంలో చెలరేగే తుఫానుని అణగ ద్రొక్కుకుంటూ నేటివరకూ జీవించింది. యిప్పుడా మంజులా లేదు యిక తనూ ఉండదు.

"యిద్దరూ బలిఅయిపోయారు. అమానుషంగ బలిఅయి పోయారు. పాడుప్రపంచం బ్రతకాలిఅంటుంది. ఆత్మహత్య మహాపాతకమంటుంది. మానవజన్మ ఉత్తమమైనదంటుంది.

ఏదావిలువ...? ఈ ప్రపంచం ఈ మానవజన్మకిచ్చిన విలువేది?

ఆడదానిని అబలనుచేసింది. పీకపిసికి పారేస్తుందీసంఘం. బ్రతకాలనిఉన్నా చావమంటుం దీ సంఘం.

శీలం... శీలం... పవిత్రత అంటూ ఘోషిస్తుంది. ఎందు కీ ఘోష?

శీలమునకు, పవిత్రతకు రక్షణయివ్వలేని ఈ సంఘం ఎందుకు? ఆ ఘోషఎందుకు?

సంఘీయులనడుమ, సంఘ ఆచారముల నడుమ నలిగి నశించిపోవటానికే ఆడదాని బ్రతుకు.

ఎదురుతిరిగిందా సంఘంలో నిలువలేదు.

అణగారిపోయిందా సంఘ బహిష్కృతి.

ఆకుమీద ముల్లుపడ్డా, ముల్లుమీద ఆకుబడ్డా చెడేది ఆకు. అదే స్త్రీజీవితం.

యిదే స్త్రీకి సంఘంఇచ్చిన విలువ."

ఫణిబాబువైపు చూసింది. అతడిఆకృతి ఆమెను భయపెట్టింది. ఆమె ముఖకవళికలు మారిపోయాయి.

యిప్పుడామెలో భయంలేదు. పగ... పగ. ఫణిబాబును నాశనంచెయ్యాలి, సర్వనాశనం చెయ్యాలి.

తను నిర్మించుకున్న ఊహాసౌధాలు నిజరూపందాల్చే సమయానికి నాశనం చేసివేశాడు. సర్వస్వం అనుకున్న తన మంజులను తనపొట్టబెట్టుకున్నాడు. ఇల్లా ఎంతమంది స్త్రీలను నాశనం చేశాడోకదా ఈ కిరాతకుడు. వీడు బ్రతికివుంటే ఇంకా వీడికాంక్షలకు ఎంతమంది అమాయక స్త్రీలు బలిఅయిపోతారో కదా? ఛీ... వెధవబ్రతుకు. 'మనిషి' అన్న పేరుకే అగౌరవం తెచ్చాడు.

ఈ విధంగా తలుస్తూంటే ఆమె మనస్సు మంజులమీదకు కేంద్రీకరించింది. "అక్కా...అక్కా" అని మంజుల జాలిగ ఫణిబాబు ఘాతుకచర్యలకు తట్టుకోలేక రోదనచేస్తూన్నట్లు ఆమె రూపం కనపడింది.

"అక్కా...అక్కా...ఫణిబాబు...రక్షించవా అక్కా? చచ్చిపోతాను అక్కా ... వచ్చేశాడు. ఫణిబాబు...అయిపోయింది...అక్కా అయిపోయింది. నువ్వు పరితపించే మంజుల శీలం మంటకలసింది. దానితోపాటు నేనూ మంటలో పడిపోతున్నా. రక్షించుకోలేకపోయావు. అయినా నువ్వేం చేస్తావు.

విధివ్రాత అల్లావుంది. బ్రతకలేను. ఈ పాడుప్రపంచంలో బ్రతుక లేను. ఈ అపవిత్ర మొఖమును నీకుచూపలేను. అక్కా- చూప లేను. పడిపోతున్నా...మంటలలో పడిపోతున్నా...అక్కా- క్షమిస్తావుకదూ..."

"మంజూ ఆగు వస్తూన్నా...నేవస్తూన్నా" అని అంటూ పరిగెత్తపోయింది. క్రిందపడివున్న ఫణిబాబు కాళ్ళకుతగిలి క్రింద పడింది కమలం.

సహజ స్థితిలోనికి వచ్చింది. ఫణిబాబును చూడ గనే ఆమెలో ఆవేశం పెచ్చుపెరిగి పోయింది. వణికిపోయింది. నిలవలేకపోయింది. ఆమెలో ఏభావంలేదు. క్షణకాలం అల్లా నిలబడిపోయింది. పిచ్చిదానివలె ఇంట్లోకి పరుగెత్తుకొనిపోయి దీపం తెచ్చింది.

ఆమె మనస్సు నిశ్చలమైపోయింది. వేరే ఆలోచనలేదు. పాక నలుమూలలా అంటించింది. అందినచోటల్లా అంటించింది. అంతా అంటుకుంది.

చిన్న చిరునవ్వు నవ్వుకుంది.

దానిలో భావం ఏమిటో ఈమారు గట్టిగా నవ్వుకుంది. దీపం కప్పుమీదకు విసరింది.

కప్పు అంటుకుపోయింది.

అయిపోయింది. ఆమె ఆశయాలన్నీ మంటకలిశాయి.

నవ్వుకుంటూ పాకలో ప్రవేశించింది. ఫణిబాబును చూసింది. అలాగే పడివున్నాడు. తను లోపలేవుండి తలుపులు బంధించింది.

ఆకాశాన్ని అంటుకున్నాయి మంటలు. అగ్నికి వాయువు

సహకరించింది. తుంపరతో తడిసిఉన్నా పాక భగభగ మండి పోతోంది.

కమలంలో అప్పటివరకూవున్న చిరునవ్వు మాయమై పోయింది. "మంజూ! నేవస్తున్నా ఉండు. ఈ కిరాతకుడిపని అయి పోయింది. మనుష్యులులేని ప్రపంచానికి పోదాం ఉండు" అన్నట్లు పైకప్పువైపుకు చూస్తూ నిలబడిపోయింది.

చలికి తలుపులు బిడాయించుకున్న జనం ఈ మంటలకు అప్పుడప్పుడే లేస్తున్నారు. ఒక్కొక్కరే వస్తున్నారు. కాని ఏఒక్కరూ సాహసించటంలేదు. ముందుకుపోయి లోపలనున్న వారిని రక్షించటానికి ఉన్న కొద్దిమందీ ఆ మంటల చూస్తూ ఉండిపోయారు, ఆర్పటానికైనా ప్రయత్నించకుండా.

మంజులవ్రాసిన ఉత్తరం పుచ్చుకొని సారథి పరుగు పరుగున ఒగర్చుకుంటూ వచ్చాడు. ఈ పరిస్థితిని చూచి నిశ్చే ష్టుడైపోయాడు. ముందుకు ఉరకపోయాడు. అక్కడున్నవారు గట్టిగా పట్టుకున్నారు. "చెల్లీ...చెల్లీ! ఈ దౌర్భాగ్యుణ్ణి వదలి వెళ్ళిపోతున్నావా...?" అని రోదించసాగాడు. ఇంతలోనే కప్పు కూలిపోయింది. వేడిగాలి వీచింది. "విశ్వాసఘాతకుడిని నన్ను క్షమించవూ...చెల్లీ...చెల్లీ"– అతడి అరుపులు మంటలలో కలసిపోయాయి.

అంతా ఆహుతైపోయింది. మంజుల వ్రాసిన కాగితాన్ని వదలిపెట్టేడు గాలికి ఆ కాగితం మంటలలో కలసి మండి పోయింది.

మంటలు తగ్గాయి. బోడిగోడలు నిలచివున్నాయి.

అందరి ఆశయాలు ఆహుతైపోయాయి. అందరి జీవి

తాలు పూర్ణాహుతైపోయాయి. బ్రతకాలని వాంఛించినా విధి వక్రించింది. ఎదర్చి నిలచారు. కడకు ఓడిపోయారు. ఆహుతై పోయారు. పూర్ణాహుతి అయిపోయారు.

ధర్మారావువంటి మంచివారు, కళాభిమానులు సారథి వంటి ప్రాణమిత్రులు, త్యాగులు, మధు మంజులలవంటి ఆదర్శ ప్రణయమూర్తులు, కళాకారులు, కమలంవంటి నీతికోవిదులు, పుణ్యమూర్తులు, ఫణిబాబువంటి నికృష్టజీవులు, వీరూ-వారూ అందరూ నేడో రేపో గుణగణాలతో నిమిత్తం లేక అంతరించి పోతారు.

కాని ఈ ప్రపంచ చరిత్రపుటలలో వారు శాశ్వతజీవులే! శాశ్వతకీర్తికాయులే!

బోడిగోడలు మిగిలాయి. అంతా ఆహుతైపోయి పూర్ణాహుతికాగా మిగిలాయి, స్మృతిచిహ్నంగా ఆ గోడలు! చరిత్ర లోని పుటలు!!

—)o(—